# శ్రీ రామానుజ కీర్తి కౌముది

తిరుమల తిరుపతి దేవస్థానముల వారిచే సంభావింపబడిన

## శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వము

సచిత్రము

ఐదవ భాగము




సంపాదకుఁడు

విద్యాభూషణ

ఉపన్యాసక రత్న కవితా విశారద

ధనకుధరం వరదాచార్యులు





ప్రకాశకులు

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథ మాల

శ్రీ లక్ష్మీనారాయణ పురము

గుంటూరు - 6

శ్రీ రామానుజ కీర్తి కౌముది

ఐదవ భాగము



మొదటి ముద్రణము

వేయి ప్రతులు



రక్తాక్షి - శ్రీకృష్ణ జయంతి

ఆగష్టు 1984

రామానుజ శకము ౯౬౭

మూల్యము :

ఇరువదియైదు రూపాయలు



ముద్రణము :

పోతుకుచ్చి రామకృష్ణమూర్తి, మేనేజింగ్

వెల్కం ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్

బ్రాడీపేట, గుంటూరు-2 ఫోన్ . 26081

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ

## సమాలోచన సమితి

మహా కవి - వాచస్పతి - కళా ప్రపూర్ణ

*డాక్టర్ : వానమామలై వరదాచార్యులు*

చెన్నూరు

*

మహా కవి - సరస్వతీ పుత్ర - కళా ప్రపూర్ణ - పద్మశ్రీ

*డాక్టర్ : పుట్టపర్తి నారాయణాచార్యులు*

కడప

*

వ్యాకరణ విద్యా ప్రవీణ - భాషా ప్రవీణ

*శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు, ఎమ్. ఏ.*

విశాఖ పట్టణము

*

సాహిత్య రత్న - భాషా ప్రవీణ

*శ్రీమాన్ కె. టి. యల్. నరసింహాచార్యులు*

శ్రీ గోదా గ్రంథమాలా సంపాదకులు

ముసునూరు

*

సంగీత సాహిత్య కళా నిధి

*శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు*

ఆకాశ వాణి - నిలయ సంగీత విద్వాంసులు

వి జ య వా డ

*

బాల విద్వత్కవి
శ్రీమాన్ కె వి వి.యల్ నరసింహాచార్యులు, ఎమ్ ఏ,బి.ఎల్
అడ్వొకేటు - గుంటూరు

*

చతుర్విధ కవితా చతురానన - మహా కవి
శ్రీమాన్ విక్రాల శేషాచార్యులు
శేష నిఘంటు గ్రంథ కర్తలు
కలికివాయ

*

భాషా ప్రవీణ - విద్వాన్ - లలిత కవి
శ్రీమాన్ కొమాండూరు రామానుజాచార్యులు
కందుకూరు తాలూకా రచయితల సంఘాధ్యక్షులు
సీనియర్ తెలుగు పండితులు - Z P హైస్కూలు
కందుకూరు

*

న్యాయ విద్యా ప్రవీణ
డాక్టర్ యస్ బి రఘునాథాచార్యులు ఎమ్ ఏ, పిహెచ్ డి.
సంస్కృత రీడర్ - శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయము
కో ఆర్డినేటర్ పబ్లికేషన్సు, తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

*

సాహిత్య విద్యా ప్రవీణ
శ్రీమాన్ చలమచర్ల వేంకట శేషాచార్యులు
సంస్కృతోపన్యాసకులు
శ్రీ వేంకటేశ్వర వివేక వర్ధినీ సంస్కృతకళాశాల
హైదరాబాదు

*

శ్రీమాన్ చిలకపాటి విజయ రాఘవాచార్యులు

M A (Pol), M A (Pub - Abm), D I S

లెక్చరర్ - ఆంధ్ర ప్రదే. రెసిడెన్షియల్ కాలేజి

నాగార్జున సాగర్ - విజయ పురి సౌత్

*

శ్రీమాన్ శ్రీపెరుంబూదూరు శ్రీరంగాచార్యులు, ఎమ్ ఏ

ఉపన్యాసకులు - శ్రీ వేంకటేశ్వర ప్రభుత్వ ప్రాచ్య కళాశాల

పాలెమ్

*

కవి కోకిల - విద్వత్కవి - కావ్య కళా నిధి

శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి సభ్యులు

సిద్ధిపేట

*

డాక్టర్ కె సుప్రసన్నాచార్యులు, ఎమ్ ఏ, పిహెచ్ డి

తెలుగు ప్రొఫెసర్

కాకతీయ విశ్వ విద్యాలయము

వరంగల్



# ప్రముఖులు - ప్రశంసలు

**డాక్టరు బొడ్డుపల్లి పురుషోత్తం, M A, Ph D** — నాగార్జుననగర్

శ్రీ రామానుజ కీర్తి కౌముదిలో వ్యాసాలన్నీ విద్వాంసులచేత విరచితం కావడంచేత, అవి చిలుక పలుకులుగా కాక, పరిశోధన వ్యాసాలుగా, రచయితల ధీ మాన్యతకు నిదర్శనాలుగా రూపొందుతున్నాయి ఈ గ్రంథ రాజముల మూలంగా జిజ్ఞాసువులకు భక్తి జ్ఞాన భిక్షను ప్రసాదిస్తున్నందుకు మిమ్ములను అభినందిస్తున్నాను

**డాక్టరు జి టి గోపాలకృష్ణ నాయుడు** — తిరుపతి

శ్రీ రామానుజ కీర్తి కౌముది - శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వంగా మీ యధ్వర్యాన పదునారు భాగములుగా వెలువడుచున్నందులకు ఎంతో సంతసిస్తున్నాను ఇది యీనాడెంతో అవసరం

**చింఛ్యాకట్టణం శ్రీరంగాచార్యులు, M A** — జడ్చర్ల

శ్రీ విశిష్టాద్వైత వేదాంత సిద్ధాంత పరమార్థ విశేషములను పండిత పామర రంజకముగా తేట తెల్లమగునట్లు గ్రంథముల వెలయించి, శ్రీ రామానుజ కీర్తి కౌముదిని ద్వాదశ సంపుటములుగా పరిష్కృతమొనర్పబడునట్లు తాము చేయుచున్న కృషి మిక్కిలి ప్రశంసార్హమై యొప్పారుచున్నది

**ఏలూరుపాటి అనంతరామయ్య M A B Ed** — గుంటూరు

కౌముదివలెనే శ్రీ రామానుజ కీర్తి కౌముది - ఉత్తరోత్తరాహ్లాదకర వివిధ కాంతులతో విరాజిల్లుచున్నందులకు సంతోషమైనది

**యస్ సి వి జగన్నాథాచార్యులు, A I R** — విజయవాడ

శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వ సంపుటీకరణమున మీ కృషి అమోఘము

**యం. అప్పారావు Jt Secretaru, Govt** — హైదరాబాదు

శ్రీ రామానుజ కీర్తి కౌముది - నాల్గవ భాగమును పూర్తిగా చదివినాను అందలి విషయములు ఎంతో విజ్ఞానదాయకములుగా నున్నవి అనేక విశేషములు

ఈ కౌముదివల్ల వి,ు మ,ు,యస్సవి మీరు చేయుచున్న కృషి మిక్కిలి అభినందింప దగినది

డాక్టరు యస్ వి. జోగారావు, M A, Ph D వాల్తేరు

శ్రీ రామానుజ కీర్తి కౌముది - నాల్గవ భాగమును ఆప్యాయంగా అందుకొన్నాను ఒక లోకోత్తరము, పరమ రమణీయము, అత్యుత్తమము అయిన విషయమును గురించి ఎన్నాళ్ళనుండియో మీరు చేయుచున్న క్షోదక్షమ పరిశ్రమకు నా శ్లాఘా శిరః కంపనములు

డాక్టరు కె సంపత్కుమారాచార్యులు, M A Ph D వరంగల్

ఒక చేతి మీదుగా మీరు నిర్వహిస్తున్న 'శ్రీ రామానుజ కీర్తి కౌముది' గ్రంథ ప్రచురణ మహోద్యమం - భగవత్కటాక్షంతో సమృద్ధ మవుతుందని నా విశ్వాసం

Dr Prema Nandakumar, Visakhapatnam

Thank You for Sending me the 4th part of 'Sri Ramanuja Kirthi Kumudi' What a wander ful Serving you are doing to the Sri Rumanuja Darsana by publishing Such Collections that Contain meritorious articles May the Divin Mother Shower Her grace on your work and may your work Continue to prosper





శ్రీనివాసాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ సంప్రదాయము

శ్రీ సంప్రదాయము విశాలాదర్శములు కలిగి, భవసంతరణమునకు మార్గదర్శకమై, ఆస్తికులకు శిరోధార్యమై యలరారుచున్నది.

ఈ సంప్రదాయమున - సర్వ రక్షకుడగు విష్ణువే ఆరాధ్య దైవము 'విష్ణువు' అనగా - అంతటను వ్యాపించియుండువాడు. ఈ విష్ణువు అందరికంటెను అధికుడగు కావున, విష్ణువు 'మహావిష్ణువు'గా విఖ్యాతిగాంచెను అట్టి మహావిష్ణువును జగన్మాతయైన శ్రీదేవి ఎన్నడును వీడి యుండదు గనుక, మహావిష్ణువు — 'శ్రీమహావిష్ణువు'గా కీర్తింపబడుచున్నాడు. అట్టి శ్రీదేవియే శ్రీవైష్ణవ సంప్రదాయమునకు ప్రథమ ప్రవర్తిక. కనుకనే ఈ సంప్రదాయము — శ్రీ సంప్రదాయమను పేర ప్రశస్తి వహించినది.

ఈ సంప్రదాయమునకు ఆళ్వారాచార్యులు మూలస్తంభములు ఆళ్వారులలో అగ్రజాతి మొదలు, అంత్యజాతి వరకును అనేక వర్ణములవారున్నారు వారెల్లరును దివ్యసూరులుగా లోకమున సుప్రసిద్ధులు వారు రచించిన 'నాలాయిర దివ్య ప్రబంధము' భక్తి ప్రపత్తులకు ఆలవాలము పన్నిద్దరాళ్వారులలో — నమ్మాళ్వారులు ప్రముఖులు ఆచార్య పరంపరలో — నాథమునులు ప్రథములు ఏ రిరువురును మహాయోగులే

# విషయానుక్రమణిక

— ❋ —

* * *

ఆళ్వారులలో నమ్మాళ్వారుల యనంతరము — తిరుమంగయాళ్వారులు, కులశేఖరాళ్వారులు, పెరియాళ్వారులు, ఆండాళ్ మున్నగువారు ముఖ్యముగా పేర్కొనఁదగినవారు.

ఆచార్యులలో నాథమునులకు పిమ్మట, వారి పౌత్రు లగు యామునాచార్యులు ఉద్దండ పండితులుగా - వైరాగ్య సంపన్నులుగా - శ్రీ సంప్రదాయ ప్రతిష్ఠాపకులుగా ప్రసిద్ధి గాంచిరి.

వారి తరువాత - భగవద్రామానుజులు, వేదాంత దేశికులు, పిళ్ళలోకాచార్యులు, మణవాళ మహామునులు మున్నగు మహనీయులు ఈ సంప్రదాయమును సర్వత్ర పరివ్యాప్తము గావించి, సంప్రదాయ ప్రవర్తకులుగా - జగదాచార్యులుగా కీర్తి నార్జించిరి.

అట్టి మహనీయుల చరిత్రాంశములను, సంప్రదాయ విశేషములను 'శ్రీ రామానుజ కీర్తి కౌముది' షోడశ కళలలో వెలయించు సంకల్పించినది. తదనుసారము ఇంతకు మున్ను వెలువడిన నాల్గు కళలును - పండిత ప్రశంసలకు పాత్రము లగుట - అత్యంతము సంతసింపఁదగిన యంశము. ఇప్పు డిది పంచమి. ఇదియు - పాఠక లోకమునకు పరమార్థమును ప్రసాదింపఁగల దని మా విశ్వాసము.

ఈ గ్రంథ ముద్రణమునకు ఆర్థిక సహాయము గావించిన తిరుమల తిరుపతి దేవస్థానములవారికి మా కృతజ్ఞతాభివందనములు.

— ప్రకాశకులు.

# విషయానుక్రమణిక

— ✻ —

# శ్రీ వేంకటేశ స్తుతి

భాషాప్రవీణ - విద్వాన్ [illegible] - కవిరత్న

**శ్రీ వంగవోలు ఆదిశేషశాస్త్రి**, ఎం.ఏ., ౧యిది

—※—

శ్రీ రామానుజ! రాధికా రమణ! శౌరీ! వల్లవీ వల్లభా!
రారా! గోప కిశోర! రార! సుమనోరాధ్యా! యశోదా కుమా
రా! రారా! త్రిజగన్మనోహర! లస ద్రాజీవ నేత్ర! సుగా
త్రా! రారా! మముఁ బ్రోవ రార! పరమాత్మా! వేంకటేశ ప్రభూ!

నీ పాదాబ్జ మరంద పానమున నిర్నిద్ర ప్రభావంబు, స
ద్వ్యాపారంబును గాంచినారలుగదా! బ్రహ్మాది దేవాళి, మా
పాపంబుల్ హరియింప నీచరణ సేవా భాగ్య మీయంగదే!
కాపాడంగదె సత్కృపాబ్ధి యకలంకా! వేంకటేశ ప్రభూ!

సకలంబున్ సృజియింపఁ, బెంప, నడపన్ సామర్థ్య యుక్తుండవై
ప్రకటానన్య సులీలలన్ వెలయుచున్ బ్రహ్మాండ భాండమ్ములం
దకలంకం బగు సర్వ వస్తువులలో నత్యంత మొప్పారు స
త్య కళా పూర్ణ! కృపా ప్రపూర్ణ! జగదీశా! వేంకటేశ ప్రభూ!

నెరవేరుంగద మా యభీష్ట మెపుడేనిన్ నిత్య కల్యాణ భా
సురమౌ పచ్చని తోరణంబు వెలయన్ సుజ్ఞాన దీక్షంబుగా
సుర గంధర్వ సమర్చితాసుల పదాబ్జున్ నిన్ను గన్గొన్న ధీ
వరు లప్రశాంత మనః ప్రశాంతిఁ గన దేవా! వేంకటేశ ప్రభూ!

దిక్కున్ మ్రొక్కును లేని మాదృశుల సంధీభూత చేతస్కులన్
చక్కన్ బ్రోవఁగ నీవు దక్క నితరుల్ సామర్థ్య సంపన్నులా?
నిక్కం బీవు ప్రపన్న కల్పకమవై, నిత్య ప్రసన్నుండవై
యి క్కొండన్ నెలకొన్న వాఁడవయ స్వామీ! వేంకటేశ ప్రభూ!

వ్యాసాదుల్ కవితా ప్రసాదులు, మునుల్ వర్ణింపఁగా లేనిదౌ
నీ సౌశీల్యము, నీ మహత్వము భళీ! నీ భక్త వాత్సల్యమున్
నీ సౌందర్యము, నీ యఖండ కృప వర్ణింపఁగ శక్యంబె? తం
డ్రీ! సాకల్యముగాఁగ బ్రోవు శరణార్థిన్ వేంకటేశ ప్రభూ!

భువనం బెంతయు వెల్గుచు స్వయంభూ! సప్త శైలాధివా
స! విలాసం బది యేల? సద్ధృదయ వాసం బుండ మా హృన్నివా
స! విలాసం బది యేల? మాధవుఁడవై సాక్షాత్కరింపంగ, చే
లవు పద్మావతి కేలు బట్టుటది యేలా? వేంకటేశ ప్రభూ!

నీ కల్యాణ మఖండ వైభవముతో నిచ్చల్ ప్రవర్తిల్ల, నీ
లోకం బాశ్రిత కల్పకం బయి మహా లోకంబుగా వర్తిలున్
లోకాలోక విరాజమాన! సుయశోలోకా! జనానీక సు
శ్రీ కల్యాణ విధాయకా! సతు లివే శ్రీ వేంకటేశ ప్రభూ!

శ్రీ లోలా! కరుణాలవాల! వరదా! శేషాచలావాస! స
చ్ఛీలా! భక్తజనావనోద్యమ! కళాశ్రేయో నిధానా! జగ
జ్జాల స్తుత్య పదారవింద యుగళా! సౌందర్య రత్నాకరా!
నీలాంభోధర దివ్య కాంతిమయ! తండ్రీ! వేంకటేశ ప్రభూ!

నిత్యానంద నికేతనాంఘ్రి యుగ! నిర్నిద్రానుకంపాస్య! సాం
గత్యప్రీణితపార్థ! భక్త సులభా! జ్ఞాన స్వరూపా! రసౌ
చిత్య శ్రీ విభవాభిరామ కవితా శ్రీ లిచ్చి పాలింపవే
సత్యాసత్య వివేచన ప్రవణ! భాస్వ ద్వేంకటేశ ప్రభూ!

ఇలకున్ డిగ్గి, కృపాకరుండ వయి తండ్రీ! మమ్ముఁ బాపాత్ముఁన్
స్థల మాహాత్మ్యము - రూప వైభవము - భక్త త్రాణ పారీణతా
విలస త్పాణి సరోరుహ మ్మెసఁగఁ బృథ్విన్ నిత్య కల్యాణ శో
భల నుద్ధార మొనర్ప నిల్చితివి దేవా! వేంకటేశ ప్రభూ!

ఇహ మైనం, బర మైన, నే దయిన, సాహిత్యంబు, రాహిత్యమో
విహితం బైనది నీ వొసంగెదవు – నిన్వేడంగ నేలా ? దయా
రహితంబౌ హృదయంబు – నిన్ను విడి, గర్వాచ్ఛన్నమౌ జీవనం
బు హరింపంగదె! భక్తి యీగదె! స్వయంభూ! వేంకటేశ ప్రభూ!

నీ నామంబు జపించినం దలఁగవే నిక్కంబుగాఁ బాపముల్
మా నింద్యం బగు జీవితంబులకు 'ఫుల్ స్టా' పింక బెట్టించి, సు
జ్ఞానానందమయాత్ములన్ సలుప, నీ నామంబు మా జిహ్వలం
దేనాడున్ వసియింపఁ జేయగదె తండ్రీ వేంకటేశ ప్రభూ!

ధ్రువుఁ డత్యుగ్ర తపంబు సేయఁగను సంతోషించి ప్రత్యక్షమై
నవ నీరేరుహ లోచనుండవయి, 'యన్నా! కోరుమా!' యన్న, నిన్
స్తవమున్ జేయఁగ శక్తి యుమ్మనఁడె ? నీ శంఖమ్ము తన్మూర్ధముం
దవులం జేసి యనుగ్రహింపవె ? యనంతా! వేంకటేశ ప్రభూ!

ఒక వార్బిందువు వారిధిం గలిసి నిత్యోల్లోల కల్లోల సం
ప్రకటాంభోనిధి నంచులో నెనయు గర్వస్ఫూర్తి వారాశి పే
డి, కణాకారముఁ జెంది రూపఱును, నట్లే – నిన్ను నిత్యంబుఁ బా
యక వర్తించు నతండు నిన్విడి చెడుంగా వేంకటేశ ప్రభూ!

దేవా! నీ కరుణా కటాక్షమున భక్తి జ్ఞాన వైరాగ్యముల్
సేవా భావము లబ్బు, షడ్రిపు జయశ్రీ లబ్బు, కాయంబుతో
కైవల్యం బది కొంగు బంగ రగు, దీక్షా దక్షతల్ – నిత్య తే
జో వైదుష్యము లొక్క లెక్కయె ? నమస్సుల్ వేంకటేశ ప్రభూ!

నిత్య శ్రేయము లీయఁజాలు సుగుణానీకంబునం దేఁదు నా
స్నత్యంబందుఁ 'ప్రపత్తి' యంచు, రది విజ్ఞానంబునా నొప్పు సా
హిత్యశ్రీ విభవంబునన్ వెలయు, లక్ష్మీశా! భవ ద్పాద సాం
గత్యాభ్యున్నతిఁ గూర్పుమయ్య! శ్రిత పక్షా! వేంకటేశ ప్రభూ!

శ్రిత మందార! విపన్నివార! విజయ శ్రీదా! సహస్రాక్ష వం
దిత పాదా! భృగు మౌని మానస తమోఽదిత్యా! మనుం బ్రోవవే!
క్రతు సాఫల్య ఫల ప్రదాన నిపుణా! కల్యాణ సంధాన! ని
ర్మిత వేధోండ వితాన! నమ్మితిమి నిన్ శ్రీవేంకటేశ ప్రభూ!

వేదమ్ముల్ పరియింపఁజాలము - భవద్విఖ్యాత చారిత్రముల్
వేదాంతమ్ము లెఱుంగఁజాలము కృపాబ్ధీ! సద్వ్రత ధ్యానముల్
శ్రీ ద్వైవారనో సర్వజాల మెటు రక్షింతో మమున్, దాసులన్
శ్రీదా! నమ్మితిమయ్య! నీ చరణముల్ శ్రీవేంకటేశ ప్రభూ!

తిరుమంత్రం బుపదేశమున్ సలిపి, ముక్తిశ్రీద మిద్దాని నీ
వు రహస్యంబుగనే జపింపవలె నావుండున్ తదాచార్య భా
స్వరు నాజ్ఞ న్నిరసించి, యెల్లరకు ముక్తి ద్వాః కవాటంబులన్
దెరపించెన్ యతిరాజమౌళి కరుణాబ్ధీ! వేంకటేశ ప్రభూ!

గురుఁ డద్దానినిఁ జూచి యుగ్రుఁ డయి, 'నీకుం నారకం' బన్న, 'ని
న్నరు లెల్లన్ దరియించినన్, నరకమైనన్ నాకు సమ్మోదమే,
వరమే' యన్న మనీషిఁ ద్రిజగద్వంద్యుం బ్రశంసింతు ము
ర్వర రామానుజ త్యాగ భాజను సుధర్మా! వేంకటేశ ప్రభూ!

నీ లావణ్య మగణ్యమౌ మకుట మాణిక్య ప్రభల్ నీదు హ
స్తాలంకారములైన కైదువులు వక్షస్సీమ వర్తించు ల
క్ష్మీ లీలావతి నీ గళంబున సదా చెల్వొందు హారంబు స
త్యాలాపాది మనోజ్ఞ సద్గుణము లేనా వేంకటేశ ప్రభూ!

నీ కల్యాణ గుణ ప్రకాండమె నినున్ సేవించుచున్ నీ మనో
జ్ఞాకారంబును జూడవచ్చిన భవధ్యానైక పారీణులన్
శ్రీ కల్యాణ యుధాయుష్మై మనుచు రాజీవాక్ష! ప్రత్యక్ష మూ
ర్తీ! కైవల్య మొసంగి ప్రోవఁగదె తండ్రీ! వేంకటేశ ప్రభూ!

ధన ధాన్యమ్ములు - వస్తు వాహనములన్ తండోప తండమ్ములై
నను, భోగ్యమ్ములు పెక్కులైనను సదానందమ్ము సంధించునే
యనఘా ? నీ పద భక్తి లేని యెడ భక్త్యానంద మాధుర్య ని
త్య నివేశం బగు భావ సంతతుల నిమ్మా ! వేంకటేశ ప్రభూ !

ఎటు గన్నన్ గనుపింతు వీవె నిధివై యీ జీవ జాలమ్మునన్
చటు లాకారముతోడ నైనఁ గనఁగా జాలండు మోహమ్మునన్
గట ! తన్మూర్ఖతఁ బాపఁగా నెపుడు సాక్షా ద్వేంకటేశాకృతిన్
స్ఫుట లీలన్ నెలకొంటి వీ తిరుమలన్ భో వేంకటేశ ప్రభూ !

ఏ నీ పాద సరోజముల్ గడిగి శ్రీ నిచ్చెన్ బయోరాశి ము
న్నా నీ పాద సరోజముల్ గడిగి కన్యా దానముం జేసి, ధ
న్యానీకంబున నగ్ర గణ్యుఁ డగు నీ యాకాశరా ట్పుణ్యమే
శ్రీ నారాయణ ! పుణ్యమా సుగుణ రాశీ ! వేంకటేశ ప్రభూ !

వని దావాగ్ని దహించి రూపఱ నొనర్పం జాలు లీలన్ జగ
జ్జనకా ! నీ దగు వేంకటాహ్వయము పెల్చన్ జన్మ జన్మాంతరా
ఘ నికాయంబు హరింపజాలు ద్రుటి, నిక్కం బిద్ది లోకైక పా
వన ! దీనావన ! శ్రీ రమా రమణ ! దేవా ! వేంకటేశ ప్రభూ !

ఏడుం గొండల వాఁడ ! యేడుగడవై యీరేడు లోకాలఁ గా
పాడం గంకణ మూనినట్టి దొర ! నిర్ద్వంద్వాకృతీ ! శ్రీపతీ !
వేడం బోము త్వ దన్య దైవముల, నిన్వీడంగబో మెన్నఁడున్
వీడం బోకుము మమ్ము దీనుల కృపాబ్ధీ ! వేంకటేశ ప్రభూ !

అవతారంబులు పెక్కు దాల్చితిగదయ్యా ! నిత్య కల్యాణముల్
స్తవనీయం బగు పచ్చ తోరణము నీ శైలంబునన్ దక్క నూ
నవ కల్యాణము గోరి కాంచితివె యేనాఁ డైన వడ్డీలతో
డ వసూల్ చేసితె కానులన్ ? బుధ జనేడ్యా ! వేంకటేశ ప్రభో !

వర కాంచీపతి యొక్కఁడే కృత యుగ ప్రత్యక్ష దైవంబు , త
త్పరతన్ త్రేతను రంగశాయి యొకఁడే ప్రత్యక్ష దైవంబు , గా
న రసానందుఁడు ద్వాపరంబున జగన్నాథుండె దైవం బటం
దురు , శ్రీ వేంకటనాయకుండె కలి నంచున్ వేంకటేశ ప్రభూ !

శాంతాకార ! భుజంగశాయి ! సుర రక్షా ! పద్మనాభా ! యఘ
ధ్వాంతాదిత్య ! మహా మునీంద్ర హృదయ ధ్యానైక గమ్యా ! మన
శ్చింతాదూర ! వినీల వర్ణ ! వర లక్ష్మీ కాంత ! యాశాంత వి
శ్రాంతానంత యశో నివేశ ! పరమేశా ! వేంకటేశ ప్రభూ !

స్ఫుర దిందీవర లోచనా ! యదు కులాంభోరాశి రాకా శశీ !
నరసింహాచ్యుత ! వాసుదేవ ముఖ నానా నామ రూపాత్మకా !
హరి ! నారాయణ ! విశ్వరూప ! విమలా ! యామ్నాయ సంస్తుత్య నీ
చరణాంభోజము లాశ్రయించితిమి శ్రీశా ! వేంకటేశ ప్రభూ !

తెరలో నుండిన నిన్ను వెల్వఱచె భక్తిం బాడి త్యాగయ్య, శం
కరు నాజ్ఞన్ తరికొండ వేంకమ తిరస్కారంబు గావింప ని
ష్ఠురతన్ గోసిన కేశముల్ మొలిచె, నస్తోకంబుగాఁ డిత్ క్షణం
బె రహిన్ ద్రౌపది వల్వ లట్లు కరుణాబ్ధీ ! వేంకటేశ ప్రభూ !

హారలున్ దండను లావరించుచును, కర్పూరంబు వెల్గించుచున్
వర ధూపంబులు వైచుచున్ శిశువులన్ బంధించి స్తంభాల క
క్కారతో వేలము వేసి, త ద్ధనము జోకన్ నీకు నర్పించుచున్
వరముల్ గొందురు పెక్కు నీ వలన దేవా ! వేంకటేశ ప్రభూ !

తల నీలా లిడి, నిల్వు దోపు లిడి, విత్తంబున్ సమర్పించి, కా
సుల పేర్లిచ్చి, సువర్ణ భూషణపు రాసుల్ పెక్కు లర్పించి, భ
క్తులు సంతోషము గాంత్రు - పుష్కరిణిలో తోయావగాహంబు, తీ
ర్థ లస త్స్నానము లాచరించి గుణవంతా ! వేంకటేశ ప్రభూ !

హరి ! గోవింద ! ముకుంద ! కేశవ ! అధోక్షజా ! హృషీకేశ ! శ్రీ
ధర ! సంకర్షణ ! వాసుదేవ ! యదవా ! దామోదరా ! అచ్యుతా !
నరసింహా ! పురుషోత్తమా ! మధు రిపూ ! నారాయణా ! వామనా !
వరదా ! కృష్ణ ! జనార్దనా ! కమల నాభా ! వేంకటేశ ప్రభూ !

వైకుంఠం బది యేమి యెక్కడె భవ ద్వాసంబు గాకున్నచోఁ
బ్రాకామ్యంబు లొసంగుచున్ తిరుమలన్ పద్మాక్ష ! నీ వుండుటన్
ప్రాకట్యంబున సంపదన్ కలి యుగ ప్రత్యక్ష వైకుంఠమై
శ్రీ కంఠాప్త నిషేవ్యమై యలరదే ? శ్రీ వేంకటేశ ప్రభూ !

నరుఁ డాత్మీయ సుఖోన్నతు ల్వడయ నిన్ దర్శించుచున్నాఁడు - పా
మరుడం చెంచక వాని కిష్ట మగు కామ్యమ్ముల్ ప్రసాదించి, ప
ల్మరు దర్శింపఁగఁ జేసి, త ద్ధృదయ నైర్మల్యంబు నెచ్చించి, భ
క్తి రసావిష్టు నొనర్చి ప్రోతువు కృపాబ్ధీ వేంకటేశ ప్రభూ !

పూజా భాజన యుష్మదీయ చరణాంభోజమ్ములన్ గొల్చుచున్
రాజీవాయత లోచనా ! నరులు సామ్రాజ్యాది భోగంబులన్
సౌజన్యంబును, సౌఖ్య సంతతులు విస్తారంబుగాఁ గాంచి, యీ
పై జన్మాంతర దుఃఖముల్ గనరు దేవా ! వేంకటేశ ప్రభూ !

కమలాకారములైన చక్రముల పట్కమ్మున్ విలంఘించి, మూ
ర్ధమునన్ మానస రాజ హంసము సహస్రారాబ్జముం జేరి, మో
క్ష మహానందము నందులాగు గిరి పట్కం బెక్కి నిన్గాంచు స
ప్తమ శైలోపరి దేహ ధారి పరమాత్మా ! వేంకటేశ ప్రభూ !

యావ ద్భారత దేశవాసు లన నేలా ? విశ్వ విశ్వంభరా
ప్రావిర్భూత మహా జన ప్రతతి నీ రక్షా చణాంఘ్రి ద్వయీ
సేవార్థం బరుదెంచి, మ్రొక్కు బడులన్ జెల్లించి, పెండ్లిండ్లు ము
న్నౌ వానిన్ జరిపించుకొంద్రు పరమేశా ! వేంకటేశ ప్రభూ !

నీ సౌందర్య విభూతి యేమొ ! సిరి యొన్నే రూపముల్ దాల్చి, వి
శ్వాసం బొప్ప దెసల్ చరించియు భవత్సాన్నిధ్య మాశించి, తా
రాసుల్ రాసులు గాఁగఁ జేరు నిను నా రాకా శశాంకాస్య యా
యానంబున్ సఫలంబు సేయఁ గొనుమయ్యా వేంకటేశ ప్రభూ !

కరముల్ శ్రీకరముల్ పదాంబురుహముల్ వైకుంఠ ఘంటాపథ
స్ఫురణమ్ముల్ వరదాభయంకరములై చూపట్టు భావత్కముల్
వర హీరంబులు, రత్నహారములు, ద్రవ్యంబుల్, కిరీటాంగదాం
బరముల్ భక్తుఁ డెవండు గోరు నిను దేవా ! వేంకటేశ ప్రభూ !

పరమామ్నాయ శిరోనటచ్చరణముల్ వంద్యమ్ములై యొప్ప నిం
దిర, శ్రీవత్సము, కౌస్తుభం బురమునన్ దీపింప భర్మాంబర
బులై చుంగులు వాఱ నెమ్మొగము సొంపుల్ నింపఁ బ్రత్యక్షమై
'చిర వాంఛా ఫల సిద్ధిర' స్తనగదే శ్రీ వేంకటేశ ప్రభూ!

కను లున్నందుకు నిన్నుఁ జూడఁగల భాగ్యం బబ్బె, పాణి ద్వయం
బును గన్నందుకు నీ పదాంబుజ యుగమ్మున్ గొల్చు భాగ్యమ్ము గ
ల్గెను , జిహ్వాంచల మున్నయందులకు నిన్ గీర్తించు భాగ్యమ్ము గ
ల్గెను , మమ్మున్ గరుణించి కావు మిఁక లక్ష్మీ వేంకటేశ ప్రభూ !

* * *

'శ్రీ రామానుజ కీర్తి కౌముది' జగజ్జేగీయమానప్రభా
పూరమ్మున్ వెలయించి, భక్తి విభవంబున్ సుప్రతిష్ఠించి, ల
క్ష్మీ రాజీవ దళాయతాక్ష కరుణార్ద్రీభూత చేత స్సుధా
ధారా ప్లావిత సల్ప్రోచుత ధరా తన్వంగి నశ్రాంతమున్.





శ్రీ భగవద్రామానుజులు

# ఆళ్వారుల విశిష్ట భావములు

'విద్యా భూషణ - కవితా విశారద'

**శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు**

*శ్రీరామానుజ కీర్తి కౌముదీ సంపాదకులు*



భారతీయ భక్తి సాహితీ మహోద్యానమున విరిసిన సుగంధ సుమ రాజము ఆళ్వారుల నాలాయిర దివ్య ప్రబంధము ఆ దివ్య ప్రబంధమును సమాలోకించినయెడల, అందు - అతి విశిష్టములు, అవశ్య గ్రహణీయములు నగు ఆళ్వారుల భావనాపర పర లనేకములు కనవచ్చును. అట్టివానిలో - భక్తి వైభవము, నామ మాహాత్మ్యము, స్తోత్ర ప్రాశస్త్యము, ప్రపత్తి ప్రాముఖ్యము, ఆచార్య ప్రభావము, భాగవత సత్సంగ ప్రయోజనము, వైరాగ్య వైశిష్ట్యము అను నవి యెంతయును అత్యంత ప్రధానములైనవి

## భక్తి వైభవము

" భక్తి రేవైనం గమయతి భక్తి రేవైనం దర్శయతి భక్తి వశః పురుషః "

భక్తియే భగవంతుని పొందించును భక్తియే భగవంతుని దర్శింపఁజేయును. భగవానుఁడు భక్తికి వశుఁడు' అను ఉపనిష ద్వాక్యమును ఆధారముగ నిడుకొని, భక్తి ప్రభావమును అనుభవ పూర్వకముగ గ్రహించి, ఆ భక్తి వైభవమును ఆళ్వారులు లోకమునకు వ్యక్తము గావించియున్నారు.

'సాంసారికము లగు దుఃఖములనుండి విడువడి, పరమానందమును పొందవలె నన్న, యోగము - తపస్సు మున్నగున వేవియు

ఉపకరింపజాలవు. కేవలము భక్తి యొక్కటియే ముక్తిని ప్రసాదించును' అని తిరుమళిశై యాళ్వారులును -[1]

'శరీరమును కష్టపరంపరలకు గురి గావించి, కఠోరమైన తపస్సు చేయనక్కరలేదు. జనన మరణములను జయించుటకు భక్తి యొక్కటియే సులభమైన మార్గము'[2]

'క్రూర మృగములు సంచరించు దుర్గమారణ్యముల కేఁగి, అందొక తావున పంచాగ్నుల నడుమ ఆసీనులై, యోగమున నిమగ్నులు కానక్కరలేదు. భక్తి మార్గము నాశ్రయించువారికి క్లేశములన్నియు తొలఁగిపోవును' అని తిరుమంగ యాళ్వారులును -[3]

'భగవంతుని యందుఁ గల అనురక్తియే భక్తి. భగవానుని స్మరించిన మాత్రమున, ఆ భగవానుఁడు భక్తుని హృదయమున అధివసించును. భక్తివలన లభించు సుఖము - స్వర్గ సుఖము కంటెను మేలైనది' అని తొండరడిప్పొడి యాళ్వారులును-[4]

'ఓ భగవానుఁడా! నేను స్వర్గ సుఖమును వాంఛింపను. కేవలము భక్తిభావముతో నిన్ను సేవించుటయే నాకర్తవ్యము' అని ఎల

---

1 నాన్ముగన్ తిరువన్దాది 79

2 "ఊన్వాడ వుణ్ణాదుయిర్ కావలిట్టు
ఉడలిఱ్పిరియ ప్పులన్నైన్దుమ్ నొన్దు
తామ్వాడ త్తవమ్ శెయ్యవేణ్డా"

— పెరియ తిరుమొழி 3-2-1

3 "కాయోడునీడు కనియుణ్డువీశు
కడుఙ్గాల్ నుగర్న్దు - నెడుఙ్గాలమైన్దు
తీయోడు నిన్ఱు తవఞ్జెయ్య వేణ్డా"

— పెరియ తిరుమొழி 3-2-2

4 తిరు మాలై . 2

శేఖరాళ్వారులును[5] భక్తి మార్గమునందుఁ గల తమ తమ ఆసక్తిని, విశ్వాసమును వెల్లడించియున్నారు

'భక్తి కేవలము సాధన మాత్రమె కాదు, సాధ్యము కూడనై యున్న' దని నమ్మాళ్వారులు భక్తి వైభవమును బహు భంగులుగా కొనియాడియున్నారు[6]

'భక్తి మార్గమున పయనించువారు - తమ జాతిని, కులమును విద్యను, ధనమును పరిగణింపవలసిన యవసరము లేదనియు, ప్రాకృతము లగు హెచ్చు తగ్గులు భక్తి మార్గమున పయనించువారికి మాత్రము అడ్డురావనియు ఆళ్వారులు వివరించి యున్నారు

ఆళ్వారులలో కొందఱు నిమ్న జాతులవారును, మఱి కొందఱు నిరుపేదలైనవారుఁగూడ గలరు అయినను, వారెల్లరు పరమ భక్తాగ్రేసరులైన కారణమువలననే సమాన గౌరవమును పొందుచున్నారు.

అగ్ర వర్ణమునందు జన్మించిన మధురకవి యాళ్వారులు - చతుర్థ వర్ణమునకుఁ జెందిన నమ్మాళ్వారులను గురువుగా సంభావించి, వారిని సమాశ్రయించుటఁబట్టియు, ఆళ్వారు లందఱకు అవనిలో సమాన స్థానము లభించుటనుఁబట్టియు అప్రాకృతమైన పరమ పదము నపేక్షించు భగవద్భక్తులకు ప్రాకృతములైన కుల గోత్రాదు లేమాత్రము పరిగణనీయములు కావనియు స్పష్టమగుచున్నది. ఈ యంశమును ఆళ్వారు లందఱును ఏకగ్రీవముగ అంగీకరించియున్నట్లు వారి దివ్య ప్రబంధములే ధ్రువపఱచుచున్నవి -

'దివ్యమైన భక్తి మార్గమునందు పయనించువారిలో - వివిధ జాతులవారుండుట సహజము. అయినను, వారు భగవద్భక్తు లగు

5 పెరుమాళ్ తిరుమొళి 4 - 6.

6 తిరువాయి మొళి 3-1-8.

టచే, వారికి సేవ గావించుటలో వెనుకంజ వేయరాదు భగవంతుని వలెనే భక్తులును పూజార్హులు'[7]

'నాల్గు వేదములను సాంగోపాంగముగ అధ్యయనము గావించిన బ్రాహ్మణుఁడైనను - భగవద్భక్తి లేకున్న, అతఁడధముని వలెనే పరిగణింపఁబడును నిమ్న జాతిలో జన్మించినవాఁడయినను - భగవంతుని భక్తి మార్గమున పయనించెనేని, అతఁడధికుఁడు'[8] అని తొండరడిప్పొడి యాళ్వారులు నొక్కి వక్కాణించియున్నారు

## నామ మాహాత్మ్యము

భక్తి సాధనమున భగవన్నామమును స్మరించుట, కీర్తించుట, శ్రవణము చేయుట అనునవి విశేష ఫలప్రదము లని భక్తి శాస్త్రము లుద్ఘోషించుచున్నవి విష్ణు సహస్ర నామములలో ఏ యొక్క నామమును స్మరించినను, ధ్యానించినను, కీర్తించినను, శ్రవణము గావించినను మనో వాక్కాయము లనఁబడు త్రికరణములవలనఁ గల్గిన పాపము లన్నియు పటాపంచ లగు ననియు, అందువలన మనస్సులో పవిత్ర భావము లేర్పడి, శ్రద్ధాసక్తులు వృద్ధి యగు ననియు తిరుమంగ

7 పళుదిలా వొళుగలాత్తు ప్పళమ్పెదిమార్కళ్
ఇళి కులత్తవర్ కళేలుమ్ ఎమ్మడియార్ కళాగిల్
తొళుమినీర్ కొడుమిన్ ఎన్ను నిన్నోడుమొక్క
వళిపడ అరుళినాయ్ పోల్ మదిల్ తిరువరఙ్గత్తానే

— తిరు మాలై 42

8 అమరవోరఙ్గమాఱుమ్ వేదమోర్ నాన్గుమోది
తమర్కళిల్ తలైవరాయశాదియన్దణర్ గళేలుమ్
నుమర్కళై ప్పళిప్పరాగిల్ నొడిప్పదో రళవిల్ - ఆఙ్గే
అవర్కళ్ తామ్ పులైయర్ పోలుమ్ అరఙ్గమాన గరుళానే,'

— తిరు మాలై 18

యాళ్వారులు ప్రబోధించియున్నారు[9] అట్టి శ్రద్ధాసక్తులవలన భగవ
త్సేవయం దభిరుచి యేర్పడును దానివలన భగవద్భక్తి యభివృద్ధి
జెందును అట్టి భక్తివలన సత్త్వగుణము దీపించును దానివలన భగవ
త్సాక్షాత్కార భాగ్యము లభించును అటు పిమ్మట మోక్షప్రాప్తి
కల్గును ఇట్టి యంశములే ఆళ్వారుల దివ్యప్రబంధములలో వివరింపఁ
బడినవి

'పవిత్రతను చేకూర్చు నారాయణ నామ మహిమను నేను
గుర్తించితిని ఆ నామము మహాభాగ్యము నొసంగును భక్తుల కష్టము
లను, దుఃఖములను నిర్మూలించును భగవదనుగ్రహమునుఁ గల్గించును
దివ్య శక్తిని చేకూర్చును. తల్లి కంటెను ఎక్కువ మక్కువఁ జూపును
ఆ భగవన్నామము శుభకరమైనది' అని తిరుమంగ యాళ్వారులు
తెలిపియున్నారు[10]

'భగవంతుని నామములలో మీ కభిరుచి గాఁ గల నామములను
మీ బిడ్డలకు పేరుగాఁ బెట్టుఁకు నామ మహిమ అద్భుతమైనది
కనుక, భగవన్నామములను బిడ్డలకు పేర్లుగాఁ బెట్టుటవలన ఆ బిడ్డ
లను పిలిచినపుడు - భగవంతునిఁగూడ స్మరించినట్లగున, ఈ రీతిగ
భగవన్నామము నుచ్చరించుట - సర్వులకును శ్రేయస్కరము' అని
పెరియాళ్వారులు ప్రబోధించియున్నారు.'[11]

---

9 కులన్తరుమ్ శెల్వన్దన్దిడుమ్ అడియార్ పడు తుయరాయిన వెల్లామ్
నిలన్తరఞ్జెయ్యుమ్ నీళ్ విశుమ్బరుళుమ్ అరుళొడు పెరునిలమ్ అళిక్కుమ్ '
— పెరుమాళ్ తిరుమొళి 1-1-9

10 వలన్దరుమ్ మత్తుమ్ తన్దిడుమ్ పెత్తతాయినుమ్ ఆయిన శెయ్యుమ్
నలన్దరుమ్ శొల్లై నాన్ కణ్డు కొణ్డేన్ నారాయణా వెన్నుమ్ నామమ్
— పెరుమాళ్ తిరుమొళి 1-1-9

11. పెరియాళ్వార్ తిరుమొళి 4-6-1 నుండి 10 వరకు

ఇట్లే ఆళ్వారు లందఱు నామ మాహాత్మ్యమును విశేషముగ కొనియాడినట్లు, ఈ క్రింది సూక్తుల వలన తెలియనచ్చును -

'మన పాపములను, దోషము ను నారాయణ నామము రూపు మాపును'[12]

'భగవన్నామమును ధరించువాఁడు నరకమును పొందఁడు'[13]

'ఓ మనస్సా ! భగవన్నామమును మననము చేయుము దాని వలన నీవు తరింపగలవు'[14]

'భగవన్నామ స్మరణఁ జేయు నికి, ఆ నాముమే దివ్య లోక మును ప్రసాదించును'[15]

'నమో నారాయణాయ' అను నామము నుచ్చరించినవారికి దుర్గతి కలుగదు.'[16]

---

12 " నంజుదాన్ కణ్డీర్ నమ్ముడై వినైక్కు-
నారాయణా వెన్నుమ్ నామమ్ "

— పెరియ తిరుమొళి 1-1-10

13 " కణ్డు కొణ్డియ కదుముగిల్ వణ్ణన్ నామమే
నణ్ణుమిన్ నారణన్ తన్నై నరకమ్ పుకార్

— పెరియ తిరుమొళి 1-6-7

14 నామమ్బల శొల్లి నారాయణా వెన్రు
నామఙ్గైయల్ తొళుతుమ్ నన్నెఞ్జే వా '

— మూన్రామ్ తిరువన్దాది 8

15 ఞానత్తాల్ నన్గుణర్న్దు నారణన్దన్ నామఙ్గళ్
తానత్తాల్ మత్తవన్ పేర్ శాత్తినాల్ - వానత్తు '

— ఇరణ్డామ్ తిరువన్దాది 2

16 నావాయిలుణ్డే నమో నారణా వెన్రు
ఓవా తురైక్కు మురై యుణ్డే - మూవాద
మాక్కదిక్కణ్ శెల్లుమ్ వకై యుణ్డే - ఎన్నొరువర్
తీక్కదిక్కణ్ శెల్లుమ్ తిఱమ్ '

— ముదల్ తిరువన్దాది : 95

'భగవన్నామమునందు సహజముగాఁ గల దివ్య శక్తిచే, ఆ నామమును స్మరించు మనము - యముని శిరస్సుపై నెక్కి స్వారి చేయఁగలము'[17]

'భగవన్నామము కంటెను చెవికి ఇంపైన శబ్దము మఱి యొకటి లేదు.'[18]

'భగవన్నామ స్మరణ వలన, నరక మైనను స్వర్గము వలె మారి పోవును.'[19]

నామ ప్రభావమును గుఱించి ఆళ్వారులు వెలువరించిన పై భావ పరంపరలను బట్టి, భగవన్నామ స్మరణయందు వారికి గల ఆసక్తిని, తన్మయత్వమును మనము సులభముగ గ్రహింపవచ్చును

## స్తోత్ర ప్రాశస్త్యము

భగవంతుని స్తుతించుట - భక్తి కొక ముఖ్యమైన యంగము భగవత్స్వామిత్వమును, భక్త వాత్సల్యమును కల్యాణ గుణములను ఆర్తితో స్తుతించుటవలన భక్తునకు పరమ శాంతి లభించును భగవంతుని స్తుతించుట - భక్తుని కర్తవ్య మని భక్తి శాస్త్రములు ప్రబోధించుచున్నవి

---

17 'నావలిట్టు తరుగిన్ఱోమ్ నమన్తమర్ తలైగళ్ మీదే
మూవులగుణ్డు ఉమిళ్ంద ముదల్వ నిన్నామమ్ కత్త'

— తిరుమాలై 1

18 చెవిక్కి మావమముక్ కొణ్డాల్ నామమ్

— నాన్ముగన్ తిరువన్దాది 69

19 నమ నుమ్మ అన్నలనప్పుర - నరగిల్ నిన్ఱార్గళ్
నరగమే సువర్కమాగుమ్ నామంగళ్ ఉడైయ నమ్బి

— తిరుమాలై 12

శ్రుతులలో భగవత్ స్తుతి పరము లగు ఋక్కు లనేకములు దృగ్గోచరము లగును. సంస్కృత వాఙ్మయమున భగవత్ స్తుతి పరము లైన గ్రంథము లెన్నియో వెలువడి యున్నవి. ఆళ్వారుల ద్రావిడ పాశురములలో ననేకములు - అనేక దివ్య క్షేత్రములందు వివిధ నామములతో అర్చా రూపమున వేంచేసియున్న భగవంతుని, భక్త శిఖామణు లగు ఆ యాళ్వారులు గావించిన స్తోత్రములై యున్నవి. స్తుతి పరము లగు అట్టి పాశురముల ప్రభావము అనంతర కాలపు భక్తులపై విశేషముగ ప్రసరించె ననుట నిర్వివాదాంశము

నమ్మాళ్వారులు, తొండరడిప్పొడియాళ్వారులు, పెరియాళ్వారులు, కులశేఖరాళ్వారులు రచించిన దివ్య ప్రబంధము లందు భగవత్ స్తుతిపరము లగు నామము లనేకములు కానవచ్చును. కులశేఖరాళ్వారులు 'ముకుంద మాల' యను పేర, సంస్కృత భాషలో ప్రత్యేక మగు నొక స్తోత్ర గ్రంథమును రచించియున్నారు. సంస్కృత భాషలో గల ఇతర స్తోత్ర గ్రంథములకంటెను ఈ 'ముకుంద మాల'కు అధికమైన ప్రాముఖ్య మున్నది. భగవంతుని స్తుతించుట వలన లభించు నంతటి యానందము - ఈ 'ముకుంద మాల' పారాయణము వలన లభించును

భగవంతుని స్తుతించుట భక్తున కావశ్యక మని ఆళ్వారుల మనోభావన. వారి దివ్య ప్రబంధ సూక్తులే ఇందులకు పరమ ప్రమాణములు -

'భగవత్సేవలో నిమగ్నుడై, ఆ స్వామిని స్తుతించుట వలననే భక్తునకు సంతృప్తి గల్గు' నని కులశేఖరాళ్వారులును[20] -

---

20 " ఏత్తి ఇన్నుడై ప్పాడి కేవడియేత్తి వర్తయ న్నెక్షమే "

— పెరుమాళ్ తిరుమొళి 2 · 4

'భగవంతుని స్తుతింపని నాలుక వ్యర్థ' మని పెరియాళ్వారులును[21] -

'భగవంతుఁడే స్తుతింపఁదగినవాఁడు నేను మానవులను స్తుతించు యవివేకిని కాను. ఓ కవీ! సర్వేశ్వరుఁడు - సర్వ శక్తి సంపన్నుఁడు - కల్యాణ గుణాకరుఁడు నగు భగవంతుని స్తుతించుట మే'లని నమ్మాళ్వారులును[22] -

'నా వాక్కు భగవంతునిఁ దప్ప, అన్యులను స్తుతింప నొల్ల' దని పొయిగ యాళ్వారులును[23] -

'భగవంతుని కల్యాణ గుణములను, లీలలను స్తుతించుట తపస్సు వంటిది[24] భగవంతుని స్తుతించువారికి విజయము లభించును[25]' - అని పూదత్తాళ్వారులును స్తోత్ర ప్రాశస్త్యము ను మిక్కిలి కొనియాడి యున్నారు.

---

21 'వాక్కు త్తూయ్ మైయిలా మైయినాలే
మాతవా ఉన్నై వాయ్ క్కొళ్ళమాట్టేన్ "
— పెరియాళ్వార్ తిరుమొళి 5-1-1

22 తిరువాయిమొళి 3-9, 1-10

23 'వాయనై యల్లతు వాళ్ త్తాతు'
ముదల్ తిరువన్దాది 11

24 'ఏత్తి ఎణిన్ల వన్దేర్ ఱఱై జ్ఞానత్తొళుతుమ్
కాత్తి యురై త్తవర్ ఠవమ్'
- ఇరణ్డామ్ తిరువన్దాది 77

25 "షేవాళ్ వడాత్త మాళ్ - వట విన్ది
నాఙ్ఞ నన్దన్ నామఙ్గళ్ నన్గుణర్న్దు నన్గేత్తుమ్"
- ఇరణ్డామ్ తిరువన్గాది : 20

స్తుతి పరము లగు ఆళ్వారుల పాశురము లన్నియు గాన యోగ్యములుగా నొప్పారుచున్నవి. గాన మాధుర్య మహిమ అద్భుత మైన దగుటచే, విశ్వవ్యాప్తమై యున్నది

" శిశు ర్వేత్తి పశు ర్వేత్తి వేత్తి గాన రసం ఫణీ "

అనునట్లు, మానవులలో శిశువులే గాక, మానవేతరము లగు పశువులు, సర్పములు సైతము గాన మాధుర్య మాస్వాదింపఁగల్గు చున్నవి కావున, స్తుతి పరములు - గాన యోగ్యములు నగు ఆళ్వారుల పాశురములు ఆనంద సంధాయకములై, లోకమున అధిక ప్రచారమును సాధించి యున్నవి.

## ప్రపత్తి ప్రాముఖ్యము

ఆళ్వారులు తమ దివ్య ప్రబంధములలో - ప్రపత్తి ప్రాముఖ్య మును గుఱించి విశేషముగ ప్రస్తావించి యున్నారు. తన దోషములను బాగుగా గుర్తించి, పశ్చాత్తాపమును వ్యక్తము గావించి, తన ఆశ్రయ విహీనతను గ్రహించి - భగవంతుఁ డొక్కఁడే తన కాధారభూతుఁ డని విశ్వసించుట, తన నుద్ధరింపవలసిన దని ప్రార్థించుట అనునవియే ప్రప త్తికి ముఖ్య లక్షణములు

" త మేవ శరణం గచ్ఛ సర్వ భావేన భారత ।
త త్ప్రసాదా త్పరాం శాంతిం స్థానం ప్రాప్యసి శాశ్వతమ్ "

— (భగవ ద్గీత 18-62)

ఓ భారతా ! సర్వ విధములచేతను ఆ పరమాత్మనే శరణు పొందుము ఆతని యనుగ్రహమువలన పరమ శాంతిని (సర్వ కర్మ నివృత్తిని), శాశ్వత స్థానమును (పరమ పదమును) పొందఁగలవు' అని, శ్రీకృష్ణ భగవానుఁడు పార్థునకుఁ జేసిన ఉపదేశమే ఇందులకు పరమ ప్రమాణము అదియునుఁగాక -

" సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః

— (*భగవద్గీత 18-66* )

ధర్మము లన్నింటిని (కర్మయోగ జ్ఞాన యోగములను) పరిత్యాగము గావించి, నా యారాధనా రూపములైన క్రియలను అత్యంత ప్రీతితో - అధికారమునకుఁ దగినట్లు ఆచరించుచు, నే నింతకు మున్ను చెప్పిన ఫల త్యాగముచేతను, కర్తృత్వ త్యాగముచేతను న న్నొక్కనినే శరణముగ ఆశ్రయింపుము కర్తగాను, ఆరాధ్యుఁడుగాను ఫలముగాను, ఉపాయముగాను నన్నే అనుసంధానము చేయుము) అప్పుడు నేనునిన్ను సర్వపాపముల నుండియు (నా ప్రాప్తికై విరోధ రూపముగ కల అనాది కాల సంచితము లగు అకృత్య కరణ, కృత్యాకరణములచే వాటిల్లిన అపరిమితములైన పాపము లన్నింటినుండియు) విడిపింతును చింత పడకుము' అనియును శ్రీకృష్ణ భగవానుఁడే అర్జునునకు శరణాగతియొక్క యావశ్యమును, తత్ఫలమును ప్రబోధించి యున్నందున, ప్రపత్తి పథమున పయనించువారికి భగవదనుగ్రహ మవశ్యాపేక్షణీయ మని స్పష్ట మగుచున్నది

భక్తి ప్రపత్తులు రెండును భగవదనుగ్రహ ప్రాప్తికి పట్టుగొమ్మలే. ఈ రెంటికిని ఫలము భగవానుఁడే అయినను, ఈ రెంటికిని కొంత యంతర మున్నది భక్తి మార్గమున సాధన యవసరము, ప్రపత్తి పథమున సాధన యనావశ్యకము. కేవలము భగవంతుని త్రికరణ శుద్ధిగ ఆశ్రయించుటే ప్రపత్తి పథమున ముఖ్య విధి ఇందు భగవత్సేవ, భగవన్నామ జపము, భగవన్నామ సంకీర్తనము మున్నగునవి నిషేధములు కావు కాని, అవి యావశ్యకములు మాత్రము

కావు[26] ఇట్టి ప్రపత్తి తత్త్వమును ఆళ్వారులు మిక్కిలి ప్రశంసించి యున్నారు

'నేను దుఃఖ భూయిష్ఠుఁడను. చింతాక్రాంత మనస్కుఁడను. వ్యాకుల చిత్తుఁడను సాంసారిక మగు మోహ జాలమున చిక్కుపడి, అమూల్యము లగు దినముల నెన్నింటినో వ్యర్థముగా గడపితిని ఓ భగవానుఁడా! మనస్సుకు తోచినట్లు సంచరించువాఁడను. దిక్కులేని వాఁడను. లక్ష్య హీనుడఁను ఇపుడు నీ దయను కోరుచున్నాను'[27]

'ఓ భగవానుఁడా! నిన్ను శరణించుచున్నాను నన్ను దయతో స్వీకరించుము'[28]

---

26 "One is Bhakti or living him with all energy of one's own will, the other by Prapatti or living him with all the force derived from God himself when the aspirant has resigned his own will and dispensations of providence In the former case (Bhakti) God does not bind himself to save, whereas in the latter case (Prapatti), He binds Himself to save Conditions for the former (Bhakti) are untiring devotion and unceasing worship & C, on the part of the creature - the use of self will, whereas conditions for the latter (Prapatti) are implict trust and effacement of self - will and proneness to the complete operation of God's will alone The former (Bhakti) is a slender stream of love pradusing in his heart, and this necessarily subject of many accident, but the latter (Prapatti) is the mighty flood of grace pouring' down from God the creater nothing with standing the rush of the torrent"

— '*Divin Wisdom of Dravid Saint's, pp. 207-209*

27 పెరియ తిరుమొళి 1-8-5,

28 ఎన్ అప్పా వన్దడైన్దేన్ అడియేనై య ట్కొణ్డరుళే "

– పెరియ తిరుమొళి 1-9-5

‘ ఓ కరుణానిధానా ! తుదకు నీ సన్నిధికి వచ్చి చేరితిని కనుక, ఈ యకించనుని రక్షింపుము.’[29]

పై పంక్తులు తిరుమంగయాళ్వారుల హృదయోద్వేగమును వ్యక్తము గావించుచున్నవి

ఇట్లే, పెరియాళ్వారులును - ‘ ఓ భగవానుఁడా ! నిన్ను శరణించితిని. నన్ను రక్షింపు’ మని ఆర్తితో నర్థించిరి [30]

ఇఁక తొండరడిప్పొడి యాళ్వారుల ప్రపత్తి భావమును పరిశీలించిన యెడల, హృదయమును ద్రవింపఁజేయును తత్తరపాటు గల చిత్తముతో - భగవంతుని శరణించుట కాయత్తమై, యెలుగెత్తి చేసిన యార్తనాదము వీరి పాశురములనుండి ప్రతిధ్వనించుచుండును.

‘ ఓ కరుణామూర్తి ! నాకు ‘నాది’ యని చెప్పుట కేదియు లేదు. అశాశ్వత మగు నా జీవితమున నీ పాద పద్మములను శరణింప నైతిని ఓ భగవానుఁడా ! నీవు గాక, ఇఁక నా కాశ్రయ మిచ్చువా రెవ రున్నారు ? ’[31]

‘ ఓ తులసీమాలాధారీ ! నీవే నాకు రక్షకుఁడవు ’[32]

ఈ రీతిగా తొండరడిప్పొడియాళ్వారులు భగవంతుని శరణించుటే తమ యభిమత మని ఇట్లభివ్యక్తము గావించుచున్నారు ...

29 అత్తేన్ వన్దడైన్దేన్ అడియేనై యాట్కొండరుళే '

— పెరియ తిరుమొళి 1-9-9

30 అణ్ణవే! నీ యెన్నై క్కాక్క...

...ఆళ్వార్ తిరుమొళి 4-1-06

31 తిరుమాలై 29

32 తిరుమాలై : 30



'ఓ భగవానుఁడా! నే ననేక కష్టము లనుభవించుచున్నాను నిన్ను శరణించుట దప్ప, నాకు వేరు గతి లేదు. తల్లి బిడ్డను కోపించి విడచినను, ఆ బిడ్డ తన తల్లియొక్క ప్రేమాతిశయముననే ఆధారపడి యుండునట్లు, నేను నీ యనుగ్రహమునే ఆకాంక్షించుచు న్నాను'[33]

పైఁ జేర్కొనఁబడిన వాక్యములనుఁబట్టి, భగవంతుని శరణించుట భక్తున కత్యావశ్యక మని స్పష్ట మగుచున్నది అయినచో - ఆళ్వారుల యడుగుజాడలలో పయనించు శ్రీరామానుజ సంప్రదాయు లందు కాల క్రమమున రెండు తెగ లేర్పడుట వలన, ప్రపత్తి తత్త్వముకూడ రెండు విధములుగా మార్పు జెందెను.వీరిలో నొక తెగ వారు - భగవంతుని యనుగ్రహమును సహేతుక మనియు, మఱి యొక తెగవారు - నిర్హేతుక మనియు తలంచిరి మొదటి తెగవారు వడగల సంప్రదాయులుగను, రెండవ పక్షమువారు తెంగల సంప్రదాయులుగను వ్యవహరింపఁబడుచున్నారు తెంగలవారి ప్రపత్తికి మార్జాల కిశోర న్యాయము, వడగలవారి ప్రపత్తికి మర్కట కిశోర న్యాయము ఉదాహరణములుగా చెప్పఁబడుచున్నవి

ఆళ్వారులు ప్రతిపాదించిన నిర్హేతుక ప్రపత్తి మార్గమును పుష్టి మార్గ ప్రవర్తకు లగు వల్లభాచార్యు లనుసరించియుండుటనుఁబట్టి,

---

33 "తరు తుయరమ్ తడాయేల్ ఉన్ శరణల్లాల్ శరణిల్లై
విరై కుళువు మలర్పొళిల్ శూళ్ విత్తువ క్కోట్టమ్మానే
అరిశినత్తాలీన్ఱ తాయ్ అగత్తడినుమ్ మత్తవళ్ తన్
అరుళ్ నినైన్దే యళుగ్గుళవి అదువే పోన్ఱిరున్దేనే'
- పెరుమాళ్ తిరుమొళి 5-1.

ఆళ్వారుల శరణాగతి తత్త్వము - అనంతర భక్తి వాఙ్మయమును విశేషముగా ప్రభావితము గావించినట్లు వ్యక్తమగుచున్నది[34]

## ఆచార్య ప్రభావము

ఆచార్యుఁ డనఁగా - గురువు ఆధ్యాత్మిక సంబంధము లగు మార్గము లన్నింటియందు గురువు అవసర మనియే నిర్ణయింపఁబడినది కేవలము సగుణోపాసకులే గాక నిర్గుణోపాసకులు, హఠ యోగ సాధకులు సైతము గురువు ఆవశ్యక మనియే అంగీకరించియున్నారు

ఆధ్యాత్మిక జీవన పథమును జూపఁ గల మహనీయుఁడే గురువుగా స్వీకరింపబఁడును అతఁ డంతేవాసియందుఁ గల అజ్ఞానాంధకారమును దూర దూరము గావించి, వానికి జ్ఞాన తేజమును ప్రసాదించును అట్టి మహనీయుని ఆశ్రయణము లభింపని యెడల, సాధకుని మనస్సునందుఁ గల నైర్మల్యము తొలఁగఁనేరదు చిత్తము పరిశుద్ధముగ లేనిచో - భగవ త్తత్త్వము తెలియఁజాలదు భగవ త్తత్త్వము తెలియని యెడల, భక్తి యేర్పడదు భక్తి లేనిచో - ముక్తి లభింపదు. కావున, మోక్షాసక్తి గల వ్యక్తికి గురువు ఆవశ్యక మనుట నిర్వివాదాంశము.

---

34 " వల్లభాచార్యులు పుష్టి మార్గమునఁ గల ప్రపత్తికి ఉదాహరణముగా - మార్జాల కిశోర న్యాయము చూపఁబడినది మార్జాల కిశోరము తన తల్లిని తాను పట్టుకొనదు పిల్లియే తన పిల్లను నోట గఱచుకొని, తాను వెడల దలచిన తావుకు తీసికొనిపోవును. ఆ పిల్లను కాపాడుటకు తల్లియే యెల్లప్పుడును దానిని వెన్నంటి యుండును అట్లే, భగవానుఁడు కూడ - దీనుఁడు, ఉపాయ విహీనుఁడు, శరణాగతుఁడు నైన ప్రపన్నుని రక్షించు నిమిత్తము తానే పూనిక వహించి, అతనిని వెన్నంటి యుండును "

- వల్లభ సంప్రదాయము 670, 671 పుటలు

- డాక్టర్ దీనదయాళ్ గుప్త

ఆచార్యుని యనుగ్రహము పరిపూర్ణముగ లభించిన యెడల, శిష్యునకు భగవంతుని సాక్షాత్కార భాగ్యము తప్పక లభించును, కనుక, గురువు భగవంతునివలెనే పూజనీయుఁడని తెలియవలెను కొందఱు భక్తులు - గురువును భగవంతునికంటెను అధికునిగాఁ దలంచుటయుఁ గలదు అట్టి వారిలో ఆళ్వారులు అగ్రగణ్యులు

మధుర కవి యాళ్వారుల యేకైక రచన యగు 'కణ్ణినుణ్ శిరుత్తామ్బు' అను దివ్య ప్రబంధమునందలి పాశురము లన్నింటియందును - కేవలము గురు ప్రభావమే వర్ణింపఁబడినది. సదాచార్య సమాశ్రయ మార్గము పర్యటించు మధురకవి యాళ్వారులు - నమ్మాళ్వారులను గురువుగా స్వీకరించి, తమ జీవితము ధన్యమైనట్లు తలంచుటే గాక, భగవంతునిపైఁజూపిన భక్తి కంటెను, తమ గురువునందే విశేష మగు భక్తి భావమును చూపిరి తమ సర్వస్వమును గురు చరణ సన్నిధానమున సమర్పించి, అహర్నిశములు గురు సేవయందే శ్రద్ధా సక్తులు గల్గి యుండుట మహా భాగ్యముగ సంభావించిరి మధురకవి యాళ్వారులు కేవలము మాటలచేతనే గాక, చేతలచేగూడ గురు ప్రభావమును ఋజువుపరచియున్నారు

' గురు (నమ్మాళ్వారుల) నామమునే స్మరించుచు, నా జిహ్వ - అమృతాస్వాదనము గావించి, నన్నానందింపఁజేయఁగల్గుచున్నది '[35]

'వేదములలో నిగూఢములుగాఁ గల యంశములను ఆ మహానీయులు (నమ్మాళ్వారులు) నాకు సుబోధకము గావించిరి. కావున,

---

35 " నణ్ణిత్తన్ కురుగూర్ నమ్బి యెన్నక్కాల్
అణ్ణిక్కు మము దూఱుమ్ ఎన్నా వుక్కే '

- కణ్ణినుణ్ శిరుత్తామ్బు 9,

వారికి సేవఁజేసి, ధన్యుఁడనైనట్లు తలంచుచున్నాను.[36] 'నా యందుఁ గల దోషములను వారు (నమ్మాళ్వారులు) దూర దూరముగ పారద్రోలిరి. కనుక, నా గురుదేవుల ప్రభావమును దశ దిశ లందును వ్యాపింపఁజేయఁగలను. నేను గురు దేవుల ప్రభావమునే కోరుచున్నాను'[37]

ఇదియే మధురకవి యాళ్వారుల గురు భక్తి భావన ఇట్లే పెరియాళ్వారులు గురు ప్రభావమును బహు భంగులుగా ప్రశంసించుచు, ఆదర్శ ప్రాయము లగు సద్గుణములతో ప్రకాశించు గురు పాదుల కృపకు పాత్రు లగుచు, వారు నిర్దేశించిన రీతిగా పరమాత్మను ప్రస్తుతింపనివారు - తమ మాతృ గర్భమునకు కళంకము నాపాదించిన వారు కాఁగల' రని తెలిపియున్నారు[38]

నమ్మాళ్వారులు గురు ప్రభావమును వివరించుచు - 'గురువు నిమ్న జాతికిఁ జెందినవాఁడైనను, చండాలుఁడుగా జన్మించిన వాఁడై

---

36 'మిక్క వేదియర్ వేదత్తిన ట్పొరుళ్
నిఱ్కప్పాడి యెన్నెఞ్జుళ్ నిఱుత్తినాన్
తక్కశీర్ శడగోప నెన్నమ్బిక్కు ఆళ్
పుక్క కాదల్ అడమై పయనన్ఱే'

– కణ్ణినుణ్ శిరుత్తామ్బు : 9

37 కణ్డు కొణ్డెన్నై క్కారి మాఱప్పిరాన్
పణ్డై వల్వినై పాత్తి యరుళినాన్
ఎణ్డిశైయుమ్ అఱియ వియమ్బుగేన్
ఒణ్డమిళ్ శడగోప నరుళైయే '

– కణ్ణినుణ్ శిరుత్తామ్బు : 7

38 పెరియాళ్వార్ తిరుమొళి 4-4-2.

లు, ఆ మహానీయుని ప్రభావము అసదృశముగా నుండును గనుక, అట్టి మహానీయునకు సేవ జేయుట మేలని హితముపదేశించి యున్నారు [39]

అగ్రజాతిలో జన్మించిన మధురకవి యాళ్వారులు - నిమ్న జాతికి జెందిన నమ్మాళ్వారులను గురువుగ దలంచుట - ఆ యుగమున నొక విప్లవకర మగు సంఘటన మనియే చెప్ప నొప్పును ఈ సంఘటనము వలన, మధురకవి యాళ్వారులు జాతిని పరిగణింపక, కేవలము భక్తి జ్ఞాన వైరాగ్యములకే ప్రాముఖ్య మొసంగి, నమ్మాళ్వారులను గురువుగా స్వీకరించినట్లు స్పష్ట మగును. ఇట్లే, భక్తి జ్ఞాన వైరాగ్యములకు మాత్రము ప్రాముఖ్యము నిడి, జాతి భేదములను తొలగించుటకు తొలుతగా ప్రయత్నించిన శ్రీమద్రామానుజులపై, ఆళ్వారుల ప్రభావము ప్రసరించె ననుట నిస్సంశయము

భక్తి మార్గమున గురు శిష్యుల జాతి భేదములను పాటింపని ఆళ్వారుల విశాలాదర్శములు ప్రజలను విశేషముగ ఆకర్షించి యున్నందున, ఆ భక్తాగ్రేసరులు ప్రయత్నించిన నిమ్నజాతి సముద్ధరణము - పవిత్ర భారతమున చరిత్రాత్మకమై యుండు ననుట నిశ్చయము [40]

---

39 'పలన్దాఙ్గు నాదిగళ్ నావిలుమ్ కీత్తినుం - ఎత్తనై
నలన్దా నిలాద చణ్డాళ శణ్డాళర్ గళాగిలుమ్
వలన్దాఙ్గు శక్కరత్తణ్ణల్ మణివణ్ణఱ్కాళెన్ఱు ఉళ్
కలన్దార్ - అడియార్ తమ్ అడియ రెమ్మడిగళే

- తిరు వాయి మొళి 3-7-9

40 " The Social uplift of the lower classes to which has led is of greate Value in the History of India

— 'Out lines of Indian Philosophy' P 413
— *Prof Hiriyana.*

## భాగవత సత్సంగ ప్రయోజనము

నియమ నిష్ఠలు గల్గియు నిశ్చలముగ
వీను లారంగి వారి కథల్ వినుట వలస
భాగవతు లైనవారల ప్రజ్ఞ జేర
గల్గు యోగంబు – శ్రేయంబు గల్గు దాన

అనునట్లు, అనవరతము హరికథా శ్రవణము వించుచు, పరమ భాగవతోత్తములతో సాంగత్యము చేయువారు – అచిర కాలమున నే భక్తి ప్రపత్తులతో సుత్తీర్ణులై, భగవ దనుగ్రహ పాత్రులు కాఁ గలరు

భక్తి భావ మంకురించుటకును, వికసించుటకును అనుకూల వాతావరణ మును గల్గించుటలో – భాగవత సత్సంగ మొక యద్వితీయ సాధనము తపస్సు మున్నగాఁ గల క్రియలలో – ఏకాంత నిష్ఠ యవస రము కావచ్చును గాని, భక్తి సాధనయందు మాత్రము భాగవతో త్తముల సంసర్గమే అత్యంత ప్రయోజనకరము అట్టి సంసర్గము వలన ఐహిక వాంఛలు కాల క్రమమున తొలఁగి పోవును ఆత్మకు పరమ శాంతి లభించును

" మచ్చిత్తా మద్గత ప్రాణా బోధయంతః పరస్పరమ్
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ "

—(భగవద్గీత 10 – 9 –)

నా యందే మనస్సును లగ్నము గావించినవారై, పరస్ప రము నన్ను గురించియే తెలిసికొనుచు, ఇతరులకు తెలియఁ జెప్పుచు, నిరంతరము సంతృప్తిని పొందుచున్నారు, ఆనందించు చున్నారు అని, శ్రీ కృష్ణ భగవానుఁడే స్వయముగాఁ దెలిపియున్నాఁడు కావు ననే, ఆళ్వారులును భాగవత సత్సంగము భగవ త్ప్రాప్తికి పరమ

ప్రయోజన కరమని ప్రబోధించిరి కులశేఖరాళ్వారులు తమ రాజ భోగములను సైతము పరిత్యజించి, భక్తులతో కలిసి మెలసి, భగవన్నామ సంకీర్తనానంద మగ్న మానసులగుట కెంతయో యుత్కంఠ జూపిరి

'మనస్సునందుఁ గల మాలిన్యముఁగూఁ దొలఁగించి, ఈర్ష్యాది దుర్గుణములను వదలి, పంచేంద్రియములను స్వాధీనము గావించుకొని, నిరంతరము భగవంతుని స్తుతించుటయందే నిమగ్నులైన భక్తుల నెన్నడు దర్శింపఁగలనో!' [41]

'భగవంతుని దివ్య లీలలను కీర్తించుచు, నేత్రములనుండి ఆనంద బాష్పములు ధారాప్రవాహముగ ప్రవహింపఁజేయుచు, అట్టి బాష్ప ధారలచే సిక్త మగు భగవదాలయ ప్రాంగణమున నృత్యము గావించు భాగవతోత్తముల చరణ పరాగంబును నా శిరమ్మునై నెప్పుడు ధరింతునో!' [42]

'ఆనంద బాష్పములను సదా ప్రవహింపఁజేయుచు, ఆర్తితో భగవంతుని పిలుచుచు, పులకిత గాత్రులై, భగవంతుని స్తుతించుచు, నృత్యము గావించు భక్తులను పరిహసించువారే నిజముగ పిచ్చి వారు' [43]

---

41 పెరుమాళ్ తిరుమొఴి 1-7

42 అలుపోల్ వరుమ్ కణ్ణనీర్ కొణ్డు
అరఙ్గన్ కోయిల్ తిరుముత్తమ్
శేఱుశెయ్ తొణ్డర్ శేవడి చ్చెళుమ్
శేఱెన్ శెన్ని కణిన్దనవే

– పెరుమాళ్ తిరుమొఴి – [illegible]

43 పెరుమాళ్ తిరుమొఴి 2 - 9

కులశేఖరాళ్వారులు వెలువరించిన పై భావనా పరంపరలు - ఎంతటి కఠిన చిత్తుల నైనను ద్రవింపఁ జేయఁ గల వనుట నిశ్చయము.

భాగవతోత్తముల నడుమ ఉచ్చ నీచ భేదముల కేమాత్రము తావు లే దనియు, భగవ ద్భక్తు లైనవా రెల్లరును సమాన గౌరవ భాజనులే యనియు ఆళ్వారులు నొక్కి వక్కాణించిరి మచ్చు కిచట తొండరడిప్పొడియాళ్వారుల శ్రీసూక్తి యొకటి చాలును -

'దోష రహితము లైన జీవితములతో తేజరిల్లుచు, దైవ ధ్యానమున నిమగ్ను లై యుండువారు - ఏ కులజు లైనను - వారు భగవత్తుల్యులు గావున, వారిని పరమ భాగవతోత్తములుగా భావించి, సేవించి వారి సాంగత్యము చేయవలెను'[44]

ఇట్టి భావ పరంపరలు - ఆళ్వారుల దివ్య ప్రబంధములలో కోకొల్లలు అదియునుఁ గాక, భక్తునకు భాగవత సాంగత్య మెంతటి శ్రేయస్కరమో భగవంతునకు విముఖు లైనవారి సాంగత్య మంతటి ప్రమాదకర మనియు ఆళ్వారులు ప్రబోధించి యున్నారు.

'ఈ ప్రపంచమునఁ గల సుఖమే సత్య మైన దనియు, అదియే శాశ్వత మైన దనియు తలంచి, త దనుసారముగ ప్రవర్తించువారి సాంగత్యము పరిత్యాజ్య' మని కులశేఖరాళ్వారులు భక్త లోకమున కొసంగిన దివ్య సందేశమే ఇందుల కొక ప్రబల నిదర్శనము.[45]

---

44 'పళుదిలా వొళుంగలాత్తు ప్పలచదుప్పేది మార్కళ్
ఇళి కులత్తవర్ కళేలుమ్ ఎమ్మడియార్ కళాగిల్
తొళుమినీర్ కొడుమిన్ కొళ్ మిన్ ఎన్ఱు నిన్నోడు మొక్క
వళిపడ అరుళినాయ్ పోల్ మదిల్ తిరువరంగత్తానే

- తిరుమాలై 42

45 " మెయ్యిల్ వాళ్ క్కైయై మెయ్యెన క్కొళ్ళుమ్ - ఇ
వ్వైయత్త న్నాగమ్ కూడువ దిల్లై యాన్ '

- పెరుమాళ్ తిరుమొళి 3-1

## వైరాగ్య వైశిష్ట్యము

భక్తి మార్గమున పయనించువారు - సాంసారిక విషయము లను, ఆ విషయములయం దాసక్తిని గల్గించు వస్తు సముదాయమును పరిత్యజించి, వైరాగ్య భావమును పెంపొందించుకొనుట శ్రేయస్కరము వైరాగ్యము పెంపొందు కొలదియు భక్తి భావ మభివృద్ధిం జెందును దానివలన భగవ దనుభూతి గల్గును. అట్టి యనుభూతియే సాధకునకు సర్వదా వాంఛనీయము సాంసారికము లగు వాంఛలకు లోనయి యున్నంత వఱకును మానవుఁడు భగవ దున్ముఖుఁడు కాఁజాలఁడు. ఇంద్రియములను జయించనివానికి ఆత్మోత్తేజము కలుగనేరదు. వైరాగ్య భావమును పెంపొందించుకొనుచున్న కొలఁదియు ఇంద్రియములు స్వాధీనము లగుచుండును కనుక, పంచేంద్రియములను జయించుట సాధకునకు విధి యనియు, అదియే భక్తునకు ప్రథమ సోపాన మనియు ఆళ్వారులు ప్రబోధించియున్నారు

మానవుఁడు భగవ దున్ముఖుఁ డగు తరుణమున అవరోధములుగా నేర్పడు విషయ జాలముపై విజయమును సాధించుటే వైరాగ్యము జ్ఞానహీనుఁ డగు మానవుఁడు - నశ్వరమైన శరీరముతో సంబంధము గల గృహారామ క్షేత్రాదులను మోహవశమున శాశ్వతము లని తలంచి, అట్టి తన గృహారామ క్షేత్రములందును, సతీసుతు లందును, బంధు మిత్రులందును విశేష మగు ప్రీతి గలిగి, నిరంతరము వారియందే మనస్సును లగ్నము గావించి, తన సర్వ శక్తులను వారికై వెచ్చించుచు, భగవంతుని విస్మరించును కాని శరీరము నశించి శక్తిసామర్థ్యములు క్షీణించు కొలఁదియు - మృత్యువు సమీపించు కొలఁదియు అతని కన్నులు విచ్చుచు, అతనిలో జ్ఞానోదయ మగును ఆ తరుణమున అతనికి తన వృద్ధాప్య మనసహాయముగాఁ దోఁచును అగుటవలన, అతఁడు దుఃఖాక్రాంత చేతస్కుఁ డగును అట్టి స్థితిలో నలసికి భగవంతుడు

స్మృతికి వచ్చును కనుక, మతిమంతుఁడైన మానవుఁడు – నశించు స్వభావము గల సాంసారిక సుఖ భోగములయందు ఆరంభ దశ నుండియే వైరాగ్య భావము గల్గి యుండుట కడుంగడు ప్రయోజనకర మని ఆళ్వారులు ఎలుగెత్తి చాటియున్నారు

కులశేఖరాళ్వారులు తమ రాజకీయ సుఖ భోగములను వదలి, వైరాగ్య భావమును పెంపొందింపఁజేసికొని, భక్తి ప్రపత్తులలో నుత్తీర్ణులై, భగవంతుని సాక్షాత్కార భాగ్యమును పొందిరి ఇట్లే, ఆళ్వారులందఱును ప్రాపంచిక విషయములకు దూర దూరముగ నుండి, వైరాగ్య భావమునఁ విరాజిల్లుచు, అట్టి వైరాగ్య స్థితియే భక్తులకు ఆవశ్యక మని తమ దివ్య ప్రబంధములలో నిట్లు విశదీకరించిరి –

'పంచేంద్రియములను జయించిన సాధకునకు భగవంతుని దర్శన భాగ్యము లభించును.'[46]

'పంచేంద్రియ ద్వారమును బంధించిన యెడల, జ్ఞాన ద్వారము తెఱచుకొనును'[47]

---

46 " అఱియపులనైన్దడక్కి ఆయ్మలర్ కొణ్డు – ఆర్వమ్
పురియ పరిశినాల్ పుల్కిల్ – పెరియనాయ్
మాఱ్ఱాతు వీత్తిరున్దమావళివల్ – కణ్కై నీర్
ఏఱ్ఱానై క్కాణ్బ తెళితు '

– ముదల్ తిరువన్దాది 5[illegible]

47 ' అఱినైన్దుమ్ ముళ్ళడక్కి అయిమలర్కొణ్డు – ఆర్వమ్
శెఱిన్ద మనత్తరాయ్చ్చెవ్వే – అఱిన్ద ఎన్దన్
పేరోదియేత్తుమ్ పెరున్దవత్తోర్ కాణ్బరే
కారోత వణ్ణన్ కళల్ '

– ఇరణ్డామ్ తిరువన్దాది 6

'పంచేంద్రియములు శత్రు తుల్యములు'[48]

'రాజకీయ సుఖము సైతము అశాశ్వతమైన దనియు, ధనము నశించు స్వభావముగల దనియు మూర్ఖులైన మానవులు తెలిసికొనుట యవసరము.'[49]

'నేడు కానిచో - రే పయినను ఈ సంసారమును వీడిపోవలసి నదే యని తెలిసియు, మూర్ఖులైన మానవులు - తమ దేహమునందు భ్రాంతిని వదలజాలకున్నారు'[50]

ఆళ్వారులు గావించిన పై ప్రబోధములను బట్టి, ప్రాపంచకము లగు ధన కనక వస్తు వాహనములు, గృహారామ క్షేత్రములు మున్నగున వన్నియు అశాశ్వతములే యనియు, అట్టివానియందు వ్యామోహమును వదలి, వైరాగ్య భావముతో భగవంతుని భజించుట మే లనియు విశద మగుచున్నది

— o —

48 ' పున్పుల పళియదైత్తు అరక్కిలచ్చినై కెయిదు
నన్బులవళి తిఱన్దు ఞానన ల్బుదర్ కోళిఱ '

— తిరుచ్చన్ద విరుత్తమ్ 86

49 ' అడిశేర్ ముడియినరాకి అంశర్కళ్తామ్ తొళ
ఇడిశేర్ మురశఙ్గళ్ ముత్తిత్తియమ్బ విరున్దవర్
పొడిశేర్ తుకళాయ్ప్పోవర్కళ్ అదలిల్ నొక్కెన
కడిశేర్ తుత్తుయ్ ముడిక్కణ్ణన్ కళల్ కళై విన్నైమినో '

— తిరు వాయి మొళి 4-1 8

50 ఇన్ఱు శాదల్ నిన్ఱు శాదల్ అన్ఱియారుమ్ వైయగత్తు
ఒన్ఱి నిన్ఱువాళ్ దలిన్మై కణ్డుమ్ నీశరెన్ గొలో ? '

— తిరుచ్చన్ద విరుత్తమ్ 88

# శ్రీ కులశేఖర వైభవము

' సుధీమణి '

శ్రీమాన్ ఉలకపాటి విజయ రాఘవాచార్యులు,

ఎం ఏ డి ఐ యస్

—*—

శ్రీమన్నారాయణ చరణ శరణాగతి — భవ సంతరణమునకు అనంతర పరమ పద ప్రాప్తికి మూల గతి శ్రీవైష్ణవ మతము శరణాగతిని ప్రబోధించును శ్రీ చరణ శరణాగతి మాత్రమే శ్రియః పతి నిత్య నివాస స్థానమైన పరమపద శుభ వాసమును కలుగ జేయును ద్వయ మంత్రార్థ ప్రతిపాదితము సైతము శ్రియఃపతిని త్రికరణ శుద్ధిగా గోరుటయే

## దివ్య సూరులు

పరమ దయా సముద్రుడగు శ్రీ వైకుంఠ నాథుని ఆమోద ప్రమోదములతో - ఆర్త జన రక్షణకు, లోకోత్తరమైన సామాన్య జన సముద్ధరణమునకు, మోక్ష ప్రాప్తికి, అందుకు ఆవశ్యక మగు పరమ పద సోపాన నిర్మాణమునకు కంకణ బద్ధముగ అవతరించిన పరమ భాగవత శిఖామణులే దివ్య సూరులు మోక్ష మార్గమును సుగమము గావించి, అశేష పామర జనమునకు శ్రీ కైవల్య పద భాగ్యమును కరతలామలకము చేసిన ఆ దివ్య సూరులే ద్రావిడ దివ్య దేశమున ఆళ్వారులుగా అవతరించి యున్నారు శ్రీ విష్ణుభక్తి - ఒక మహో ద్యమముగా, మహా స్రవంతిగా మోక్ష సామ్రాజ్య ప్రాప్తికి ఏకైక సాధనముగా ప్రాచుర్యము ను పొందినది ఈ మహనీయుల వల ననే శ్రీమద్భాగవత రామాయణ భారతాది పురాణేతిహాసములు

జ్ఞాన సిద్ధికి కామధేనువులు కాగా, ఆళ్వారుల ద్రావిడ దివ్య ప్రబంధములు భక్తి ప్రపత్తులకు పట్టు గొమ్మలుగా మోక్ష మార్గ దర్శకములుగా పరిఢవిల్లినవి

## నవ విధ భక్తి మార్గములు

శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంతమునకు మూల విరాట్టులైన ఆళ్వారులు ప్రధానముగ వున్నారు శ్రీ కృష్ణ భగవానుడు గీతలో ప్రవచించినట్లు, 'తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః 'శ్రద్ధావాన్ భజతే యో మాం సమే యుక్తతమో మతః' (గీత 6 - 46, 47) - తపస్సు చేయువారి కంటెను, జ్ఞానుల కంటెను, యోగుల కంటెను భక్తుడే ఉత్తముడు 'భక్తిరేవైనం నయతి' 'భక్తిరేవైనం దర్శయతి' భక్తి వశః పురుషః' - భక్తి మాత్రమే భగవంతుని పొందించును ఆయనను దర్శింప జేయునదియు భక్తి మాత్రమే భగవంతుడు భక్తి వశుడు భగవంతుని చేరుటకు అతి సులభమైనపదము భక్తి మార్గ మొక్కటియే ఈ భక్తి - తొమ్మిది విధము లని భాగవత ప్రమాణము

> "శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాద సేవనమ్
> అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనమ్"

భగవద్గుణానుభవమునకు సంబంధించినవానిని వినుట, కీర్తించుట, స్మరించుట, శ్రీ పాదములకు సేవ జేయుట, అర్చించుట, నమస్కరించుట, దాస్యము, స్నేహము, ఆత్మ నివేదనము అనునవి నవ విధ భక్తి మార్గములు శ్రీహరి భక్తిని పన్నిద్దరాళ్వారులు ప్రబోధించుటయే గాక, వారు స్వయముగ ఆచరించియున్నారు

## ఆళ్వారుల భక్తి గీతములు

ఆళ్వారులు తమిళములో రచించిన భక్తి గీతములను - 'పాశురములు' అందురు. ఈ ద్రావిడ పాశురములను ఆళ్వారులు స్వయముగ గానము చేసిరి. ఇవి - రాగ తాళ బద్ధములు, గానయోగ్యములు. నిర్ణ పెయ మగు ఈ పాశుర గానము నాటికిని, నేటికిని దివ్య క్షేత్రములలో నిత్యానుసంధేయమై, పరమ సాంప్రదాయకమై విలక్షణ వైభవముగ విరాజిల్లుచున్నది. శ్రీ పరాశర భట్టరువారు - పది మంది ఆళ్వారులను, శ్రీ భగవద్రామానుజులను, శ్రీరామ మిశ్రులను ఇట్లు ప్రణమించియున్నారు -

> " భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
> శ్రీ భక్తిసార కులశేఖర యోగివాహాన్
> భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్ర మిశ్రాన్
> శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్ '

ఈ శ్లోకమునందు ప్రస్తావింపబడిన పది మంది ఆళ్వారులతో మధురకవి యాళ్వారులను, ఆండాళును చేర్చినయెడల, మొత్తము పన్నిద్దరాళ్వారులు. ఈ పన్నిద్దరిలో నొకరగు కులశేఖరాళ్వారులే ప్రస్తుత కథానాయకులు.

## ఆళ్వారుల దాస్య భక్తి

శ్రీ వైష్ణవ సిద్ధాంత ప్రవర్తకులైన ఆళ్వారు లందరును నవవిధము లగు భక్తి విధానములలో - దాస్య భక్తిని విశేషముగ పాటించిరి. శ్రియఃపతిని తండ్రిగా, ప్రభువుగా, ఆచార్యునిగా సంభావించి, దాసానుదాసులుగా భగవత్సేవలో ప్రవర్తించిరి. ఆళ్వారులు అనన్యమైన తమ అనురక్తిని విష్ణుపరముగా అనుభవించి, శ్రియఃపతితో ఆత్మీయమైన దివ్యానుభూతిని పొంది తరించిరి.

శ్రీవైష్ణవమున కుల తత్త్వమునకు స్థానము లేదు. శ్రీ మహా విష్ణువును ఆరాధించుచు ఆచార్య సమాశ్రయమున పంచ సంస్కారములను పొంది, ద్వయానుసంధానమే ఊపిరిగా, తిరుమంత్ర జపమే ప్రాణముగా భావించుచు, భగవద్భాగవతాచార్య సన్నిధియే పెన్నిధిగా గడుపువారెవరేని వైష్ణవులే. కుల తత్త్వమును వదలి, పరమ పద వాసమునకు అందరును అర్హులే యని ప్రకటించినది శ్రీవైష్ణవ సిద్ధాంతము. ఆళ్వారులలో భిన్న కులములవారున్నారు. వారందరును శ్రియః పతికి అంతరంగికులే. అతి పవిత్రము, మహిమాన్వితము అయిన ఆళ్వారుల విష్ణుభక్తి పారవశ్యము అనన్య సామాన్యము.

## భాగవత కులశేఖరులు

ఉదాత్త భక్తి తత్త్వమునకు, పారవశ్యమునకు ద్వాపర యుగమున గోపికలు ప్రతీకలు కాగా, ఈ కలి యుగమున ఆళ్వారులు ప్రతినిధులుగా విలసిల్లుచున్నారు. ఉన్నత సిద్ధించిన భక్తి భావనలతో ఆళ్వారులు శ్రీమన్నారాయణుని అవతార రూపములను విశేషముగ కీర్తించిరి. అట్టి ఆళ్వారులలో భక్తి పరవశులై, రాజ్య పాలన చేయుచు, సర్వదా కృష్ణభక్తి పారవశ్యమున జీవితమును ధన్యము గావించుకొన్న మహనీయులు కులశేఖరులు. వీరు కేరళ చక్రవర్తులు, భాగవత కులశేఖరులు.

శ్రీ కులశేఖరాళ్వారులు శ్రీమన్నారాయణుని కౌస్తుభాంశ సంభూతులు. సీతాదేవి వలెనె తనకు మగిలి జనక మహారాజు వలెనే, కులశేఖరాళ్వారులును రాజర్షులుగా విరాజిల్లినవారు. ఈ కులశేఖరులు — పరాభవ నామ సంవత్సర మాఘ మాస శుక్ల పక్ష శుద్ధ ద్వాదశీ వారము — పున

ర్వసూ నక్షత్ర యుక్త శుభ లగ్నమున చంద్రవంశ రాజగు దృఢవ్రతు నకు పుత్ర రత్నముగ జన్మించిరి [1]

"కుంభే పునర్వసూ జాతం కేరళే చోళ పట్టణే
కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖర మాశ్రయే"

వీరిది కేరళ దేశమందలి కొల్లి నగరము శ్రీ కులశేఖరులు బాల్య యౌవన వార్థక్య దశలను మిక్కిలి ఉదాత్తముగ క్రమ శిక్షణతో గడపిన మహా మనీషులు

## కులశేఖరుల రాజ్య పాలనము

శ్రీ కులశేఖరులు మహా రాజుగా నగుటచేత, శత్రు రాజుల సంహారము, సామ్రాజ్య విస్తరణము, దేశ రక్షణము వంటి సహజ ధర్మములను నిర్వహించక తప్పదు కనుక, రథ - గజ - తురగ - పదాతి బలములను పటిష్ఠము గావించిరి రణ రంగమున అరివీర భయంకరులై, శత్రువులను జయించిరి ఏకచ్ఛత్రాధిపతులై పాలన చేసిరి తమ రాజ్యపాలనమున, స్త్రీ - బాల - వృద్ధులకు, అనాథ లకు, బలహీనులకు రక్షణము కల్పించి, ప్రజా రంజకముగ పాలన సాగించిరి కులశేఖరులకు బాల్యమునుండియు సహజ సిద్ధముగ భగవ ద్భక్తి అలవడినది శ్రీకృష్ణునియందు వారికి అపరిమితమైన ప్రేమ కాలము గడచిన కొలదియు వారిలో శ్రీకృష్ణభక్తి దిన దిన ప్రవర్ధ మాన మైనది కులశేఖరులు సహజముగ సత్య పరాక్రమములు. అపార భూత దయా సముపేతులు దీనికి తోడు - సజ్జన సాంగ త్యము, స్వానుభవము విశేషముగ గలవారు. భక్తి జ్ఞాన వైరాగ్య

---

1 శ్రీ కులశేఖరాళ్వారులు క్రీ. 767 ప్రాంతమువారని చరిత్ర పరిశోధకుల అభిప్రాయము
— సంపాదకుడు

ములు కాల క్రమమున వారిలో వర్ధిల్ల నారంభించినవి శ్రీవైష్ణవ ధర్మారాధన ప్రభావముచే, రజ స్తమో గుణ విముక్తులై రి సత్త్వ గుణ సంపన్నులై, రాజ్యమును పాలించుచుండిరి

## కులశేఖర మహారాజు - జనక మహారాజు

శ్రీ కులశేఖర మహారాజుగారికి జనక మహారాజు ఆదర్శ ప్రాయుడు నిజమునకు కులశేఖరులు అపర జనకులు రాజ్యమును ధర్మ బద్ధముగ పాలించుట యందును, రాగ ద్వేష రహితముగ జీవితమును గడుపుట యందును, నిస్సంగ వర్తనము నందును, స్వదేశమును, సర్వ భోగములను త్యజించి, సర్వలోక శరణ్యుడైన శ్రీరామ చంద్రుని విభీషణుడు ఆశ్రయించినట్లు, కులశేఖరులుకూడ - పాంచ భౌతిక మైన శరీరము నందును, ప్రాపంచిక సుఖ లాభము లందును ఆసక్తిని విసర్జించిరి కలి యుగ వైకుంఠముగ కీర్తింపబడు శ్రీరంగ మును దర్శింపవలె ననియు కులశేఖరులు విశేషముగ ఆకాంక్షించు చుండెడివారు మరియు - తమ రాజ్యమును, రాజ భోగములను పరిత్యజించి, శ్రీరంగ క్షేత్రమున నిత్య నివాసము చేయుచు భగవ ద్భాగవతాచార్య సంసేవనము చేయు గడుపవలెననియు కులశేఖరుల సంకల్పము కాని, వారి సంకల్పము సర్వోత్తమమైనదే యయ్యును - దేశ ప్రజలకు, వారి ప్రయోజనములకు, రాజ్య నిర్వహణమునకు మాత్రము ఉపయుక్తము కాదు ఈ కారణము వలననే కులశేఖరుల సంకల్పమునకు మంత్రులు ఉపాయముతో వికల్పము గల్గించుచుండెడి వారు కులశేఖర చక్రవర్తి రాజ్యమును త్యజించిన యెడల, ప్రజలకు - రాజ్యమునకు ముప్పు కలుగును ధర్మము అనాధ యగును అందువలన, ఆ విధముగా జరుగుటకు అవకాశము లేదు

## కులశేఖరుల భాగవత భక్తి

శ్రీ కులశేఖరులకు భగవంతునియందు కంటెను భాగవతుల యందు భక్తి ప్రపత్తులు ఎక్కువ. భాగవతుల శుభాగమనమును ముందుగా తెలిసికొని, ఎదురేగి, స్వాగత వాక్యములు పలికెడి వాడు వారికి సేవలు చేయుటకు ఉద్యుక్తులగుచుండెడివారు అందు వలన, కులశేఖరులు శ్రీరంగమునకు వెడలిన యెడల, ఆ శ్రీరంగ నాథుని దర్శన విశేషము వలన లుగు మధురానుభూతిలో చిక్కు కొని, తన్మయత్వముతో అచ్చటనే నిలిచిపోగల రనియు, ఇక రాజ్య మునకు తిరిగి రా రనియు మంత్రులు సంశయము శ్రీ కులశేఖరులు శ్రీరంగమునకు బోవలె నని ఏ నాటి కానాడు పయన మగుటయు, వారి కెదురుగా - ప్రయాణమై వెళ్ళ నున్న సమయమునకు ఎవరో ఒకరు వేంచేయుటయు జరుగుచుండెడిది ఇది యంతయు శ్రీ కుల శేఖర మహారాజ శేఖరులు శ్రీరంగము వెడలుటకు వీలు లేకుండ మంత్రులు పన్నిన పన్నాగమన్న మాట! సరిగా ప్రయాణ మగు టకు కులశేఖరులు సన్నాహ మైనంతలో - ఎవరినో ఒక భాగవతో త్తముని తోడి తెచ్చి, కులశేఖరుల యాత్రను ఏ నాటి కానాడు వాయిదా వేయించుచుండెడివారు మంత్రులు

"ఘుష్యతే యస్య నగరే రంగ యాత్రా దినే దినే
త మహం శిరసా వందే రాజానం కులశేఖరమ్"

ఎవరి నగరమున ప్రతి దినము శ్రీరంగ యాత్రను గురించిన ధ్వనులు (చాటింపు) వినబడుచుండునో - ఆ రాజైన కులశేఖరులకు శిరము వంచి నమస్కరించుచున్నాను' ఇది - శ్రీ కులశేఖరాళ్వారు లను ప్రార్థించు శ్లోకము, ముకుంద మాలకు మకుటాయమానము

శ్రీ కులశేఖరాళ్వారులు 'ముకుంద మాల'ను భక్తి సంభరితముగను, రసవత్తరముగను రచించిరి ఆ మహనీయులు - భావ మధుర మైన కవితల నల్లగల విద్వత్కవులు 'ముకుంద మాల' లోకోత్తరమైన స్తోత్రరాజము అది శ్రీకృష్ణ భక్తి పారవశ్యమునకు ప్రాణావిష్కరణము గావించిన మహత్తర గ్రంథము ముక్తి ప్రదాత ముకుందుడు అతడే శ్రీకృష్ణుడు. అనగా శ్రీమన్నారాయణుడు శ్రీకృష్ణ భగవానునకు అర్పింపబడిన మాల - ముకుంద మాల

## కులశేఖరులు - తిరుమల నివాస సంకల్పము

తిరుమలలో నివసించినచో - ప్రశాంతముగను, ప్రమోదముగను ఉండగల దని కులశేఖరులు భావించుచుండెడివారు పవిత్ర పుష్కరిణిలో నిత్యము మజ్జనము చేయుచు, శ్రీనివాస భగవానుని దర్శన భాగ్యమువలన పునీతులైన మహనీయులు నివసించు తిరుమల దివ్య క్షేత్రములో - పక్షిగనో, వృక్షముగనో జన్మింపవలె ననియు, ఏ రూపమున నేనియు ఆ దివ్య క్షేత్రమునందే నివసింపవలె ననియు శ్రీ కులశేఖరులు విశేషముగ ఆశించుచుండెడివారు

## కులశేఖరుల రామ భక్తి

శ్రీ కులశేఖరులు పరీక్షిన్మహారాజు వలెనే భాగవత గోష్ఠి ప్రియులు సర్వ గుణ సంపన్నుడైన శ్రీరామచంద్ర శుభ చరితమును నినదించు శ్రీమద్రామాయణమును నిత్య పారాయణ శ్రవణాదులను గావించుచు, కాలక్షేపము చేయుచుండెడివారు ఒకనాడు కులశేఖర ప్రాసాదమున శ్రీమద్రామాయణ పారాయణ ప్రవచనము సాగుచున్నది యుద్ధ కాండ కొనసాగుచున్న ఘట్టము అందు —

> "చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమ కర్మణామ్
> ఏక శ్చ రామో ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి"

అను శ్లోకమును కులశేఖరులు శ్రవణము గావింతురు 'భయంకరులైన రాక్షసులు పదునాల్గువేలమంది ఒకవైపునను, ధర్మాత్ముడైన శ్రీరామచంద్రుడు ఒక్కడే మరియొక వైపునను - వీరి మధ్య ఏ విధముగా యుద్ధము జరుగుచున్నదో!' అని వాల్మీకి బాధపడు సన్నివేశ మది. దీని భావమును కులశేఖరులు గ్రహించిరి. అప్పటికే భక్తి పారవశ్యమున నున్న ఆ కులశేఖరులు - 'శ్రీరామచంద్రునకు ఏమి కష్టము కలుగునో! స్వామి వారికి సహాయమునగ నెవ్వరు లేరే!!' అని మిక్కిలి బాధపడుచు, వెంటనే తమ చతురంగ బలములను - సన్నద్ధము గావించి, స్వామికి అండగా నుండవలె నన్న భావముతో - చతురంగ బల సమేతముగ బయలు దేరుదురు. మహారాజశేఖరులగు కులశేఖరుల భక్తి తన్మయత్వమును మంత్రులు గ్రహింతురు. వెంటనే మహారాజుగారి ఆ ప్రయత్నమును విరమింపజేయుటకు విచిత్రముగా ఒక వ్యూహమును పన్నుదురు. మంత్రులు కొందరు భటులను రహస్యముగ మహారాజుగారికి ఎదురుగా పంపి, 'స్వామి వారు ఆ పదునాల్గువేలమంది దుష్ట రాక్షసులను తామొక్కరే సంహారించి, సీతమ్మ తల్లితో క్షేమముగా తిరిగి వచ్చిరి' అని తెలియ జేయుదురు. అది విన్న కులశేఖరులు - పరమ సంతోషితులై, తమ నగరమునకు తిరిగి వత్తురు[2]

---

2 ఈ సందర్భమును పురస్కరించుకొని, మరియొక చమత్కార ప్రసంగములో ఉన్నది. శ్రీమద్రామాయణ శ్రవణములో - రావణుడు సీతమ్మ తల్లిని తీసికొనిపోయిన ఘట్టము వచ్చినపుడు, శ్రీ కులశేఖరులు పారవశ్యమున వీరావేశముతో - 'మా తల్లి సీతమ్మను అపహరించుకొనిపోయిన దుర్మార్గుని వధించి, అమ్మను తీసుకొని వచ్చెదను' అని తన సైన్యముతో బయలుదేరి 'హరి హరీ' అంటు, సముద్రములో ప్రవేశింపగ, (లంకపైకి దండయాత్రకు) సముద్రుడు మార్గ మిచ్చెనట. ఇంతలో శ్రీరామచంద్రుడే సీత లక్ష్మణ సమేతుడై, ఎదురై, 'నాయనా! నీ కెందుకీ శ్రమ!' అని నేనే రావణుని వధించి, మీ అమ్మను తీసుకొని వచ్చితి నని చెప్పి, కులశేఖరుని నాశీర్వదించి, అంతర్ధాన మయ్యెనట!

శ్రీ కులశేఖరుల భక్తి పారవశ్యము, నిష్కళంకమైన శ్రీ వైష్ణవ సంశ్లేష భావము అంతటి మహోదాత్తమైనవి ఇక మహా రాజుగారు ఈ రీతిగా తన్మయత్వములో మునిగిపోయిన యెడల, రాజ్యము - ప్రజలు నిర్లక్ష్యమునకు గురి యగు ప్రమాద మున్నది దానిని ఎట్లైనను రక్షింపవలెనుగదా !

## కులశేఖరుల భక్తి ప్రశస్తి

మహారాజుగారి అంతఃపురములో సాధారణముగ వచ్చుచు పోవుచుండు భగవద్భక్తులకు స్వాగత సత్కారములు, సాంప్రదాయిక చర్చలు జరుగుచుండెడివి శ్రీవైష్ణవ స్వాములకు అచ్చట కొంతయో స్వేచ్ఛ ఉండెడిని మహారాజుగారి దర్శనమునకు వచ్చి పోవు శ్రీవైష్ణవ స్వాములను అంతఃపురములో అడ్డగించువా రెవరును లేరు అయినచో - ఈభక్తుల రాకపోకలు - ఇక వారి సేవలో ఒడలు మరచిపోవు ప్రవృత్తి గల కులశేఖరుల ఈ వ్యవహారమంతయు మంత్రుల కెంతయు బాధాకరముగ నుండెను పరిపాలనా వ్యవహారములకు సైతము అంతరాయముగ మారిపోవుటతో - ఈ దండయాత్రలు చేయుచున్న శ్రీవైష్ణవ స్వాములను ఏరీతిగనైన - రాజుగారి సంస్థానమునకును, అంతఃపురమునకును రాకుండునట్లు తరిమివేయవలె నని పన్నాగము పన్నుదురు

శ్రీ కులశేఖరుల రాజప్రాసాదమందలి తిరువారాధన మందిరమునకు ఒక అమూల్యమైన నవ రత్న హార మున్నది దానిని స్వామివారి అలంకారమునకు ఉపయోగించుచుందురు ఆ నవ రత్న హారమును మంత్రులు రహస్యముగ దాచి వైచి, అది పోయినట్లు ప్రకటింతురు, దానిని రాజ ప్రాసాదమునకు తరచు వచ్చి పోవు

శ్రీవైష్ణవులు మాత్రమే తీసియుందు రనియు, మఱి యొక విధముగ పోవుటకు అవకాశము లేదనియు - మంత్రులు, అధికారులు ప్రవాదమును కల్పింతురు ఇట్లు చేసినచో - రాజుగారికి శ్రీవైష్ణవులపై ద్వేషము కలుగు ననియు, రాజుగారు వారిని విడిచిపెట్టి, రాజ్య వ్యవహారములలో యథా యోగ్యముగ శ్రద్ధ వహింపగల రనియు అధికారుల ఆలోచన అయినచో - ఆ విధముగ జరుగకపోవుటయందే దైవ సంకల్పము స్పష్టము కాగలదు

మంత్రులు కల్పించిన ప్రవాదమును శ్రీ కులశేఖరులు విశ్వసింపక, శ్రీవైష్ణవ స్వాముల సత్య ధర్మ ప్రవృత్తిని, ఉన్నతమైన భక్తి భావమును ఉటంకించుచు, శ్రీవైష్ణవుల పట్ల తమకు ప్రగాఢముగా గల విశ్వాసమును - ఊహాతీతముగను, వ్యాఖ్యాతీతముగను నిరూపించుటకు సిద్ధమగుదురు భయంకరమైన నల్లత్రాచు పామును తెప్పించి, బుట్టలో పెట్టింతురు రాజుగారి సాహసమునకు పెట్టిన అగ్ని పరీక్షకు మంత్రులు సంభ్రమ భయ భ్రాంతులగుదురు ఈ పరీక్షలో ఈ నిజముమాట యెటున్నను, త్రాచు కాటు వేసినచో - రాజుగారికి నూరేండ్లు నిండు ప్రమాద మున్నదిగదా ! సరియే అందరును చూచుచుండ, కులశేఖరులు పాము బుట్టలో చేయి నుంచి, అందలి నాగ సర్పమును సునాయాసముగ, స్థైర్యముగ పట్టి, బయటికి విడిచిపెట్టుదురు ఆ పాము చక్కగా ప్రక్కకు ప్రాకి, అదృశ్య మగును మంత్రులు ఆశ్చర్య చకితులై, తమ అపరాధమును క్షమింపు డని ప్రభువును ప్రార్థింతురు తమ పశ్చాత్తాపమును ప్రకటించుకొందురు

## కులశేఖరుల వైరాగ్యము

కులశేఖరులు ఉదార హృదయులు గనుక, అపరాధులైన తమ అధికారులను క్షమింపగల్గినను, భాగవతులైన శ్రీవైష్ణవులపై వారు

భాషలలో పండితులగుటచేతను, దివ్యానుభవమునకు, భగవద్గుణాను సంధానమునను - భావ మధురము, భక్తి బంధురము నగు భాషలో భగవంతునకు అక్షరాభిషేకము చేయగలిగిరి తాము తరించుటే గాక, తర తరములను తమ సంకీర్తనాదుల మనన పఠన పారాయణాదులతో తరింపజేసిరి శ్రియః పతి సన్నిధి కెదురుగ తా మొక శిలగా నైనను కావలె ననియు, ఆ మహా భాగ్యమే చాలు ననియు మనసార కోరిరి శ్రీవారి సన్నిధిలో రాయిగా పడియున్నచో - అహరహము శ్రీవారి దివ్య మంగళ విగ్రహమును, ముఖారవిందమును సేవించుచుండవచ్చు ననియు, శ్రీవారిని దర్శించుటకు వచ్చు భక్తులు నిరంతరం పాద రజ స్పర్శతో తాము తరించవచ్చు ననియు కులశేఖరుల తలంపు మహా భోగిగా, మహాయోగిగా ద్వంద్వములను సుఖముగా, స్వకీయముగా, సమర్థముగా గడపిన సార్థక శుభ చరితులు శ్రీ కులశేఖరాళ్వారులు

## కులశేఖరుల కృష్ణ భక్తి - ముకుంద మాల

శ్రీ కులశేఖరులు రచించిన 'ముకుంద మాల' - భక్తితత్త్వమునకు దర్పణము మధురమైన సంస్కృత సాహిత్యమున ఇది - హృదయములను కదలించి, భక్తి జ్ఞాన వైరాగ్యములను ప్రబోధించు స్తోత్ర రాజము ఇందు కులశేఖరులు శ్రీకృష్ణ భగవానుని దేవాది దేవునిగా ప్రస్తుతింతురు అట్లే, తాము దశరథ మహారాజుగా భావన చేసికొని, శ్రీరాముని ప్రేమించుచున్నట్లు, శ్రీరాముని కల్యాణ గుణ సంపదను ప్రశంసించుచున్నట్లు 'పెరుమాళ్ తిరుమొళి' ప్రబంధమును రచించిరి భక్తి రస ప్లావితము లగు ఈ రెండు గ్రంథములును లోకమున కలకాలము నిలిచియుండగలవు

ముకుంద మాలలో - నలుబది శ్లోకము లున్నవి ఆధ్యాత్మిక చింతనతో పాటు - ప్రాపంచిక సత్యములు, భగవద్గుణానుభవము లు,

వ్యామోహ ప్రశమనౌషధములు, శత్రుచ్ఛేదైక మంత్రములు, హరి చరణ స్మరణామృతములు, కృష్ణ రసాయనములు, భృత్య భక్తి తత్త్వములు, ధ్యానామృతస్వాదములు, భవ జలధి తరణమునకు భక్తినావలు - అనేకము లున్నవని భగవద్భక్తులకు ముకుంద మాల - నిత్య పారాయణ గ్రంథము అయ్యనది - పాంచ భౌతిక మైన శరీరమును హిరణ్మయముగా చేయగల మహా మహిమాన్వితమైనది దీర్ఘ రోగములకు మండల నియమముతో (40 రోజులు) ఔషధ సేవ వలె - ముకుంద మాల లోని నలుబది శ్లోకములను నియమ యుక్తముగ పారాయణము చేయుచు, ఆ శ్లోకములలోని విశేషార్థములను గ్రహింపగల్గినవారు - శ్రీకృష్ణ పారవశ్యమును పొంది, ఆ మధురాంబుధిలో ఓలలాడగలరు ఒక నూతన కాంతిని, దైవిక స్ఫూర్తిని తప్పక పొందగలరు ఆ శ్లోకములలో అంత ర్లీనముగా గల - లయ, మార్దంగిక వైభవము, వీణా నిక్వణము, సంగీత ఝరి - ఏ పాఠకున కైనను హృదయంగమ మగు అనుబంధమును, ఆనందమును కల్గించి, ముగ్ధుని జేయు ననుట అత్యుక్తి కానేరదు

## మహా రాజ శిరోమణి - మహా భక్త శిరోమణి

శ్రీ కులశేఖరుల జీవితము లోకమునకు ఆదర్శప్రాయమైనది సార్వభౌములుగా ఆ మహనీయులు మహా భోగ భాగ్యముల ననుభవించిరి స్వచ్ఛందముగ రాజ్యమును పరిత్యజించి, పరమయోగులై, తమ జీవితమును శ్రీకృష్ణ స్మరణమునందును, భగవ ద్భాగవత సేవ యందును గడపిరి

కులశేఖరులు క్షత్రియులు ధర్మ బద్ధులు ధను ర్విద్యా నిపుణులు యుద్ధ విజయులు రాజర్షులు బ్రహ్మ జ్ఞాన సంశోభితులు మహా పండితులు కవి శిరోమణులు దయా నిధులు కావుననే

శ్రియఃపతి విష్వక్సేనునిచే కులశేఖరులకు పంచసంస్కారములు చేయించెను మోక్ష సామ్రాజ్యమును అందించెను

## ధన్యాత్ములు కులశేఖరులు

శ్రీ కులశేఖరులకు గల విష్ణు భక్తి - అపారము, అద్వితీయము ఆ పరమ భక్తాగ్రేసరులు సర్వ సంగ పరిత్యాగము గావించి, నిరంతరము శ్రీ రంగనాథుని సేవింపవలెనన్న ఉత్కంఠను వృద్ధి గావించుకొని, తుదకు శ్రీ రంగనాథస్వామి సన్నిధి ప్రధమ ద్వారమున గడపగా మారిపోయిరి (పడియాయ్ ఇరుందు ఉన్ పవళవాయ్ కండేనే) పగడము వంటి నీ అధరమును సేవింపజేయ వలసిన దని ప్రార్థించి, తమ మనోరథమును సిద్ధింపజేసికొనిరి దివ్యము, భవ్యము, శ్రీహరి ప్రియము నగు జీవితమును 67 సంవత్సరములు గడపిన శ్రీ కులశేఖరాళ్వారులు మిక్కిలి ధన్యాత్ములు శ్రీ విష్ణు భక్తి సామ్రాజ్యమునకు ప్రభువులు - శ్రీమ ద్వేదమార్గాదిత్యులునైన ఆ మహానీయుల అడుగు జాడలలో పయనించువారు పరమ ధన్యులు

" క్షీర సాగర తరంగ శీకరా
సార తారకిత చారు మూర్తయే
భోగి భోగ శయనీయ శాయినే
మాధవాయ మధు విద్విషే నమః "

—, ం —

# ముకుంద మాల

సంస్కృత మూలము

## శ్రీ కు ల శే ఖ రా ళ్వా రు లు

### ఆంధ్ర వ్యాఖ్యానము

వ్యాకరణ విద్యా ప్రవీణ - భాషా ప్రవీణ

ఉభయ వేదాంత శిరోమణి

## శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు, ఎం ఏ

—*—

### ముందు మాట

భగవత్ప్రాప్తికై జన్మాంతర సుకృత పరిపాకముచే లభించిన మానవ జన్మకు ఆవశ్యకమైనది భక్తి భక్తి లేని జీవితము నిరర్థకము భక్తియే ముక్తికి సాధనము భక్తియే పరమ పురుషార్థము ప్రేమతో నిరంతరము కృష్ణానుశీలనము చేయుటయే భక్తి తపో ధ్యాన సమాధులచే పొంద జాలని భగవానుని - మనకు వశపరచునది భక్తి 'భక్త్యా మా మభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః' 'భక్త్యా త్వనన్యయా శక్యః' అని భగవద్గీతలో - అనన్య భక్తియే భగవత్ప్రాప్తిని కల్గించునది యని వివరించినాడు

ముండకోపనిషత్తునందును, కఠోపనిషత్తునందును - 'పరమాత్మ కేవల శ్రవణముచేగాని, మననముచేగాని, ధ్యానముచేగాని లభించు వాడు కాదు, పరమాత్మ ఎవరిని వరించునో - వారికే లభించును' అని చెప్పబడినది అట్లు పరమాత్మచే వరింపబడుటకు ఏమి ఉండవలెను? కర్మయా? కాదు జ్ఞానమా? కాదు మరేమి? ఆ పరమాత్మను వదలి

నే నుండలేను, వానిని చేరియుండి - వారికి సేవలు చేయుట తప్ప, నాకు వేరొకటి యక్కరలేదని, వేరొక ప్రయోజనమును కాంక్షిం పని ప్రేమ గలవారెను వారికి తానే వశుడగును తన స్వరూపమును దర్శింపజేయును వారికి పరమాత్మను తలంచుటయే ఆనందముగా నుండును వారికి పరమాత్మను తలంచుటకు వేరొక ప్రయోజన ముండదు దీనినే పరమ భక్తి, పరా ప్రేమ, అవ్యభిచరిత భక్తి, అనన్య భక్తి యని యందురు

అట్టి భక్తికి దృష్టాంతముగా చెప్పబడినవారు గోపికలు ఆ కృష్ణ భక్తిని ఈ యుగములో అనుభవించినవారు ఆళ్వారులు వారికి అట్టి భక్తి - సహజముగ గల్గినది జ్ఞానము చేతను, కర్మ చేతను కల్గినది కాదు అట్టి ఆళ్వార్లలో - భక్తి పరవశులై, రాజ్య మును పాలించుచు, సంతత కృష్ణ భక్తి పారవశ్యముతో జీవితము భక్తి మయమైన మహా రాజులు కులశేఖరులు

ఆ కులశేఖరులు భక్తి పారవశ్యముతో నిత్యము శ్రీరంగమే వెళ్ళవలె నని చాటించుచుండెడివారు కాని, వారికి భగవంతునియం దెంత ప్రేమయో, భగవద్భక్తులయందు అంతకంటె ఎక్కువ ప్రేమ వారు వచ్చుచున్నారని తెలిసిన, భగవత్సేవకంటె ముందు - వారి సేవ చేయవలె నని కోరెడివారు కులశేఖరులు శ్రీరంగము వెంచేసి నచో - తన్మయత్వము నంది, మరల రాజ్యమునకు రారని శంకించి, వారి మంత్రులు నిత్యము భగవద్భక్తులను కోడి తెచ్చి, కులశేఖరుల శ్రీరంగయాత్రను వాయిదా వేయించుచుండెడి వారు శ్రీకృష్ణ భక్తి కంటెను శ్రీకృష్ణ భక్తులయందు వారికి ప్రీతి యెక్కువ యని వారి ప్రార్థన తెలుపుచున్నది ఓ కృష్ణా! నీ భక్తుల భక్తుల భక్తుల

భక్తుల భక్తుల భక్తుల భక్తునకై యుండునట్లు నన్ను అనుగ్రహింపుము ' 'త్వద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ !' అని ప్రార్థించిరి వారి ముఖము నుండి ఆవిర్భవించిన స్తోత్ర రాజము ముకుందమాల ముకి నొసంగు వాడు ముకుందుడు - శ్రీకృష్ణుడు ఆయనకు అర్పించిన మాల - ముకుంద మాల కంఠమున వెలుపల మాలను ధరించినట్లే, లోపల ముకుంద మాలను ధరింపవలెను దీనివలన మానవుడు జీవితమును సార్థకము చేసికొనగలడు

## కులశేఖర స్తుతి

*ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినే దినే*
*త మహం శిరసా వందే రాజానం కులశేఖరమ్*

పన్నిద్దరాళ్వారులలో ఒకరైన కులశేఖర మహారాజు - శ్రీరంగ నాథుని సేవించుటకై భక్తులందఱను వెంట గొనిపోవ, రంగయాత్రను గూర్చి చాటింపించుటయే సాగుచుండెడిది శ్రీరంగనాథుని గుణ కీర్తనము చేయుచు, భక్తి తన్మయులై యీ చాటింపు వేయుచుండ, సమయము గడచిపోవుచుండెడిది ఇట్లు శ్రీరంగనాథుని గుణానుభవము నందే సమయము గడిపెడి భక్త కులశేఖరు లగు శ్రీ కులశేఖర మహారాజును సాష్టాంగపడి నమస్కరించుచున్నాను

విశేషార్థము :-

ఈ శ్లోకము కులశేఖరులను ప్రార్థించు శ్లోకము ముకుంద మాలను రచించిన కులశేఖరులు మహారాజు భక్తిమయమైన జీవితమును సాగించెడివారు వారి పట్టణములోని ప్రజలతో కూడ శ్రీరంగమునకు వెళ్ళవలె నని వారి కోరిక ప్రయాణమును చాటించుచుండెడి

వారు కాని, వారు ప్రయాణమునకు సిద్ధపడెడి వేళకు భాగవతులు వచ్చిన, వారికి ఆతిథ్య మిచ్చి సేవించి వెళ్ళవలె నని మరునాటికి ప్రయాణమును మార్చుచుండిరి ఈ విధముగ నిత్యము వారి పట్టణమున రంగ యాత్ర చాటింపబడెడిది అట్టి కులశేఖరులకు నమస్కరించుచున్నాను దీనివలన వారికి గల భాగవత భక్తి ఎంత గొప్పదో తెలియుచున్నది భగవ ద్భక్తి వేరుగా ఉంగుటకంటె, భాగవత భక్తియున్నచో, భాగవత - భగవ ద్భక్తి మాత్రము కల్గినవారి కంటె గొప్పవారు అట్టి స్వరూపము మనకు సిద్ధించుటకు కులశేఖరులకు నమస్కరించవలెను

## స్తోత్ర ప్రారంభము





*శ్రీ వల్లభేతి వరదేతి దయాపరేతి*
*భక్త ప్రియేతి భవ లుంఠన కోవిదేతి*
*నాథేతి నాగ శయనేతి జగ న్నివాసే*
*త్యాలాపనం ప్రతిపదం కురు మే ముకుంద !*

మహా భక్తశేఖరు డయిన శ్రీ కులశేఖర మహారాజు - ప్రథమతః స్తోత్రారంభమున ముకుందుని గూర్చి యీ క్రింది తెరంగున ప్రార్థించిరి

' ఓ ముకుందా ! శ్రీవల్లభ ! వరద ! దయాపర ! భక్తప్రియ ! భవలుంఠన కోవిద ! నాథ ! నాగశయన ! జగన్నివాస ! 'అన్న నా మొరకు సమాధాన మొసంగుము '

విశేషార్థము -

ముకుందా ! నేను మాటామాటికి ప్రతి మాటలో నీ నామమునే పలుకునట్లు అనుగ్రహింపుము శ్రీ వల్లభ ! వరద ! దయాపర !

భక్త ప్రియ! భవ లుంఠన కోవిద! నాథ! నాగ శయన! అని నేను సంతతము నీ నామములను ఆలపించునట్లు చేయుము

ముక్తికి ముఖ్య సాధనము నామము మాటకు సంస్కృతమున 'పదము' అని పేరు 'అడుగు' అని కూడా, పదము అను మాటకు అర్థము అడుగు వేసినను, నోరు విప్పినను భగవన్నామమే రావలెనని వారి కోరిక నడచుచును - ఏ పనులు చేయుచున్నను ఏ మాటలు మాటాడుచున్నను భగవన్నామమును మరువరాదు భగవంతుని చేరుటకు రేవు 'శ్రీ' ఆమెయే లక్ష్మి కృష్ణావతారములో రాధగా - రుక్మిణిగా వచ్చిన దామెయే ఆమె నాశ్రయించి, ఆమె ద్వారా ఆమెకు ప్రియుడు అని సర్వేశ్వరు నాశ్రయించవలెను ఆమె అనుగ్రహము లేనివారికి భగవదనుగ్రహము కలుగదు భగవానుని నామములలో - భగవానుని కిష్టమైన పేరు 'శ్రీ వల్లభ' దానిని ముందుగ కీర్తించవలెను అట్లు కీర్తించిననాడు మనము కోరిన కోరికలను భగవానుడు తీర్చకయుండ లేడు మనము అధికారులమా! అనధికారులమా! యని సంశయింపక అమ్మ ద్వారా ఆశ్రయించుటయే మన యోగ్యత యని మనకు తెలియ నొసంగును కావున, 'వరదా!' అని కీర్తింపవలెను

ఇంతటి యాదరమును చూపిన స్వామికి మన మేమి అర్పింపగలము? అర్పించుటకే మున్నది? అతడు మనవద్దనుండి ఏమి అపేక్షించును? ఏమియు అపేక్షింపడు మన మాతనిని ప్రేమించుటయే కాంక్షించును మనము అతనిని ప్రేమించినచో - అతడు మనలను మాటలతో చెప్పలేనంతగా ప్రేమించును 'భక్తాస్తే ఽతీవ మే ప్రియాః' 'యో మద్భక్తస్స మే ప్రియః' 'స చ మమ ప్రియః' అని చెప్పినట్లు, మన మేమియు చేయనక్కరలేదు ప్రేమించిన, ప్రేమించువాడని 'భక్త ప్రియ!' అని కీర్తింపవలెను

మనము భగవంతుని ప్రేమించినందువలన భగవంతుని కెట్లు ఏ ప్రయోజనము లేదో, అట్లే భగవంతుడు మనలను ప్రేమించినను మన కేమియు చేయడు అనుకొనకుడు మనకు తెలియకుండ, మన 'భవమును' అనగా – సంసారమును త్రుంచి వేయును తాను శ్రమ పడి ఛేదింపడు – మనకు ఛేదించుచున్నట్లు తెలియదు మన ప్రయత్న మక్కర లేక, తన ప్రయత్న మక్కర లేక, దాని యంతటు అదియే జారిపోవునట్లు చేయు నేర్పు కలవాడు కనుక, 'భవ లుంఠన కోవిద!' అని కీర్తింపవలెను

ఇంత చేసియు ఏమియు చేయనివాని వలె హాయిగా శేష శయ్యపై శయనించియుండును శేషుడు తన శరీరమును స్వామికి 'ఇల్లుగా, పాన్పుగా, ఆసనముగా, పాదుకగా, వస్త్రముగా, తలగడగా, గొడుగుగా, పాద పీఠముగా' మార్చి మార్చి వినియోగపరచును మనము కూడ మన శరీరమును, ఆత్మను అన్ని విధముల వానికే విని యోగపరచిననాడు – ఆ శేషము మీద పరుండినట్లే, శేషభూత మైన మన ఆత్మలో కూడ ఆ స్వామి పరుండును కావున, 'నాగశయన!' అని కీర్తించవలెను

ఎక్కడో దూరముగా శేష శయ్యపై పరుండినవానివలన మన కేమి లాభము? మనము వానిని పొందగలమా? అను కొనకుడు అతడే సర్వ జగమును తనకు నివాసముగా ఏర్పరచుకొని నివసించును సర్వ జగమునకు తాను నివాసమై యుండును మనలో ప్రత్యణువు నందును ఆతడుండును ఆతడు లేని చోటు లేదు కావున, 'జగన్నివాస!' అని కీర్తింపవలెను ఇట్లు మాట మాటకు, అనుగనుగున నీ నామమును జపించునట్లు చేసి, ముక్తి నొసగెడి స్వామీ! అను గ్రహింపుము

జయతు జయతు దేవో దేవకీ నందనో ఽయం
జయతు జయతు కృష్ణో వృష్ణి వంశ ప్రదీపః
జయతు జయతు మేఘ శ్యామలః కోమలాంగో
జయతు జయతు పృథ్వీ భారనాశో ముకుందః ౨

ఓ దేవా ! దేవకీ నందన ! నీకు జయము వృష్ణి వంశ మంగళ దీపమా ! కృష్ణా ! నీకు జయము సుకుమార శరీర ! మేఘశ్యామ ! నీకు జయము భూ భార నాశక ! ముకుంద ! నీకు జయము జయము

విశేషార్థము –

ముకున్దః, దేవః, దేవకీ నందనః – జయతు జయతు

మోక్షము నిచ్చువాడు ముకుందుడు ముకుందుడు ఎవడు ? మా దేవకీ నందనుడు ఎక్కడో గోలోకములోనో, శ్రీ వైకుంఠము లోనో ఉండిన మనము చేరలేము. తానే దిగి వచ్చి, తనచేత సృష్టింప బడిన జగత్తులో ఒక వ్యక్తి యయిన దేవకీదేవి గర్భమున సంవత్స రము వసించి, ఆమె కానంద సంధాయకుడై జన్మించిననాడే ! ఆహా ! స్వామీ ! ఏమి నీ దయ !! దేవుడవు ! దేవకీ నందనుడ వయితివా ! స్వయం ప్రకాశకుడవైన నీవు, అట్టి దేవకీ దేవి కుమారుడ వయి తివా ! సర్వ జగదానందనుండవు ! దేవకీ నందనుడ వయితివా ! నీ సౌశీల్యము సర్వోత్కృష్టతో విరాజిల్లుగాక !

'ముకున్దః, కృష్ణః, వృష్ణి వంశ ప్రదీపః' జయతు జయతు

దేవకీదేవి కుమారుడవై జన్మించి యూరకుంటివా ? స్వామీ ! అజ్ఞానము అనెడి చీకటితో నిండి యున్న యదు వంశమునకు విచ్చేసి, చీకటిని పోగొట్టి, వెలుగు నిచ్చితివి నిరతిశయానంద స్వరూపుడవు – నీవే కృష్ణుడవు నీవే మోక్ష ప్రదుడవు సామాన్యమైన దీపమువంటి

వాడవు కావు నిప్పు ప్రదీపము బయటి చీకటిని మాత్రమే దీపము పోగొట్టును ప్రదీపము అందరికి అన్ని వేళల ప్రకాశించును తనంత తానై, ఎల్లప్పుడు ప్రకాశించును ఆనందమునే కల్గించును అట్టి మా కృష్ణ ప్రదీపమునకు మంగళ మగుగాక!

మా మోక్షము నిచ్చు ముకుంద తత్త్వము గుణములు లేనిది, రూపము లేనిది కాదు మేఘ శ్యామలము - కోమలాంగము - మేఘమువంటి వర్ణము గలది మేఘము వలె రసము (జలము) నిండి నది జలముచే తనుపునది మేఘము నీరు నిండిన మేఘము వర్షించుటకు ప్రార్థన అక్కర లేకయే వర్షించును మా స్వామియు అంతే చూచినవారికి తాపము చల్లార్చును దర్శించినవారికి ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపములను పోగొట్టును - మా ముకుంద మేఘము మేఘము నీరు నిండి యాగలేక వర్షించును కాని, ఒకరి యుపకారమునకై కాదు మా కృష్ణ పరమాత్మ మోక్షమును (ఆనంద రసమును) వర్షించుట ఒకరి యుపకారమునకై, తనకై తా నాగ లేక ప్రసాదించును నీల మేఘము తన కున్న దంతయు వర్షించి, ఏమియు చేయలేకపోతినే యన్నట్లు వెలవెల బోవును అట్లే, మా కృష్ణ మేఘము ఆశ్రితానాశ్రిత భేదము లేక, అభ్యర్థన లేక, దయా రసమును వర్షించియు - ఏమియు చేయలేకపోతినే యని వైవర్ణ్యము నందును మేఘము వంటి స్వభావమే కాదు, రంగు కూడా శ్యామలము ఆ నీలిమయే మనకు రక్షకము స్వామి అనంతుడని మనకు తెలుపునది ఆ నీలిమయే అపరిచ్ఛిన్నుడు, ఆనందమయుడు, వాత్సల్య స్వరూపుడు, సమదర్శనుడు, ఉదారుడు, మనోహరుడు అయిన స్వామి - మేఘ శ్యాముడు

ఈ కల్యాణ గుణములతో బాటు, దివ్య మంగళ సుకుమార ముగ్ధ మంజుల విగ్రహుడు స్వామి మూర్తి ఎంత సుకుమారమో!

పుష్పహాస సుకుమార మా మేను నునకొర కెంత కష్టపడినాడు !
అయ్యో ! ఆ గుణములు, ఆ సుందరమూర్తి మా కనురాపు తగిలి,
మాయమయుండ వర్ధిల్లుగాక !

స్వామి అవతారమునకు సాధు పరిత్రాణము, దుష్కృద్వినా
శనము, సాధు పరిత్రాణ దీక్ష మూడు పాదములలో చెప్పి, నాల్గవ
పాదములో - 'పృథ్వీ భార నాశ ' మా ముకుందుడే భూమి బరువును
తొలగించి చేసినాడు అనుచున్నారు మోక్ష మనగా - క్రొత్తగా
కల్పించి యిచ్చునది కాదు భూమికి రాక్షసులు బరువు మన ఆత్మకు
'నేను' 'నాది' అను భావన బరువు అది తొలగుటయే మోక్షము
కృష్ణుడు అవతరించిన తర్వాత, లోకములో అందరు - శత్రువులు,
మిత్రులు, ఉదాసీనులుకూడ వారే యయిరి కావున, లోకములో -
'నేను' పోయినది అంతయు వానిదే యగుటచే, 'నాది' పోయినది
ఇట్లు భూమికి బరువైన రాక్షసులను అహంకార మమకార దూషితు
లను తొలగించ చేసి, శ్రీకృష్ణ పరమాత్మ ముకుందు డయినాడు అట్టి
ముకుందునకు జయ మగుగాక !

*ముకుంద ! మూర్ధ్నా ప్రణిపత్య యాచే*
*భవంత మేకాంత మియంత మర్థం*
*అవిస్మృతి స్త్వ చ్చరణారవిందే*
*భవే భవే మే ఽస్తు భవ త్ప్రసాదాత్* 3

మొదటి శ్లోకములో కృష్ణుని పిలిచి, రెండవ శ్లోకములో -
ఎదుట నిలిచిన కృష్ణునకు జయము పలికి, యిచటినుండి కులశేఖరులు
స్తోత్రము చేయుచున్నారు ఈ శ్లోకము - 'ముకుంద'తో ప్రారంభ
మగుటవలన, 'ముకుంద మాల' యను నామము ఈ స్తోత్రమునకు
కలిగెను ఇందు - ముకుంద ద్వాదశాక్షరీ మంత్రము నిక్షిప్తమైన దని
పెద్దలు చెప్పుదురు.

ఓ ముకుందా ! నీ పాదారవిందములను జన్మ జన్మముల నేను మరువకుండునట్లు అనుగ్రహింపుము నీ యెదుట శిరసు వంచి, మోకరిల్లి, నిశ్చయముగా ఈ కోరికనే కోరుచున్నాను
విశేషార్థము –

ఓ ముకుందా ! తలవంచి నమస్కరించి, నిన్నొక చిన్న కోరిక కోరెదను ప్రతి జన్మ మందును నీ పాదారవిందములపై నా తలంపు నిలిచియుండునట్లు అనుగ్రహింపుము

ఈ శ్లోకములో కులశేఖరులు - ముకుంద మాలలో సారభూతమైన ప్రార్థన చేయుచున్నారు పురుషుడుగా జన్మించినవాడు పొందవలె నని కోరదగినది పురుషార్థము మోక్షము ఆ మోక్షము జన్మ రాహిత్యమా ? భగవత్సాయుజ్యమా ? అవిద్యా నివృత్తియా ? భగవత్సాలోక్యమా ? భగవత్సారూప్యమా ? అని పలువురు పలువిధముల శంకించుట కవకాశము కల్గు నని తాము ముకుందుని నుండి అర్థించి పొంద దలచిన మోక్షము యొక్క స్వరూపము వివరించుచున్నారు

నాకు జన్మ రాహిత్య మక్కర లేదు పరమ పద ప్రాప్తి అక్కర లేదు ఏ లోకములో ఏ రూపమున నున్నను సరియే కాని, నేను కోరెడి పరమ పురుషార్థ మగు మోక్షము —— 'నీ పాదారవిందములు మరపు రాకుండుటయే' అని కులశేఖరులు తాము పొంద దలచిన పురుషార్థమును వివరించినారు

భగవత్పాదారవిందములను నిరంతరముగ స్మరించుటయే ధ్యానము అదియే భక్తి అది వాని అనుగ్రహము వలననే సిద్ధించునది కాని, మన ప్రయత్నముచే కాదు. ఆ భక్తితో పాటు స్థాన

మును, కర్మను కూడ నేను కోరుట లేదు. దానిని మాత్రమే కృప చేయుము ఆ భక్తి చేత మరి యొక దానిని పొందవలె నని నేను భక్తిని కోరుట లేదు అదియే నాకు సాధ్యము అది మరి యొక దానికి సాధనము కారాదు 'ఏకాంతం - ఇయంతం' అను రెండు మాటలలో ఈ భావమును సూచించినారు అజ్ఞానము, మాయ అనగా - భగవత్పాదారవింద విస్మృతి అది లేకపోవుట అజ్ఞాన నివృత్తి, మోక్షము అంతే కాని, శరీరమును వీడుట కాదు లోకాంతరమును పొందుట కాదు భగవత్పాదారవింద విస్మృతి రాహిత్యమే కులశేఖరుల మోక్షము అంతే కాని జన్మ రాహిత్యము కాదు దానిని ప్రసాదించుటకు భగవానుని ఈ ముకుంద మాలలో అర్థించుచున్నారు ఈ ముకుంద మాలను చదివినవారికి అట్టి మోక్షము భగవదనుగ్రహముచే లభించును

*నాహం వందే తవ చరణయోర్ద్వంద్వమద్వంద్వహేతోః*
*కుంభీపాకం గురుమపి హరే నారకం నాపనేతుమ్*
*రమ్యా రామా మృదుతనులతా నందనే నాపిరంతుం*
*భావే భావే హృదయభవనే భావయేయం భవంతమ్ ॥*

ఓ కృష్ణా! ద్వంద్వాతీత స్థితిని అందవలె నని కాని, కుంభీపాక నరకమును తప్పించుకొనవలెనని కాని, లావణ్యవతులగు అప్సరసలను స్వర్గములో అనుభవింపవలె నని గాని నేను నీ పాదారవిందములకు నమస్కరించుట లేదు ఎట్టి దేహము నొసంగినను సరియే, నా కభ్యంతరము లేదు కాని, సర్వదా మనసులో నిన్నే స్మరించునట్లు చేయుమని నీకు నమస్కరించుచున్నాను

విశేషార్థము :-

హే కృష్ణా! నీ చరణారవిందములకు నమస్కరించు ద్వంద్వాతీత స్థితి నందియుండుటకు కాదు, అనాది యైన జన్మ పరంపరలో

నొనర్చిన పాపముల ఫల మనుభవించుటకు జంకి, వానిని తప్పించు కొనుటకు నీకు నమస్కరించుట లేదు పుణ్య కర్మలకు ఫలముగా - నందన వనమున సుకుమారాంగు లగు సుందరుల ననుభవింపవలె నని కోరిక కాదు నే నీ శరీరములోనే యుండి, ద్వంద్వములకు వశుడనై యున్నను, నరకములో నున్నను, స్వర్గములో నున్నను నా మనసులో కల్గెడి ప్రతి భావములోను నిన్నే భావించవలెను ఇదియే నా కోరిక

ప్రహ్లాదుని పాములచే కరిపించినను, ఏనుగులచే త్రొక్కించి నను బాధ కలుగకుండుటకు కారణ మేమి? మత్తు నందు ఇచ్చి, శస్త్ర చికిత్స (ఆపరేషను) చేసినచో - శరీరమును కోయుచున్నను బాధ కలుగదు అది తాత్కాలికము శాశ్వత మగు అట్టి వేదనా రహిత స్థితి కలుగవలె నన్న ఏమి యుండవలెనో, ప్రహ్లాదాదు లీ శరీరములో నుండియు - అట్టి రాగ ద్వేషములకు, సుఖ దుఃఖములకు అతీతులై యుండు కేమి యొనర్చిరో దానిని కులశేఖరులు కోరు చున్నారు ఇంద్రియములు ఇంద్రియార్థములతో కలిసినపుడు రాగ ద్వేషములు నియతముగా కలుగును కాని, మనసును ఇంద్రియములతో చేరకుండ, భగవ ద్భావనతో నింపిన ఆ రాగ ద్వేషములు లోనికి రావు కర్మలు మంచి వైనను, చెడు వైనను ఫలము నీయక మానవు వానిని వారించుకొనుటకు ఎన్నియో జీవితములు ప్రయత్నించవలెను అంతకంటెను భగవ ద్భావనతో హృదయము నిండినచో - శరీరము నకు కల్గెడి సుఖ దుఃఖములు హృదయమున ప్రవేశింపజాలక, పై పొరలోనే నిల్చిపోవును కావున, కులశేఖరులు కోరెడిది ద్వంద్వ వినాశము కాదు కర్మ వినాశము కాదు నిరంతర భగవ ద్భావన ఇదియే పరమ పురుషార్థము ఇదియే మోక్షము వెనుకటి శ్లోక ములో - ఏది తాము కోరెడిదో చెప్పినారు ఇందులో - తాము కోరనివానిని చెప్పినారు దీనిచే కోరదగినది - భగవ త్పాదారవింద స్మృతి రాహిత్యము, సతత భగవ ద్భావన అని తెలియుచున్నది

*నాస్థా ధర్మే న వసు నిచయే నైవ కామోపభోగే*
*యద్యా ద్భవ్యం భవతు భగవన్ పూర్వ కర్మానురూపమ్*
*ఏత త్ప్రార్థ్యం మమ బహు మతం జన్మ జన్మాంతరేఽపి*
*త్వ త్పాదాంభోరుహ యుగ గతా నిశ్చలా భక్తి రస్తు ౫*

ఓ కృష్ణా! ధర్మము నార్జింపవలె నని గాని, అర్థమును కూడ బెట్టవలె నని గాని, కామముల ననుభవింపవలె నని గాని నాకు కోరిక లేదు నా పూర్వ కర్మల ననుసరించి ఏది యెట్లు జరుగ వలెనో అట్లే జరుగు గాక! ఈ జన్మయందు గాని, జన్మాంతరమందుగాని నీ పాదార విందయము యందు నిశ్చల మగు భక్తి కలుగవలె ననునది యొక్క టియే యభిమత మగు కోరిక (జన్మ రాహిత్యము - లేక, మోక్షము కంటెకూడ కృష్ణ భక్తినే ముఖ్యముగా ప్రార్థించుచున్నారు కులశేఖ రులు నాలుగు పురుషార్థములకంటెకూడ, భగవంతునియందు ప్రేమయే పరమ పురుషార్థ మని వారి యాశయము.)

విశేషార్థము -

ధర్మార్థ కామములు పురుషార్థములు మానవుడు వీనిని కోరి సంపాదింపవలెను వెనుకటి జన్మలలో చేసిన కర్మలను అనుసరించి, ఈ జన్మలో ధర్మ శ్రద్ధ, ధనము, కామ భోగము లభించును అవి వ్యతి రేకముగా నున్నపుడు భగవానుని ప్రార్థించి, ధార్మికుడుగా - ధని కుడుగా - భోగిగా తాను మారవచ్చును కాని, వీని యన్నింటికంటె పొంద దగినది - శాశ్వత సుఖమైనది భగవద్భక్తి దానిని సాధ నముగా చేసి ధర్మమునుకాని, భోగమునుగాని, జన్మ రాహిత్యమును గాని ఆర్జించుట రేగు పండ్లకు ముత్యములు వెలపోసినట్లు, అవివే కమే యగును కావున పురుషార్థములు అనుకొనుచున్న నాలుగు పురుషార్థములు కావు ఒక్క భక్తియే పరమ పురుషార్థము. దానినే

అర్థించి పొందవలెను అని ఎరింగిన కులశేఖరులు - 'హే భగవన్! ధర్మమునందుకాని, అర్థమునందుగాని, కామోపభోగమునందుకాని నాకు ఆస్థ లేదు అవి పూర్వ జన్మలలోని కర్మానుగుణముగ ఎట్లు వచ్చినను సంతోషమే! జన్మ రాహిత్యముకూడ నాకు కాంక్షణీయము కాదు ఎన్ని జన్మ లున్నను హాని లేదు కాని, నీ పాదారవిందము నిశ్చల మగు భక్తిని ప్రసాదించితివేని, అంతకంటెను కోరదగినది లేదు ఆ భక్తినే ప్రసాదింపుము' అని, ఈ శ్లోకములో పరమ పురుషార్థముగా భక్తిని కోరుచున్నారు భక్తి కలిగిన తరువాత, ధర్మార్థ కామములు భగవ ద్విషయమున ప్రవర్తించిననాడు అవి పొంద దగినవి అందుచే, ధర్మ కామములు భక్తికి అంగములుగా ఆచరింపదగినవే! కాని, స్వతంత్రముగా ఆచరింపదగినవి కావు

*దివి వా భువి వా మమాస్తు వాసః*
*నరకే వా నరకాంతక ప్రకామమ్*
*అవధీరిత శారదారవిందౌ*
*చరణౌ తే మరణేఽపి చింతయామి* ౬

వెనుకటి శ్లోకములో - భగవంతుని తలంచుటకంటెను ఇతరములైన ఫలములను వేనిని కాంక్షించ నని చెప్పి, కులశేఖరులు ఇందు - ఈ ప్రదేశముననే యుండవలె నను కోరిక కూడ నాకు లే దను చున్నారు

ఓ నరకాంతక! కృష్ణా! స్వర్గమునం దున్నను, నరకమునం దున్నను నా కేమియు వ్యథ లేదు కాని, శరత్కాల పద్మ సుందరము లగు నీ చరణారవిందములనే మరణ సమయమున గూడ ధ్యానించుచుందును

విశేషార్థము -

నరకాసురుని అంత మొందించుటకై ఎంతయో శ్రమ పడి అంతమొందించి, వాని చెరలో నున్న స్త్రీలను చేపట్టితివి కాని, నేను కూడ నీ దివ్య పాదారవిందములను చూడలేని - తలంచలేని అజ్ఞాన బంధమున నున్నాను వర్షరుతువులో తామరలు మునిగిపోవును శరదృతువు వచ్చిన వెంటనే, తామరలు నీటిపై అందముగా కనబట్టును అవివేక మనెడి మబ్బు పట్టి, ఆధ్యాత్మిక - ఆది భౌతిక - ఆధి దైవిక దుఃఖములు వర్షించు స్థితిలో - శ్రీకృష్ణ పాదము లనెడి తామర పూవులు కనబడకుండ పోవును సత్త్వ గుణము శరదృతువువలె మనస్సున పర్విననాడు - రజో గుణ మనెడి బురద విరిగి, చిత్తనదీ జలము ప్రసన్న మయిననాడు - శారద పుండరీకములను ధిక్కరించజాలిన స్వామి పాదములు కనబట్టును ఆ స్థితి నాకు జీవించియున్నంతకాలము మాత్రమే కాదు - మరణించినను ఆ పాదారవింద స్మృతియే నాకు కలుగవలెను కాని, ఆ స్మృతి ఫలము నుద్దేశించి కాదు స్వర్గమునకు వెళ్ళినను, నరకమునకు వెళ్ళినను నాకు అభ్యంతరము లేదు జీవద్దశలో, మరణ దశలో, మరణానంతర దశలోకూడ ఆ కృష్ణ పాదారవింద స్మరణమే నాకు కావలెను కాని, ఈ స్మరణము ఒక ప్రయోజనము నుద్దేశించికాని, ఉత్తమ లోక ప్రాప్తి నుద్దేశించకాని కాకుండు గాక! ఇదియే ఏకాంతిక భక్తి దీనినే కులశేఖరులు అర్థించినారు

*కృష్ణ! త్వదీయ పద పంకజ పంజరాంతం*
*అద్యైవ మే విశతు మానస రాజ హంసః*
*ప్రాణ ప్రయాణ సమయే కఫ వాత పిత్తైః*
*కంఠావరోధన విధౌ స్మరణం కుత స్తే* ౨

కృష్ణా! మరణ సమయమున స్మరింప వలె యంటివిగాని, ఆ వేళ కఫ వాత పైత్యములచే కంఠము మూతపడినపుడు నీ నామ

స్మరణ కలుగునో కలుగదో! కావున, ఇప్పుడే నా మానస రాజ హంసము విరోధు లెవరను చేరలేని వజ్ర పంజరమువలె నుండు నీ పాదపద్మ మధ్యమున చేరుగాక!

విశేషార్థము -

మరణమునకు ముందు జీవ ద్దశలో సత్త్వ గుణ మావిర్భవించిన మనస్సు భగవత్స్మరణము చేయవచ్చును మరణానంతరము ఏదియో యొక శరీరములో నుండును గనుక, అచ్చట చేయవచ్చును కాని, మరణ సమయమున ఈ శరీరమును ప్రాణములు వీడినపుడు మనస్సు ఇంద్రియములతో గలిసి, వేరొక శరీరమునకు ప్రయాణము చేయు అలజడి పడుచుండును ఈ శరీరమునుండి ప్రాణము బయలు పడుటకు - కఫము, వాతము, పిత్తము కంఠమున బిగబట్టును ప్రాణ మాడకపోవుటచే మనసు గిజ గిజ లాడుచుండును ప్రాణము కదలక పోయినచో మనసు పని చేయదు ఆ సమయములో భగవత్స్మరణమునకు ముందున కులశేఖరుల వారు ఒక యేర్పాటు చేయుచున్నారు కృష్ణా! ప్రాణములు ఈ శరీరమును వీడిపోవు సమయమునగూడ, నా మనస్సు నిన్ను స్మరించుటకు ముందుగ, దానిని నా మనస్సు) నీ పాద పంజరములో బంధింపుము పంజరములో నున్న హంస - పంజరముతోనే బయటికి పోవును కావున, బయటి వాతావరణములోని ఆటు పోటులు పంజరమునకే కాని, హంస కుండవు ఈ హంస - స్వచ్ఛమైన జలము గల మానస సరోవరములోని రాజ హంస అది కృష్ణ పాద పంజరములో తల్లడిల్లుచున్నను, గాలి చొరరాని పంజరమున నున్న హంసకు బెదురు లేదు ఈ దశ - సమాధి దశ మనస్సులో - భగవత్పాదారవిందములను ప్రవేశించినది ఇపుడు మనస్సునకు కదలిక లేదు, కదలిక యున్ననాడు ప్రాణము యొక్క ఆవశ్యకత ఈ ప్రాణముతో సంబంధము లేనిది భగవత్పాదారవింద పంజరము కఫ వాత పిత్తములు ఆ పంజరము

నేమియు చేయలేవు పాదారవిందములకు బయట మనసు కన్పడదు పాదారవిందములే కన్పడుచుండును. ఈ దశలో - ప్రాణము పోయి నను, పాదారవిందములతో మనస్సునకు సంబంధము తెగదు కనుక, స్మరణ మున్నట్లే ఇట్లు మనస్సును సమాధ్యవస్థలో ఉంచి - యోగి మరణించిన, భగవానునితో కలసియుండియే ఈ దేహమును వీడును కావున, కులశేఖరులు కృష్ణ పాద పంజరములో తమ మనస్సు అను రాజ హంసను ప్రాణ ప్రయాణమునకు ముందుగనే ప్రవేశ పెట్టవలె నని కోరుచున్నారు

*చింతయామి హరి మేవ సంతతం*
*మంద మంద హసితాననాంబుజమ్*
*నందగోపతనయం పరాత్పరం*
*నారదాది మునిబృంద వందితమ్* ౮

నారదాది మునీశ్వరులచే సేవింపబడు వానిని, పరాత్మరుని, నందగోప కుమారుని, నవ్వు రాజిల్లెడు మోమువానిని, కృష్ణుని ఎల్లప్పుడు నేను ధ్యానించుచుందును

నాలుగవ శ్లోకమునుండి యింతవరకు - అనన్య ప్రయోజన మున, సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును అవిచ్ఛిన్నముగ ఆటంకములు లేక, హరి స్మరణ తనకు కావలెనని కులశేఖరులు కోరినారు ఆ కోరిక ననుసరించి లభించిన హరిని అనుభవించి, తృప్తితో పై శ్లోకమును చెప్పుచున్నారు

విశేషార్థము .

ఇంతవరకు భక్తి స్వరూపమును కులశేఖరులు వివరించినారు భక్తి యనగా - భగవానుని యందు నిరతిశయ ప్రీతి ఆ ప్రేమ య రొక దానిని పొందుటకు సాధనము కాదు ఆ భక్తి కలిగి, దానిచేత ధర్మార్థ కామ మోక్షముల నార్జించుట కాదు ఆ భక్తి త్రిగుణాతీత

స్థితినందుట కాని, నరక నివారణము కాని, కర్మనాశనము కాని ఫలము కారాదు. ఆ భక్తి - భక్తి కొరకే. అదియే పరమ పురుషార్థము. అది ఈ జన్మలో - మరణ సమయములలో - జన్మాంతరములలో ఈ ఆత్మ యున్నంత కాలము ఉండదగినదే కాని, ఒకప్పు డుండి, ఒకప్పుడు పోవునది కాదు. దీనినే ఆత్యంతిక, ఏకాంతిక భక్తి యందురు. ఇదియే గోపికల భక్తి. ఇదియే నారదుడు నిర్వచించిన భక్తి. ఆ భక్తి యుండవలెనని ప్రార్థించి, అట్టి ప్రేమతో తాను అనుశీలించు శ్రీకృష్ణ చంద్రుని దివ్య మంగళ మూర్తిని ఈ శ్లోకములో స్మరించుచున్నారు. కృష్ణమూర్తి యందు భక్తి కలిగియుండి, వేరొక మూర్తినిగూడ స్మరించుట తగదు. శ్రీకృష్ణునే స్మరించవలెను. ఆ శ్రీకృష్ణుడే హరి. మన మాతనిని పొందుటకు, దర్శించుటకు, తెలిసికొనుటకు ప్రతిబంధకములను హరించును. మన నాతనితో చేర్చుకొనును. అందుకే ఆతడు హరి. ఆ హరియే శ్రీకృష్ణుడు. ఆ శ్రీకృష్ణుడే మా నందనుడు. ఆతడే పరాత్పరుడు. ఆతనినే తలంచవలెను. ఎల్లప్పుడు తలంచవలెను. మా స్వామికి గుర్తు - ముగ్ధ సుందర మందహాసమే. ఆ స్వామి ముఖ పద్మము సుందర మందహాసముతో వికసించును. ఆ మందహాసమే మనపై అమృతపు వెల్లువయై పడి, మనను దగ్గరకు చేర్చును. ఈ మందహాసములో - స్వామి వాత్సల్య మాధుర్యములు తొణికిస లాడును. ఈ ప్రకృతికంటె పరుడైన జీవునికంటె పరుడు పరాత్పరుడు. ఆ పరతత్త్వమే నారదాది మహా భక్త బృందముచే సేవింపబడునది. ఆ పరతత్త్వమే సులభమై, నందగోపునకు కుమారుడుగా ఆవిర్భవించిన. ఆహా! ఏమి పరత్వము! ఏమి వాత్సల్యము! ఏమి సౌశీల్యము! ఏమి సౌందర్యము! ఏమి మాధుర్యము! ఏమి దాక్షిణ్యము! గుణము లన్నియు పుష్కలముగా నిండిన చోటు. దివ్య మంగళ

విగ్రహము గల స్వామి అట్టి హరినే, నందగోప తనయునే స్మరింతును ఇతరములైనవి నాకేల?

*కర చరణ సరోజే కాంతిమన్నేత్రమీనే*
*శ్రమ మషి భుజవీచి వ్యాకులే ఽగాధ మార్గే*
*హరి సరసి విగాహ్యా పీయ తేజో జలౌఘం*
*భవ మరు పరుఖిన్నః ఖేద మద్య త్యజామి* –

నేను ఈ సంసార మనెడి యెడారిలో ప్రయాణము చేసి బడలి, నే నీ హరి సరస్సున చేరితిని ఆహా! ఎంత సుందర మీ సరస్సు ఆ హరి కర చరణములే యిందలి తామరలు శోభావంతము లగు నేత్రములే యిందలి తామరలు శోభావంతము లగు నేత్రములే మిల మిల లాడు మీనములు భుజములే అందు కెరటములు అవి శ్రమల నన్నిటిని హరించును ఆ రేవులు అవగాహనము చేయుటకు అనుకూల మున లోతు కలవియై యుండును.

అందు చొచ్చి, ఆ తేజ స్సనెడి జలమును కడుపు నిండుగ త్రాగి, నా బడలిక తీర్చుకొనుచున్నాను

విశేషార్థము –

కులశేఖరులు హరిని సరస్సుతో పోల్చి అనుభవించుచున్నారు సరస్సు జలముతో నిండియుండును హరి తేజస్సుతో నిండి యుండును ఆ దివ్య తేజోమయమగు హరి సరస్సునందు స్వామి హస్తములు, పాదములు ఎర్రని కాంతితో తామరలను పోలి భాసించుచుండును. దివ్య కాంతిని ప్రసరింపజేయు స్వామి నేత్రములు మీనములవలె కదలాడుచుండును ఆ హరి సరస్సు శ్రమను తొలగించును తాపమును చల్లార్చును తన త్రిస్థానముల మాయము చేయును ఆ హరి సరస్సున అవగాహించి, శాస్త్ర విషయ రాగ దూషితమైన అపవిత్రతను పోగొట్టుకొన వలెను ఆ జలము త్రాగి, అంత ర్బహిస్తాపములు తగ్గి,

సుఖము నందవలెను శ్రీకృష్ణ స్వరూపము కేవలము తేజో రూపము కాదు దివ్య మంగళ విగ్రహము కలది కాని, అది దివ్య తేజ పరివృతము ఎండలో ప్రయాణము చేసి బడలినవాడు - సరస్సులో దూకి మునక వేయును కడుపు నిండి, దోసిళ్ళతో నీరు త్రాగును దూకుటలో - ఆతని ఆర్తిత్వం కనబడును మునుగుటలో సర్వాంగములు జల మగ్నము లయి బయటి తాపము తగ్గును త్రాగుటచే, లోపలి పిపాస శమించును అట్లే, సంసార మను ఎడారిలో - మండు టెండవంటి తాపములతో తపించిన జీవుడు, శ్రీకృష్ణానుభవ మనెడి సరస్సులో దూకి, ఆ యానందమునందు బాహ్య విషయములు గోచరము కానంతగా మునుగవలెను అర్చనము, వందనము, కీర్తనము మున్నగునవి చేయుచు, సర్వేంద్రియ పరితర్పణ మొనర్చవలెను ధ్యానముచే లోనికి త్రాగవలెను

" సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే "

అన్న విధముగ ఉపాసింపుటయే శ్రీకృష్ణ సరస్సులో అవగాహించి, తేజో జలపాన మొనర్చుట ఇట్టి యనుభూతి నందినవారికి బాహ్య విషయ రుచి నశించును కావున, బడలిక ఉండదు బాహ్య విషయములందలి ప్రావణ్యముచే వానిని పొందుటకు పడెడి ఆరాటమే ఖేదము హరి సరోవగాహన తేజో జల పానము చేసినవానికి ఆ ఖేద ముండదు అట్టి అనుభవమును కులశేఖరులవారు ఇందు అనుభవించినారు

సరసిజ నయనే స శంఖ చక్రే
మురభిది మా విరమ స్వ చిత్తరంతుమ్
సుఖతర మపరం న జాతు జానే
హరి చరణ స్మరణామృతేన తుల్యమ్. ౧౧.

ఓ మనస్సా ! ఏ కాలమందైనను హరి చరణ సంస్మరణము అను అమృతమువలె సుఖ ప్రదమైనది వే ఱొకటి లేదు కావున, ఆ పుండరీకాక్షుడు శంఖ చక్రధరుడు నగు మురారిని సేవించి రమించు టను మానకుము

విశేషార్థము -

శ్రీహరి చరణ స్మరణ మనెడి అమృతమును పానము చేసిన కులశేఖరులు తమ మనసుతో చెప్పుచున్నారు ఓ మానసా ! ఇంత వరకు నీవు సుఖములను అనుభవించి అనుభవించి, ఒక దానిని వదలి, మరొక దానిని పొందుచు వచ్చుచున్నావు ఇంత కాలము నీవు నిరంతర సుఖాన్వేషణతో శ్రాంతి నొంది, విశ్రాంతి నొందకున్నావు కాని, నేడు నీవు అనుభవించుచున్న హరి చరణ స్మరణామృతము వంటి సుఖము వే రెచటనైన మనము చూచితిమా ! లేదు ఇంతవరకు మన మనుభవించిన సుఖములు కొంత కాల మనుభవించగనే చాలు నని పించెడివి అందుచే, మనసా ! నీవు వాటిని వదలెడిదానవు కాని, ఈ అమృత మెంత త్రావినను తృప్తి కలుగుటలేదుకదా ! దీని నాస్వా దించుట మానవద్దు అని చెప్పుచు, మనస్సును 'స్వచిత్త !' 'నా మనస్సా !' అనుచున్నారు ఇంత కాలము మనస్సు పెట్టెడి బాధలకు తాళలేక, దానితో సంబంధములను వదలుకొనవలెనని ప్రయత్నించి నారు కాని, నేడు హరిచరణామృత పాన మత్తతతో, ప్రసన్నమైన మన స్సుతో తాండవించుచున్న కులశేఖరులు - నా 'మనస్సు' అని మన స్సును ఆలింగనము చేసికొనుచు, 'హరి చరణ స్మరణామృత పానమును మానకుము' అని ప్రతిమాలుచున్నారు కొంటె మనస్సు ! ఇంతకు ముందు ప్రతి అనుభవము 'చాలును, మానుము' అని కులశేఖరులు లేను మానిపించెడివా గని 'ఏమి ! గీనిరుకూడ మానసా !' అని చెవ

రించుచుండ, 'స్వచిత్త మా విరము' 'ఓ మా మంచి మనసా! వలాన వద్దు - మానవద్దు' అని ప్రబతిమాలుచున్నారు

లోకములో వారికి ఆస్వాదించు వస్తువులలో తియ్యదనముగా కలది అమృతమే కనుక, దానిని ఉపమానముగా చెప్పితిమికాని, ఆ సముద్రములోనుండి దేవతలు, రాక్షసులు మధించగా వచ్చిన అమృతము వంటిది కాదు మా హరిచరణామృతము అది అచేతన మయిన అమృతము మాది జగత్కారణ మయిన అమృతము సూర్య మండలాంతర్వర్తి యయిన పుండరీకాక్షుడే, శంఖ చక్ర ధారియే మా అమృతము తనను చేరకుండ మిమ్ములను అడ్డగించిన విరోధులను నాశము చేసి, తనతో మాకు నిత్య సంబంధమును కల్గించునది మా అమృతము దీనికంటె సుఖమైనది వేరొకటి లేదు విడువక అనుభవింపుడు

*మా భీర్మంద మనో విచింత్య బహుధా యామీ శ్చిరం యాతనా*
*నామీనః ప్రభవంతి పాపరిపవః స్వామీ నను శ్రీధరః*
*ఆలస్యం వ్యపనీయ భక్తి సులభం ధ్యాయస్వ నారాయణం*
*లోకస్య వ్యసనాపనోదనకరో దాసస్య కిం న క్షమః ౧౧*

ఓ మూఢ మయిన మనసా! యమ యాతనలను పలు విధముల చిరకాలము చింతించి భీతి నొందకుము ఒన ప్రభు వగు శ్రీహరి యుండగా - ఈ పాపము లనెడి శత్రువులు మనల నేమియు చేయ జాలవు కావున, భక్తిచే సులభముగా పొంద దగు నారాయణుని జాగు సేయక ధ్యానింపుము లోకములో అందఱి ఆపదలను తీర్చువాడు - తన దాసుని యాపదల తొలగింపలేడా!

విశేషార్థము -

శ్రీ కులశేఖరులవారు మనస్సుతోనే మాటాడుచున్నారు కులశేఖరులు హరి చరణామృతమును మిగులవకుము అని మనస్సునకు

బోధించిరి కాని, మనస్సు - 'వెనుక చేసిన ఎన్నియో పాపము లున్నవికదా! మన మీ రీతిగా ఈ అమృత పానముతో మత్తెక్కి యున్నచో - పొంచి యుండి, ఆ పాపము లనెడి శత్రువులు మనపై బడి, యమ లోకమునకు తీసికొనిపోయి హింసించును ఆ పాపముల నెల్లను హత మార్చి, తరువాత హాయిగా ఈ అమృత పానముతో ఆనందము ననుభవింతము! శత్రువులు బయట పొంచి యుండగా - ఈ యానంద మేమి ఒంటి బట్టును?' అని భయపడి, శంకించుచున్నది. దానిని చూచి, 'ఓ వెర్రి మనస్సా! ఇదేమి నీ మూర్ఖత! ఆ యమ లోకపు యాతనలను తలచుకొని, అనవసరముగా భయపడకుము. ఏమి? ఈ పాపములా? మనను పట్టుకొనుటయా! రమ్మనుమనుము. మాతము మన స్వామి శ్రీ ధరుడే! ఆతనిచాత మన్న తర్వాత, ఈ పాపములు భయపడి పారిపోవును ఆతడు మనల నెందుకు రక్షించును? మనలను మనము రక్షించుకొనవలెను అనుకొనకుము అతని సొత్తు మనము ఆతడు సొత్తుగలవాడు సొత్తును కాపాడుకొను బాధ్యత సొత్తుకలవానిదా? సొత్తుదా? మన కెందు కా పూజ? 'రక్షిపామి' అనునుకదా! అని భయపడకుము అతడు 'శ్రీధరుడుకదా!' మన అమ్మ అపాటనున్నది మన తప్పులను కన్పడకుండ చేయును స్వామిని మెత్తపరచును మన వైపు చల్లగా చూచి, స్వామిని చేర్చును చింత లేదు భయపడకుము అయినను, మన మేమి చేయవలెను? ఆలస్యము చేయక, వెంటనే [illegible] లొంగిపోయెడి నారాయణుని మనస్సులో తలంచుము గట్టిగా పైకి పిలచినకాని, వారికి వినపడదు గట్టిగా పిలచిన, ఈ పాపపు దొంగలు పై బడుదురు ఏమి చేయవలెనని దిగులు పడకుము తలంచినంతనే శ్రీధరునకు తెలియును ఆతడు నారాయణుడు అందరిలో తా నుండువాడు అందరు అతనిలో నుందురు. అందుచే మనము తలంచునప్పుడు స్తోత్రము ప్రేమతో తలంచుము. అంతే! ఆతనే సహాయమునకు వచ్చి, పాపముల బాధ మనకు లేకుండ

చేయును 'ఆతని దాసులము కాము' అనుకొనెడివారినికూడ ఆతడే రక్షించుచుండును వారికి తెలియక నేనే రక్షించుకొనుచున్నాను. ఇతరులు రక్షించుచున్నారు అనుకొందురు అట్టి స్థితిలో - 'నీ దాసులము' అన్న మనలను రక్షించుట ఒక వింతయా! ఆతని కిది ఎంత పని! ఓమనసా! రమ్ము హాయిగా నారాయణ స్మరణముతో జీవితమును గడుపుదము.

భవ జలధి గతానాం ద్వంద్వ వాతా హతానాం
సుత దుహితృ కళత్ర త్రాణ భారార్దితానామ్
విషమ విషయ తోయే మజ్జతా మప్లవానాం
భవతు శరణ మేకో విష్ణుపోతో నరాణామ్ ౨౩

ఈ నరులు సంసార సముద్రములో బడి, సుఖ దుఃఖములు మొదలగు గాలిచే కొట్టుకొనిపోవుచున్నారు బిడ్డలు, భార్య మొదలగువారి బరువు - వారిని ఎంతెంత క్రిందకు ముంచుచున్నది ఆ బరువుతో ఈ విషయము లనెడి జలమున మునుగుచున్న నరులను కాపాడుట కే తెప్పయు కానరాకున్న సమయమున, వారిని కాపాడు నౌక ఒక్క విష్ణువు మాత్రమే

విశేషార్థము :-

శ్రీమన్నారాయణుడే సర్వ జగద్రక్షకుడు రక్షణ మనగా - అనిష్టమును తొలగించుట, ఇష్టమును అందించుట అనిష్టములు వారి వారి మనస్థితినిబట్టి, వేర్వేరుగా నుండును సంసారులకు అనిష్టములు - వ్యాధులు మున్నగునవి భగవత్ప్రాప్తిని కోరెడివారికి ఈ సంసారమే అనిష్టము. ప్రకృతి వశుడై, కర్మ పరతంత్రుడై, విషయములలో మునిగి, భగవద్విషయమునకు దూర మగుటకంటె ఘోరమైన ఆపద మరి యొకటి యుండదు దాని నెట్లు దాటుదమా యని చింతతో

బాధపడు చున్న వారికి శ్రీ కులశేఖరులు ఒక ధైర్యము చెప్పు చున్నారు

ఈ సంసారము సముద్రము దీనిలో పడియున్నవారు - చేతు లతో ఈది, ఒడ్డును చేరలేరు దీనిని దాటించుటకు ఒక పడవ కావలెను అట్టి పడవ లేదు సంసార మనెడి సముద్రములో - శబ్ద స్పర్శ రూప రస గంధములు అనెడి విషయములు తలక్రిందులుగా పొంగుచున్న జలమువలె పొంగి, ముంచుచున్నవి సుఖ దుఃఖములు, శోక మోహములు, ఆకలి దప్పులు, జరా మృత్యువులు అనెడి ద్వంద్వ ములు పెను గాలివలె ఒడ్డుకు చేరనియక, త్రోసివేయబడుచుండును పైగా, నెత్తి మీద పెద్ద బరువు బిడ్డలు, భార్య, భర్త మొదలగు వారిని రక్షించవలె ననెడి భారము ఇక ఒడ్డును చేరుట ఎట్లు ? అట్టి ఈ సంసార సముద్రమును దాటుటకు - 'విష్ణు పోతము' అనెడి ఒకేవ ఒకేవిధ శరణము సంసారమును దాటించు పడవ - 'విష్ణువు' అనగా - ఈవలి ఒడ్డునుండి ఆవలి ఒడ్డువరకు వ్యాపించి యుండును అంచుచే, దీని నెక్కితిమా ! మరి తెడ్డు వెయ్యనక్కర లేదు, నడప నక్కరలేదు మన ఎవలి ఒడ్డున చేరి యుందుము. అంత మాత్రమేకాక, ఒడ్డు చేరిన తర్వాతకూడ దిగనక్కరలేదు ఆవలి ఒడ్డునకూడ ఇది వ్యాపించియుండును దీని నాశ్రయించినవారిని - ఇంక ఏ విధాలను లేక, సర్వత్ర ఇది మోసికొనిపోవుచుండును. అనగా - భగవానుడే సంసార సముద్రమును దాటుట కుపాయము కాని, ప్రవృత్తియు కాదు భగవానుడు ఉపాయమే కాదు - ఉపే యము కూడా దాటించునది విష్ణువే దాటిన తర్వాత చేరునది విష్ణు వుచె అంటిపెటలి, వేరొక దానిని - కర్మమునో, జ్ఞానమునో, భక్తినో ఆశ్రయించి, సంసారమును దాట, భగవానుని పొందవలె ననుకొనుట మహా భగవానుడే భగవానుని పొందించు ఉపాయ మని ఎరింగిన 'శ్రీ మహా విష్ణువే పోతము అనగా పడవవలె మనలను దాటించును

*భవ జలధి మగాధం దుస్తరం నిస్తరేయం*
*కథ మహ మతి చేతః మాస్మగాః కాతరత్వమ్*
*సరసిజ దృశి దేవే తావకీ భక్తి రేకా*
*నరక భిది నిషణ్ణా తారయిష్య త్యవశ్యమ్* ౧౩

ఓ మనసా! ఈ సంసార సముద్ర మింత లోతైనదే! దాటుట శక్యము గానిదే! నే నెట్లు దాటగలను?' అని పిరికితన మందకుము పుండరీకాక్షుడగు కృష్ణ భగవానునియందు నీ వనన్య మగు భక్తిని నిలిపినచో - నీ ప్రయత్నము లేకయే అది నిన్ను దాటించును. నిశ్చయము

విశేషార్థము -

ఈ సంసార సముద్రము అగాధము 'దీని లోతు ఇంత' అని తెలిసికొన శక్యము కాదు మునిగిన, బ్రతుకుదు మని ఆశ లేదు. పోనీ! చేతులతో ఈది దాటవచ్చునా? ఎంతటి గజ ఈతగాడైనను, దీనిని దాటలేడు ఇంక నేను దాటుట యేమి? అది సాధ్యమా! అని ఓ మనసా! పిరికి పడుచున్నావా? వలదు విష్ణుపోత మున్న దని చెప్పితిని కదా! దానిపై కూర్చుండుము, అవతలి ఒడ్డును చేర్చును - అనిన, మన సి ట్లనును 'ఏ మేమి నే నెక్కుటయా? కూర్చుండుటయా? అది ఎట్లు? నే నెక్కగలనా? ఎక్కలేను' పోనిమ్ము - నేను ఆ విష్ణువును (పడవను) పొందలేను అదియే నన్ను రక్షించునది అని ప్రేమతో తలంచుము అంతే అది ని న్నెక్కించుకొనును. నేను తలంచితి నని దాని కెట్లు తెలియును? అయ్యో! ఈ పడవ - మామూలు పడవ కాదు తామరపూవులంతటి కన్నులు గల 'పుండరీకాక్ష మగు పోతము' సూర్య మండలాంతర్వర్తియై, సర్వ జగ త్కార

ణమై, సర్వ జగత్ప్రేరకమై తన సౌందర్యముచే అందరిని ఆకర్షించెడి దీ
పోతము గాని నీ వధిరోహించుట కాదు దానిని నీలో - ప్రేమతో
తలంచుము అంతే త్రోవలో పెద్ద పెద్ద తిమింగిలాది క్రూర
జంతువులవంటి నరక ప్రతిబంధకములను భేదించుకొనుచు, విలాస
ముగా - శ్రమ లేకయే హేలగా నిన్ను ఆవలి ఒడ్డు చేర్చును
అందుచే భయము వీడి, ఆ శ్రీ మహా విష్ణుపోతమును ప్రేమించుము
హాయిగా సంసార సముద్రమును తరించగలవు భక్తియే భగవానుని
చేర్చునది భక్తియే ప్రతిబంధకమగు సంసారమును విడిపించునది
మన యత్నమక్కరలేదు మనకు తెలియకయే పాపము వీడిపోవును

*తృష్ణాతోయే మదన పవనోద్ధూత మోహోర్మి మాలే*
*దారావర్తే తనయ సహజ గ్రాహ సంఘాకులే చ*
*సంసారాఖ్యే మహతి జలధౌ మజ్జతాం న స్త్రిధామన్*
*పాదాంభోజే వరద భవతో భక్తి నావం ప్రయచ్ఛ ౧౨*

సంసారమను సముద్రములో పడి, మునుగుచు, తేలుచు, దాటలేక బాధపడుచున్నవారికి విష్ణువే నౌకయనియు, విష్ణు భక్తియే నౌకయనియు వెనుకటి రెండు శ్లోకములలో పేర్కొని, ఆ నౌకనొసంగుమని విష్ణువునే ప్రార్థింపవలెనని యెఱిగి, యిందు ప్రార్థించుచున్నారు

ఈ సంసారమను సముద్రములో ఆశయే జలము ఆ జలము కామమను పెనుగాలిచే కదల్పబడుచుండును అట్లు కదలుటచే, మోహమను కెరటములు వరుసగా సాగుచుండును ఈ సముద్రములో - భార్య సుడిగుండమువలె పట్టి త్రిప్పి, అందు పడినవారిని బయటకు పోనీయక, ముంచివేయును బిడ్డలు, బంధువులు - మొసళ్ళు మొదలగు జంతువులవలె కబళింప ప్రయత్నించుచుండును ఇట్లు

భయంకర మగు సంసార మహా సముద్రమున బడి దాటు నుపాయము
లేక మునుగుచున్న మాకు, ఓ వరద! ఓ త్రివిక్రమ! నీ పాదపద్మ
భక్తి యనెడి నౌక నొసంగి, దరి జేర్పుము

విశేషార్థము –

సంసార సముద్రమును దాటుటకు నావ కావలెను ఆ నావ
శ్రీ మహా విష్ణువే కాదు ఆ శ్రీమహావిష్ణువునందు భక్తియే తరింప
జేయును' అని వెనుక చెప్పెను అది సాధ్యమా! ప్రేమతో భగవా
నుని సంతతము తలంచుకొనుట భక్తి అది నాకు లభించుటెట్లు?
సంసార మను మహా సముద్రములో మునుగుచున్న మనకు ఎట్లయంత
భక్తి కలుగదు ఆ భగవానుడే యొసంగవలెను స్వామీ త్రివిక్రమ!
వరదా! నీవే సముద్రమున మునుగుచున్న మాకు భక్తి యనెడి నా
వొసంగుము ఈ సంసార సముద్రములో ఆశయే నీరు కింది లోతు
ఎంతయో వెడల్పు తెలియదు పాత నీరు ఆవిరి యగుచున్న కొలది -
నీరు వచ్చి పడుచుండును. అడుగున బడబాగ్ని యున్నను, నీరు
తగ్గించలేదు ఎంత జ్ఞాన మున్నను, ఎన్ని శాస్త్రములు చదివినను ఆశ
పొంగులువారుచుండును సముద్రములో కెరటములతో నీరు పొంగు
చున్నట్లు, మనలో ఆశలు పొంగి పొర్లుచుండును బ్రతికి యుండవలె
నని యాశ బ్రతికియున్నదానికి తగినంత ధనము, సుఖము ఉండవలె
నని ఆశ అని యున్నను - ఇపుడే కాదు - ఇట్లే, ముందు కాలము లో
నాకే కాదు - తర తరములకు - మా వారికి ఉండవలెనని ఆశ ఇట్లే
ఆశ - సముద్రములో మున్నీరువలె నిండిపోవుచుండును ఇట్టి ఆశా
తోయములో నిండిన దీ సంసార సముద్రము ఇక మనకు భక్తికి అవ
కాశ మెక్కడ? వీనినిగూర్చి తలంచుటకే కాలము చాలదు ఒకవేళ
భగవంతుని స్మరించినను, వానిపై ప్రేమచే కాదు ధనము పైననో,
జీవితము పైననో, భవిష్యత్తు పైననో ప్రేమచే స్మరింతుము వానిపై

భక్తి, విషయములపై ఆశ గల మన కెట్లు కలుగును ? ఆ భగవానుడే యొసంగవలెను.

ఏ ఆశచేత నైనను ఆ స్వామిని తలంచుకొందమనిన, కామ మనెడి పెను గాలిచే కదలిన మోహ మనెడి కెరటముల విసరు తలంచుకొననిచ్చునా ? స్త్రీలపై కలిగెడి కామము, దానిచే కలిగెడి మోహము - మనసు ముంచెత్తుచుండును ఆ కామముచే ఒక స్త్రీని ఒకసారి మనసున నిల్పితిమా ! అమె సుడి వలె లాగి లాగి, బయటకు పోనియక, లోలోన ముంచివేయును

ఎట్లో ఆ సుడిని దాటి బయటపడుదుమా ! పెద్ద మొసళ్ళు పట్టి మ్రింగును కుమారులు, కుమార్తెలు - వారి పోషణ, వివాహ ములు మొదలగువాని ఆరాటములో క్షణము తీరుబడి యుండదు ఇట్లీ సంసారములో అన్నియు ప్రతిబంధములే దీనిని దాటు టెట్లు ? భక్తి యనెడి నావ నెక్కగల్గినయెడల ఆ నీరే మనను బాధించదు ఆశ లుండవచ్చును భగవంతుని మీద ప్రేమ కలవారికి తాము బ్రతికి యుండుట ఆ భగవానుని సేవ కొరకే, తమ ధనము - భార్య - బిడ్డలు అంతయు వానికొరకే యగును అపుడు ఇంత కాలము మనము ముంచు కొని మ్రింగుచున్నవి మనకు బాధాకరములు కాక, భక్తికి దోహద కారులు అగును ఆ భక్తి యనెడి పడవ నెక్కి, ఆ నీటిలోనే హాయిగా కెరటములను చూచుచు, మొసళ్ళను చూచుచు, సుడి గుండములను చూచుచు వినోదముగా విహరింపవచ్చును కావున స్వామీ ! నీవే అట్టి భక్తి నౌకను మా కొసంగుము.

*మాద్రాక్షం క్షీణ పుణ్యాన్ క్షణ మపి భవతో*
*భక్తి హీనాన్ పదాబ్జే*
*మా శ్రౌషం శ్రావ్యబంధం తవ చరిత మపా*
*స్యాన దాఖ్యానజాతమ్*

మాస్మార్షం మాధవత్వా మపి భువనపతే
చేతసాపహ్నువానాన్
మా భూవం త్వ త్సపర్యా వ్యతికర రహితో
జన్మజన్మాంతరేఽపి ౧౫

భక్తినొసంగు మని ప్రార్థించి, కులశేఖరులు ఆ భక్తి కలుగుటకు ప్రతిబంధకముగా నుండు పాపములను తొలగించుటకై, కర్మేంద్రియ జ్ఞానేంద్రియ మనస్సులచే సాధింపదగు శమ దమాది సంపత్తిని ఇందు వివరించుచున్నారు

హే జగన్నాథ! మాధవ! నీ పాదారవిందములయందు క్షణమైనను భక్తి నిలుపని పుణ్య హీనులను కంటితో చూడను చెవికింపైన బంధము కల దయినను, నీ చరిత్రము దప్ప, వేఱొక కథా సందర్భమును చెవితో వినను (ఈ రెంటిచేత, జ్ఞానేంద్రియ నిగ్రహమును సూచించిరి) మానసికముగ నీ అస్తిత్వము నంగీకరింపనివారలను (అసత్పురుషులను) నేను స్మరింపను (దీనిచే, మనో నిగ్రహము సూచింపబడినది) జన్మ జన్మాంతరములందైనను నీ కైంకర్యము లేని మనుగడను కల్గియుండను (దీనిచే, కర్మేంద్రియ నిగ్రహము సూచింపబడినది)

విశేషార్థము -

మానవ జన్మ సర్వోపకరణములతో సంపూర్ణమై, భగవత్ప్రాప్తికి సుగమ సోపానమై లభించగా, దానిని దుర్వినియోగపరచి చెడిపోవుచున్నాము ప్రళయములో - అచేతనముతో సమానుడుగా పడియున్న జీవునికి చక్కని బుద్ధి, మనస్సు, వాక్కు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములతో కూడిన కరణ కళేబరమును ప్రసాదించి, దానిని వినియోగించు విధానము నెరింగించు శాస్త్రమును అనుగ్రహించెను మానవున కిచ్చిన బుద్ధితో ఆలోచించి, 'తాను తన కొరకు కాదు -

కొల్పును రాజస తామసులతో సంగము మనస్సును కలుష మొనర్చి, పతన మొనర్చును

చెవి కింపయిన సంగీత మున్నంత మాత్రమున, ఆ పాటలు వినదగినవి కావు చక్కని కూర్పు ఉన్నను, సంగీత మున్నను, భగవచ్చరిత్రము లేని గాథలను నేను వినను అన్నిటికంటెను వినుటయే ప్రధానము చెడు కిథలు అనగా - భగవత్కథ లేని గాథలను విని నచో - అది మనస్సును పాడుచేయను

మాధవా! లోకముల నన్నింటిని సృజించి పాలించెడి నిన్ను కూడ 'లే' దని మాపు చేసెడి మనస్థితి కలవారిని మనస్సుతో స్మరించను వారిని స్మరించినను - వారి ఆలోచనలచే మనము భగవంతునికి దూర మగుదుము.

నేను చేసెడి ఏ పని అయినను నీ సేవ కావలెను అంతే కాని అది నా కొరకుకాని, ఇతరులకొరకుకాని చేయునది కారాదు

ఈ విధముగ నే నెన్ని జన్మ లెత్తినను నా యింద్రియములు నీ విముఖులకు విముఖములై, నీకు అభిముఖమై యుండు గాక!

*జిహ్వే! కీర్తయ కేశవం మురరిపుం*
*చేతో! భజ శ్రీధరం*
*పాణిద్వంద్వ! సమర్చ యాచ్యుతకథా*
*శ్రోత్రద్వయ! త్వం శ్రుణు*
*కృష్ణం లోకయ లోచనద్వయ! హరే*
*ర్గచ్ఛాంఘ్రి యుగ్మాలయం*
*జిఘ్ర ఘ్రాణ! ముకుంద పాదతులసీం*
*మూర్ధ న్నమాధోక్షజమ్ ౨౦

ఇంద్రియ నిగ్రహము ద్వివిధము. చేయకూడని వానినుండి మరలించుట, చేయవలసిన వానిని చేయుట. వెనుకటి శ్లోకమున జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనస్సులచే విడువదగిన వానిని చెప్పి, ఇందు చేయదగిన వానిని చెప్పుచున్నారు.

ఓ పాద ద్వంద్వమా! నీవు భగవదాలయమునకు నడచుచుండుము. ఓ హస్త ద్వంద్వమా! నీవు భగవదర్చన చేయుచుండుము. ఓ వాగింద్రియమా! నీవు కేశవుని కీర్తింపుచుండుము. ఓ శిరమా! నీవు భగవంతుని నమస్కరించుచుండుము. ఓ శ్రోత్ర ద్వంద్వమా! ఆ శ్రీకృష్ణుని లీలలనే ఆకర్ణింపుము. (ఇట్లు జ్ఞానేంద్రియములను నిగ్రహింపవలెను.)

విశేషార్థము :-

ఇంద్రియముల నెట్లు వినియోగించవలెనో ఈ శ్లోకములో చెప్పుచున్నారు. 'విచిత్రా దేహ సంపత్తిః ఈశ్వరాయ నివేదితుమ్' విచిత్రమైన దేహ నిర్మాణము ఈశ్వరునకు వినియోగించుటకే ఒసంగబడినది. దానిని భగవంతుని కాక, ఇతర విధముగా వినియోగించుట కృతఘ్నత. అదియొక ద్రోహము. అట్టివానిని భగవంతుడు శిక్షించి బంధించును. అందుకై కులశేఖరులు తమ ఇంద్రియములతో ఏమేమి చేయవలెనో చెప్పుచున్నారు.

ఓ నాలుకా! కేశవుని కీర్తింపుము. ఆతడు బ్రహ్మ రుద్రాదులను రక్షించువాడు. ప్రశస్త కేశ సౌందర్యము కలవాడు. కేశి యను రాక్షసుని చంపినవాడు. ఆతనిని కీర్తించుటయే జిహ్వాకు ప్రయోజనము. ఇతర నామముల నుచ్చరించినందువలనను, ఇతర దేవతలను కీర్తించినందువలనను కలిగెడిది దుఃఖము. కేశవ నామము ముక్తిప్రదము. బ్రహ్మ సృష్టికి కారణమైనవాడు కావున, కీర్తింపదగిన

వాడు. 'కారణం తు ధ్యేయః' కారణ తత్త్వమే స్మరింపదగినది. భగవ న్నామమును కీర్తించుటకు వినియోగపడక, కేవలము రుచులను చవి చూచుటకే వినియోగపడు నాలుక గరిటె వంటిది. మొట్ట మొదట నేర్వవలసినది నామ సంకీర్తనము. దీనికే జిహ్వా! వినియోగపడ వలెను.

ఓ మనసా! మురహరుని భజింపుము. 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః' మనస్సే బంధమునకు, మోక్షమునకు కూడ కారణము. విషయములను వదలి, భగవ ద్విషయమును సేవించెడి మనస్సు మోక్షమును కల్గించును. ఇంత కాలము విషయములను సేవించినందువలన కలిగెడి దోషములను మురుని చంపినట్లు పోగొట్టి, మనను తనతో చేర్చుకొనివా డాతడే. మనసులో స్మరించిన చాలును.

ఓ హస్త ద్వంద్వమా! శ్రీధరుని ఆరాధించుము. లోకములో ఇతర వ్యక్తులనుగాని, ఇతర దేవతలనుగాని సేవింపకుము. వారు దురారాధ్యులు. శ్రీని ధరించినవా డగుటచే ఆతడు సులభుడు. మన మొరలను విని, భగవానునికి వినిపించునది 'శ్రీ'. సంతతము భగవంతుని ఆశ్రయించి యుండి, మనలను రక్షించునట్లు చేసి, మనచే ఆశ్రయింప బడునది 'శ్రీ'. అట్టి శ్రీని ధరించిన శ్రీధరుని మనము సేవించుట సుల భము, సుఖదము.

ఓ శ్రోత్ర ద్వంద్వమా! అచ్యుత కథలను వినుము. తన్ను ఒకసారి విన్నవారిని తాను వదలడు. వారు వదలుద మన్నను వదల నీయడు. భగవ త్కథా శ్రవణము ఎన్నో జన్మలనుండి పేరుకొని పోయిన వాసనలను నిండించును. లేదు అనెడి బుద్ధిని తొలగించెడి అన్ని పదార్థములను వదలక, వ్యాపించి యుండెడి భగవ త్తత్త్వ మున్న దను బుద్ధి నిచ్చెడిది శ్రవణమే.

ఓ నేత్ర ద్వంద్వమా ! కృష్ణుని చూడుము. లోకములో అందమైన వస్తువులను చూడవలెనని కోరుదుము. ఆ అందము మనకు ఆనందమును కల్గించును. లోకములో మనము చూచెడి వస్తువు లన్నియు ఆనందము నిచ్చుచున్న ట్లుండు నేకాని, దుఃఖమునే కల్గించును. కాని, కృష్ణ రూపము మధురము. దానిని చూచుటయే నిరవచ్ఛిన్నమైన ఆనందము. కృష్ = ణ = నిరతిశయమగు ఆనందము. దాని నుండి కలిగెడు ఆనందమే శాశ్వతము.

ఓ పాద ద్వంద్వమా ! భగవానుని ఆలయమునకు నడువుము. నీచుల ఇండ్లకు క్షుద్రమైన ప్రయోజనములకై నడువనీయకుము. అఖండ ఫల ప్రదుడు, సర్వ ఫల ప్రదుడు అయిన స్వామి ఆలయమున కేగిన, పొందవలసిన దానిని పొందుదుము.

ఓ నాసికా ! మోక్షప్రదు డగు ముకుందుని పాదములపై ధరించి వదలిన తులసిని వాసన చూడుము.

ఓ శిరసా ! అధోక్షజునికి వంగి నమస్కరింపుము.

ఈ భావములనే పోతన భాగవతమున ఎంతో అందముగా వర్ణించెను.

" కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సుర రక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరి దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి

దేవ దేవుని జింతించు దినము దినము
చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు
కుంభినీధవు జెప్పెడి గురుడు గురుడు
తండ్రి హరి జేరు మనియెడి తండ్రి తండ్రి "

" కంజాక్షునకుగాని కాయంబు కాయమే
పవన కుంభిత చర్మ భస్త్రిగాక
వైకుంఠు బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమ ఢమ ధ్వనితోడి ఢక్కగాక
హరి పూజనములేని హస్తంబు హస్తమే
తరుశాఖ నిర్మిత దర్విగాక
కమలేశు జూడని కన్నులు కన్నులే
తరు కుడ్యజాల రంధ్రములుగాక

చక్రి చింతలేని జన్మంబు జన్మమే
తరళ సలిల బుద్బుదంబుగాక
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుడే
పాద యుగముతోడి పశువుగాక "

*హే లోకాః ! శృణుత ప్రసూతి మరణ*
*వ్యాధే శ్చికిత్సా మిమాం*
*యోగజ్ఞా స్సముదాహరంతి మునయో*
*యాం యాజ్ఞవల్క్యాదయః*
*అంతర్జ్యోతి రమేయ మేక మమృతం*
*కృష్ణాఖ్య మాపీయతాం*
*తత్పీతం పరమౌషధం వితనుతే నిర్వాణ*
*మాత్యంతికమ్. ౧౭.*

రెండు శ్లోకములలో - మందు తెలియక బాధపడుచున్న సంసారి వ్యాధిగ్రస్తులకు కులశేఖరులు - తా నెఱిగిన చికిత్సను వివరించుచున్నారు.

ఓ లోకులారా! చావు పుట్టుక లను వ్యాధికి యోగ మెఱింగిన యాజ్ఞవల్క్యాదు లగు మునులు కనిపెట్టిన యీ చికిత్సను వినుడు. వారు కనుగొనిన మందు - 'కృష్ణామృతము.' దానిని సేవించినచో ఈ వ్యాధి శాశ్వతముగా తొలగిపోవును. ఆ మందు - ప్రకాశవంతము, అద్వితీయము, ఇట్టి దని చెప్పవలవికానిదియై వెలయుచుండును.

విశేషార్థము :-

కులశేఖరులు రా జగుటచే ప్రజలను శ్రేయో మార్గమున నడిపించుట తన బాధ్యత యని ప్రజల నుద్దేశించి చెప్పుచున్నారు పరిపాలకులు ప్రజలకు వైద్యశాలల నేర్పరచి, రోగములను నివారించుచుందురు. కాని, ఈ శరీరమునకు వచ్చెడి రోగములను పోగొట్టుట కేర్పాటు చేయుటయే కాదు - ప్రభువు చేయవలసిన పని. ఈ యాత్మలకు ఏనాటినుండియో సంక్రమించిన జన్మ మరణ వ్యాధి మందును ఇప్పించవలెనని తలంచి, లోకుల కిట్లు చెప్పుచున్నారు.

మందులు త్రాగిన, కొలది రోజులు రోగము తగ్గి, శరీరము సుఖముగా నుండును. ఆత్మ వ్యాధికి 'కృష్ణ' యనెడి పరమౌషధమును త్రాగినచో - మరల ఎన్నడును జన్మ మరణ వ్యాధి సోకదు శాశ్వతమైన ఆనందము కల్గును. ప్రసూతి మరణ వ్యాధికి ఔషధము 'కృష్ణ' యనెడి నామమే. దానిని ఉచ్చరించుటయే త్రాగుట మందులు చేదుగాను, వగరుగాను ఉండును. కాని, ఈ 'కృష్ణనామ'ము అమృతమంత మధురము. లోకములో మందు వేసిన - రోగము త

వచ్చును. కాని, మానవుడు మరణింపవచ్చును. మరణింపకుండ మందు లేదు. 'కృష్ణ' ఔషధమును సేవించినచో - జన్మ మరణ వ్యాధి పోవుట మాత్రమే కాదు, అమృతత్వము సిద్ధించును. అనగా - పరమాత్మకు శరీరమైన ఈ ఆత్మ - పరమాత్మ కెన్నడును మరి దూరము కాదు. సంసార రోగము సమసి పోవును. పరమాత్మను వీడుట యనెడి మరణము రాదు. శరీర రోగమునకు ఒక్క మందు చాలదు. ఒక్క మారు పుచ్చుకొనిన చాలదు. కాని, ఈ 'కృష్ణ' అను మది ఒక్కటియే చాలును. మరి యొక నాము మక్కరలేదు. రోగము నివారణ మగుటకు ఒక్కసారి మాత్రము చాలును. తరువాత తియ్యగా నుండుటచే, హాని చేయదు. బలమును కల్గించునని దాని కల వాటుపడి, మరల మరల 'కృష్ణ' అనుటకాని, ఒక్క మారు అనుటయే మన రోగమును పోగొట్టును. ఇంత చిన్న మాత్ర (మాట) అంత రోగ మును పోగొట్టునా? యను కొనవలదు. 'కృష్ణ' అను నామము చిన్న మాత్ర వలె కనపట్టునుకాని, దాని శక్తి అమేయము. ఇంత యని చెప్పుటకు వీలు కాదు. ఎంత పెద్ద దూది రాశినైనను - చిన్న అగ్ని కణము కాల్చుట లేదా? హోమియో మందులలో సామాన్య రోగములకు చిన్న మాత్రలో అధిక శక్తి నిక్షేపింపబడుటలేదా? అట్లే, సర్వ శక్తిమంతుడైన స్వామి నామము నందలి రెం డక్షరముల మహిమ ఎవరి కెరుంగ వీ లగును? శారీరక వ్యాధుల కిచ్చు మందులు అచేతనములు. అవి ఒకరిచేత ప్రకాశింపచేయదగినవి. వాని కేమి చేయవలెనో తెలియదు. కాని, 'కృష్ణ' అను నామము 'స్వప్రకాశము' - 'జ్ఞానానందస్వరూపము' అగు భగవానుడు కలది. భగవానుడి ఆ నామము ఉచ్చరించునంతలో - దానిలో నున్న ఆ పరమాత్మయే మనలో ప్రకాశించును. దీని నెవరు చెప్పిరి? యోగజ్ఞు లగు యాజ్ఞవల్క్యుడు మొదలగు మునులు ఈ 'కృష్ణ' దివ్యౌషధ మును కనిపెట్టి, లోకమున కందించిరి. లోకమున మందులలో - కొన్ని

పదార్థముల కలయిక యుండును. దానిని - 'యోగము' అందురు, దానిని తెలిసి, ఆ పదార్థములను కూర్చి, మందుగా నూరి, వండి తయారుచేయుదురు.

యాజ్ఞవల్క్యగు మొదలగు ఋషులు ఆత్మను పరమాత్మతో చేర్చెడి యోగమును తెలిసికొని, దానినే సతతము మననము చేసి. ధ్యానము చేసి (నూరి), దానిని లోకమునకు అందించిరి. అందుచే, ఓ లోకులారా! ప్రసూతి మరణ వ్యాధికి చికిత్సను చెప్పుచున్నాము - వినుడు. ఆ మందు పేరు - 'కృష్ణ'. ఒక్క మోతాదు సేవింపుడు. రోగమును బాపికొని, శాశ్వతానందము పొందుడు.

*హే మర్త్యాః పరమం హితం శ్రుణుత వో*
*వక్ష్యామి సంక్షేపతః*
*సంసారార్ణవ మాప మూర్మి బహుళం*
*సమ్యక్ ప్రవిశ్య స్థితాః*
*నానాజ్ఞాన మపాస్య చేతసి నమో*
*నారాయణాయే త్యముం*
*మంత్రం సప్రణవం ప్రణామ సహితం*
*ప్రావర్తయధ్వం ముహుః. ౨౦.*

మర్త్యులు అమృతత్త్వము నొందుటకు ఉపాయమిం దుపదేశించుచున్నారు. ఉపాయములు - కర్మ జ్ఞాన భక్తియోగములుగ పేర్కొనబడిన వెన్నియో యున్నవి. కాని, అవి ప్రయాస సాధ్యము లని సంక్షేపముగ నొక ఉపాయమును ఉపదేశించుచున్నారు.

ఆపద లనెడి కెరటములతో నిండిన సంసార మనెడి సముద్రములో చొచ్చి యున్న ఓ మర్త్యులారా! వినుడు. మీకు సంగ్రహముగా ఒక ఉపాయమును చెప్పెదను. అనన్య మగు భక్తితో తదితర

చింతనములు విడిచి, మనసున 'నారాయణాయ' అను నీ మంత్రమును ఓంకార పురస్సరముగా జపింపుడు.

విశేషార్థము :-

శ్రీ కులశేఖరులు ప్రజాహితమును కాంక్షించు మహారాజు అగుటచే, ప్రజలకు హితమును చెప్పుచున్నారు. మరణశీలుడై జన్మించు మానవుడు - 'తన స్వరూప మేమి? తాను మరల జన్మించుటను వారించుకొనుట కుపాయమేమి? తాను దేనిని పొందవలెను?' అను మూడు విషయముల నెరుగవలెను. వీనిని - 'స్వరూపము, ఉపాయము, పురుషార్థము' అని యందురు. చెప్పదగిన విషయము - ప్రియము, హితము అని రెండువిధములుగా నుండును. తాత్కాలికముగ మనసుకు నచ్చునదికాని, స్థిరముగ మేలు కలిగింపనిది ప్రియము. స్థిరముగ మేలును గల్గించునది హితము. భౌతికముగ కాక, మన ఆత్మకు హిత మేదియో తెలిసికొనవలెను. అనగా - భగవత్ప్రాప్తికై మానవ శరీరములో ప్రవేశించిన ఈ ఆత్మ ఆ ఫలమును పొందుటకు ఉపాయ మేదియో తెలిసికొనవలెను తన స్వరూప మేమియో తెలిసికొనవలెను. దీనిని శ్రీ కులశేఖరు లీ శ్లోకమున ఉపదేశించుచున్నారు. 'ఓ మరణ శీలులారా!' అని సంబోధించి చెప్పుచున్నారు. 'మరణించుటకే జన్మించువారము కా మని గుర్తింపుడు. మీకు పరమ హితమును చెప్పెదను వినుడు' అని చెప్పుచున్నారు. 'అయ్యో! ఎక్కువ సేపు వినుటకు అవకాశము లే దని తొందర పడకుడు. సంక్షేపముగ జెప్పు చున్నాను. ఆపద లనెడి కెరటములతో నిండిన సంసార మనెడి సముద్రమున జొచ్చి యున్నాము. దీనిని తలంచుట కుపాయమును చెప్పెదను వినుడు. ఏది మాకు ఉపాయ మని దిగులు వదలి, 'కర్మ ఉపాయమా? జ్ఞాన ముపాయమా? భక్తి ఉపాయమా?' అను ఆలోచనను మాని, నేను చెప్పిన మంత్రమును మరువక స్మరింపుడు.

మంత్రాంతర - దేవతాంతర - సాధనాంతరములను ఆదరింపకుడు. విశ్వములోని సర్వ పదార్థములు బ్రహ్మాత్మకములే. ఆ బ్రహ్మమే అన్నింటికిని ఆత్మ. చేతనాచేతనము లన్నియు ఆ పరమాత్మకు శరీరము. అట్టి బ్రహ్మానందమునకు 'నారాయణ' అని పేరు. నారము లనగా - నిత్య పదార్థములు. ఆ పదార్థము లన్నిటికీ ఆధారమైనవాడు కావున, పరబ్రహ్మము - నారాయణుడు దీనిని తెలిసికొన్నచో - దానికంటె భిన్న మగు పదార్థము లే దని తెలియును. దీని నెరింగినవాడు, ఈ జీవాత్మ - పరమాత్మకు శరీరము వలె ఇష్టము వచ్చినట్లు వినియో గించుకొనదగిన దనియు, ఇతరులకు వినియోగపడదగినది కా దనియు తెలియును. ఇదియే 'ఓమ్' అను ప్రణవము యొక్క అర్థము. దానిని మననము చేసికొనుచు, నారాయణునకే చెందినవాడను, ఇతరులకు చెందినవాడను కాను, ఇతరులు నాకు రక్షకులు గారు ; ఇతరులు నాచే అనుభవింపదగినవారు కారు అని భావించుచు నారాయణునకే నేను సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందు సర్వ వ్యాపారములను చేయు వాడను కావలెను. అను అర్థము నిచ్చెడి 'ఓమ్ నమో నారాయ ణాయ' అను మంత్రమును మనసులో అర్థమును భావించుచు, శరీర ముతో నమస్కరించుచు, మరల మరల ఉచ్చరించుడు. ఇదియే మీాకు పరమహితము.'

*పృథ్వీ రేణు రణుః పయాంసి కణికాః ఫల్గు స్ఫులింగో ఽనలః*
*తేజో నిశ్శ్వసనం మరుత్తనుతరం రంధ్రం సుసూక్ష్మం నభః*
*క్షుద్రా రుద్ర పితామహ ప్రభృతయః కీటా స్సమస్తా స్సురాః*
*దృష్టే యత్ర స తావకో విజయతే భూమావభూతావధిః.* ౭౯.

పరబ్రహ్మ స్వరూప మగు నారాయణుని దర్శించినచో - అందు, ఈ పృథివి ఒక సూక్ష్మాతి సూక్ష్మమైన రేణువు. ఈ జగము తుంపర. తేజస్సు సూక్ష్మ మగు అగ్ని కణము. వాయువు నిశ్శ్వ

నము. ఆకాశము సన్నని చిన్న రంధ్రము. రుద్ర పితామహాది దేవతాకోటి సమస్తము క్షుద్ర కీటకములు. ఆ పరబ్రహ్మ మగు నారాయణుని యతిశయము అవధులు మీరి విరాజిల్లుచున్నది.

వెనుక చెప్పిన మంత్రమును జపించినచో - నిరతిశయమగు పరబ్రహ్మమును సాక్షాత్కరింపజేసికొని, మిగిలిన తత్త్వముల పరిమిత తత్త్వమును, ఆతని అతిశయమును అనుభవింపగలడు.

విశేషార్థము :-

ఉపనిషత్తులలో 'భూమ విద్య' యని ఒక ఉపాసన యున్నది. అన్నిటికంటె గొప్పదైన బ్రహ్మను 'భూమ' అని ఉపాసించుట. దానిని ఉపాసించుటచే మరి యొకటి చూడదగినది, వినదగినది ఉండవు. అన్నియు దానిలోనివే. దానికంటె అల్పములే. అట్టి అతిశయమును అనుభవించినవాడు - భగవ దతిశయము ముందు - ఇంతకు మున్ను ఎంతయో గొప్ప వనుకొనుచున్న పంచ మహాభూతములు, బ్రహ్మాది దేవతలు అల్పాల్పములై కన్పట్టును. ఆ వైభవము నిందు కులశేఖరులు వర్ణించుచున్నారు.

హే కృష్ణ! నీ నిరవధికమైన అతిశయమును అనుభవించిన నాడు, ఈ భూమండలము ఒక ధూళి కణము వలె గోచరించును. ఆ భూమికి పది రెట్లుగా ఆవరించియున్న జలము నీటి బిందువు వలె గన్పట్టును. దానికి పది రెట్లుగా ఆవరించియున్న అగ్ని - చాల చిన్న నిప్పు మిణుగురు వలె నుండును. దానికంటె అధికమైన వాయువు చిన్న ఊపిరితో వదలిన గాలి వలె నుండును.

దానికంటె పది రెట్లు అధికమై, అంతట వ్యాపించి, తాను లేనిచోటు లే దన్నట్లు నిండి యున్న ఆకాశము చిన్న సన్నని బెజ్జము

వలె నుండును. సర్వ జగత్తును సృజించుట, సంహరించుట మొదలగు అధికారములు గలవారలై, ఎంతయో పెద్దవారుగా ఆరాధింపబడు చున్న బ్రహ్మరుద్రాది దేవతలు శ్రీకృష్ణ పరమాత్మ వద్ద చిన్న పురుగుల వలె నుందురు. శ్రీకృష్ణ మహిమ నెరుంగలేక, బ్రహ్మరుద్రాదులు తబ్బిబ్బగుట - వత్సాపహార, గోవర్ధనోద్ధరణాదుల వలన తెలియుచునే యున్నది. సర్వ భూతములు స్వామి నోటిలో ఆరగించిన మట్టి పెల్లవలె యశోదాదేవిచే దర్శింపబడినదికదా! ఆ స్వామి వైభవమును దర్శించునంతవేఫు - నూతిలో కప్పకు చెరువే సముద్రము అనినట్లు, 'ఈ భూతములే గొప్పవి, బ్రహ్మాది దేవతలే నిరతిశయ మహత్వము గలవారు' అనిపించును. కాని, ఏనాడు స్వామి మహత్వమును దర్శించునో, ఆనాడు వీని అల్పాల్పత్వము గోచరమగును.

*బద్ధేనాంజలినా నతేన శిరసా గాత్రై స్సరోమోద్గమైః*
*కంఠేన స్వర గద్గదేన నయనే నోద్గీర్ణ బాష్పాంబునా*
*నిత్యం త్వచ్చరణారవిందయుగళ ధ్యానామృతాస్వాదినాం*
*అస్మాకం సరసీరుహాక్ష! సతతం సంపద్యతాం జీవితమ్.౨౦*

ఓ పుండరీకాక్షా! నీకై మొగిడ్చిన దోసిలి, వంగిన శిరస్సు, గగుర్పొడిచిన అవయవములు, గద్గద స్వరము గల కంఠము, కన్నీటితో నిండు కన్నులు కలిగి, ఎల్లప్పుడు నీ పాదారవింద ధ్యానామృతమును ఆశ్రయించుచునే మా జీవిత మంతయు సాగునట్లు అనుగ్రహింపుము.

విశేషార్థము :-

హే పుండరీకాక్ష! శ్రీకృష్ణా! ఎల్లప్పుడు మా జీవితము నీ చరణారవింద ద్వంద్వమును ధ్యానము చేయుచు, ఆ ఆనందమునే అనుభవించుచు గడచునట్లు అనుగ్రహింపుము. భగవద్విషయమునే తలంచక జీవించెడివారి జన్మ నిరర్థకము. భగవత్పాదారవింద ధ్యానా

మృతాస్వాదము చేయగల జీవితము కల్గియు - దానిని పొందకుండ జీవించువారు జీవచ్ఛవములు. కొందరు అనుభవింతురు కాని, ఆ భగవంతునిపై ప్రేమచే కాక, ద్వేషము చేతనో, అసూయ చేతనో ధ్యానింతురు. వారి కా ధ్యానము అమృతము వలె రుచింపదు. వేప కషాయము వలె చివరకు మంచినే చేసినను, త్రాగునపుడు చేదుగా నుండును. మానవ జన్మ నెత్తి, పొందవలసిన ఆనందము నందలేని పరాధములు వీరు. మరికొందరు భగవత్పాదారవిందములను ధ్యానింతురు. ఆనందము ననుభవింతురు. కాని, బయటి కేవిధమైన వికారమును పొందక, పాషాణము వలె నుండి, లోలోన అనుభవింతురు. వీరికి అనుభవము పరిపక్వము కాకపోవుటచే, లోపలి రసాస్వాదము బయటికి ప్రసరించుట లేదు. వారు మధ్యములు.

అట్లుకాక, మనస్సు భగవత్పాదారవింద ధ్యానమున నిమగ్నమైనంతనే, అవశ్యముగ బయట ఇంద్రియము లన్నియు తదనుగుణముగ ప్రవర్తించి, హర్ష పారవశ్యము నందిన వారి జీవితము ఉత్తమ జీవితము. ఇంటిలో - పిల్లలతో, మనుమలతో, భార్యతో, బంధువులతో, మిత్రులతో, ఆశ్రితులతో కలిసి మధుర పదార్థమును భుజించిననాడు యజమాని ఎంతటి ఆనందము ననుభవించునో, బయట ఇంద్రియములతో మనస్సు భగవత్పాదారవింద ధ్యానామృతము నాస్వాదించిన నాడు అంతటి ఆనందము భక్తు డనుభవించును అపుడే యింద్రియము లెట్లుండవలెనో చెప్పుచున్నారు. రెండు చేతులు దోసిలి బట్టి నమస్కరించుచుండవలెను. ఒడలంతయు గగుర్పాటు కలుగవలెను. కంఠము డగ్గుత్తికతో మాటరాకుండ, తొట్రుపాటు పడుచుండవలెను. కన్నుల నుండి నీరు నిండి, పొర్లవలెను. ఇట్టి స్థితిలో - నీ ధ్యానామృతాస్వాదము ననుభవించు జీవితమును ప్రసాదింపుము.

గర్వితు లగు రాజుల యెదుట దురాశచేతనో, భయము చేతనో చేతులు జోడింతుము. అట్లు కాక, భక్తితో స్వామిని

ధ్యానించి, ఆ మూర్తిని ఎదుట దర్శించి, ప్రేమాతిశయముచే స్వామి చేసిన ఉపకారమునకు ప్రత్యుపకారము చేయుట కేమియు లేని వాడను స్వామీ ! నీ వాడను, నిన్ను తప్ప - వేరొకరిని చేరువాడను కాను అని చేతులు జోడించి నిలువవలెను. దీనిచే స్వామి తప్ప వేరొక శరణము లేనవాడను. నేను నీకే తప్ప, ఇతరులకు చెందినవాడను కాను. నీచేత, నీకొరకు వినియోగించుకొనదగినవాడను అని నివేదించిన ట్లగును.

అహంకారము భగవత్ప్రాప్తికి ప్రతిబంధకము. అది తొలగిన కాని శిరసు వంగదు. అహంకార రహిత స్థితి నందుటకు సూచకము తలవంచుట.

లోపల కలిగిన యానందము ఆగక, గగుర్పాటు బయటికి కన్పట్టును. హృదయములో కల్గిన ఆర్ద్రత కన్నీరుగా స్రవించును. ఆనందము గొంతుకను బిగపట్టి, మాట రాకుండ చేయును. ఇట్టి దశలన్నియు అనుభవించవలెనని శ్రీ కులశేఖరులు కోరుచున్నారు.

*హే గోపాలక ! హే కృపాజలనిధే ! హే సింధుకన్యాపతే !*
*హే కంసాంతక ! హే గజేంద్రకరుణాపారీణ ! హే మాధవ !*
*హే రామానుజ ! హే జగత్త్రయగురో ! హే పుండరీకాక్ష ! మాం*
*హే గోపీజననాథ ! పాలయ పరం జానామి న త్వాం వినా. ౨౨*

ఓ గోపాల ! కరుణా సముద్ర ! లక్ష్మీ పతీ ! కంసారి ! గజేంద్ర రక్షక ! రామానుజ ! జగన్నాథ ! పుండరీకాక్షా ! గోపీజనవల్లభ ! రక్షించుము. నీవే తప్ప, ఇతఃపరంబు నే నెఱుగను.

విశేషార్థము :-

ఈ శ్లోకమున కులశేఖరులు శరణాగతి చేయుచున్నారు. ఇతరోపాయములను వదలి, నీవే ఉపాయ మని భగవంతుని వరించుటయే

శరణాగతి - లేక, ప్రపత్తి. వాస్తవముగ కర్మ జ్ఞాన భక్తులు ఉపాయములు కావు. స్వస్వరూప మెరుంగనివారు, తానే తనను రక్షించుకొనగల ననెడి భావము గలవాడు వానిని ఉపాయముగ భావించును. భగవానుడే భగవత్ప్రాప్తికి ఉపాయము. నిన్ను తప్ప, వే రొకనిని ఎరుగను కాపాడు మని చెప్పుచున్నారు. దానికి ముందు - కృష్ణ భగవానుని సంబోధించుచున్నారు. హే గోపాలక! గోవులు నిన్ను పాలించు మని కోరలేదు. నీవే కోరి ఈ వంశమున జన్మించి, వానిని కాపాడుచున్నావు. అట్లే, ఏది ఉపాయమో ఎరిగి ప్రార్థించుట తెలియని నన్ను కూడ కాపాడుము. హే కృపాజలనిధే! అట్లు నీ యంతట నీవు వచ్చి, వాని ప్రార్థన లేకుండ గోవులను కాపాడుటకు నీ కృపయే కదా కారణము! కృపా సాగరా! నా యందా కృపను ప్రసరింపజేయుము. హే సింధు కన్యాపతే! నీ ప్రక్కనే మా తల్లి క్షీర సముద్రరాజ తనయ లక్ష్మి యుండును కదా! మాకు మాతగా, నీకు పత్నిగా మమ్ము రక్షించుటకు తగినట్లు, నీ లోని కారుణ్యమును వర్ధిల్ల చేయునది గదా! మీ దయ నర్థించుట తెలియక, పరాఙ్ముఖుల మైన మమ్ములను మళ్ళించి, మీ దయకు పాత్రుల మగునట్లు చేసెడి లక్ష్మిదేవిని చూచి, మ మ్మనుగ్రహింపుము.

హే కంసాంతక! నీవు మాతో చేరియుండుట ఓర్వలేక, నిన్ను చంపవలెనని ప్రయత్నించిన కంసుని తలంపు తలక్రిందుగ చేసి, వానినే చంపి, మాకు నీ యెడబాటు లేకుండునట్లు చేసినవాడవుగదా! అట్లే ఆ ప్రకృతిచే కల్గిన కామము, అహంకారము నిన్ను మాకు దూరము చేయకుండ కాపాడి, మాతో చేరియుండుము.

హే గజేంద్ర కరుణా పారీణ! మొసలిచేత పట్టుబడిన గజేంద్రుడు శరణాగతి చేయగా - ఎక్కడో పరమ పదములో నున్నవాడవు పరుగెత్తికొని వచ్చితివి కదా! అట్లే నా మొర నాలించి

వేంచేయుము. దాని శత్రువు వగు మొసలిని చంపినట్లే, నా సంసార బంధమును త్రెంచుము. ఆ గజేంద్రుని తొండములో నున్న తామర పూవును నీ పాదములపై సమర్పింపచేసికొనినట్లు, మాచే కైంకర్యమును చేయించి స్వీకరింపుము. దానికి మోక్షము నిచ్చినట్లే, మాకు కూడ మోక్షము నిమ్ము. హే మాధవ ! రక్షణమున నీవే సమర్థుడవై రక్షించినను, మేము చేయు కైంకర్యములను మా తల్లితో - లక్ష్మితో చేరి స్వీకరింపుము. హే రామానుజ ! బలరాముని తమ్ముడవుకదా ! ఆతడు చెప్పినట్లు వినవలెనుగదా ! ఆత డెల్లప్పుడు నీ సేవయందే మగ్నమైనవా డగుటచే, మాకుకూడ నీ సేవల నాతడు ప్రసాదింపచేయును. ఆతని సాయ మధుర సందేశములే మాకు శాంతి నొసంగునవి. ఆయన మాట ప్రకారము మమ్ముల నేలుము.

హే జగత్త్రియగురో ! త్రిలోకములకు అధిపతివి నీవే కదా ! నీవు రక్షింపకున్న, నీ వారి నింకెవరు రక్షింతురు ? స్వామీ ! రక్షించు భారము నీదే.

హే పుండరీకాక్ష ! నీ నేత్ర సౌందర్యమే మమ్ముల నాకర్షించినది. సర్వ లోకములలో - సర్వ విషయములను ఎరుగజాలిన కన్నులు కలిగిన నీకు మా కోరిక తెలియదా ? నీ నామమే మమ్ములను పవిత్రము చేసినది. మాలో నిన్ను పొందకుండునట్లు చేసెడి పాపములు లేవు కదా ! రమ్ము, రక్షించుము.

హే గోపీజననాథ ! అబలలైన - అజ్ఞలైన గోపికలకు నాథుడవైన నీవు నన్ను వదలుట న్యాయమా ! గోపాలుడవు, గోపీజన నాథుడవు అయిన నీ సౌందర్యమే మాకు శరణ్యము.

"అవతారాః సంత్యన్యే ... ... ... ... ..
కృష్ణా దన్యః కో వా ప్రభవతి గో గోప గోపికా ముక్త్యై"

అని కృష్ణకర్ణామృతమున లీలా శుకులు చెప్పినట్లు, ఎన్నియో అవతారము లుండవచ్చును. స్వామీ శ్రీకృష్ణా! నీవు తప్ప, వే రొక రెవరయ్యా! గో గోప గోపికలను తరింపచేసి ముక్తి నొసంగినవారు? అందుచే, అజ్ఞుడను, నిన్ను తప్ప ఏమియు ఎరుంగనివాడను, నీవే రక్షింపుము.

*భక్తాపాయ భుజంగ గారుడమణిః త్రైలోక్య రక్షామణిః*
*గోపీ లోచన చాతకాంబుద మణిః సౌందర్య ముద్రామణిః*
*యః కాంతామణి రుక్మిణీ ఘన కుచ ద్వంద్వైక భూషామణిః*
*శ్రేయో దేవశిఖామణి ర్దిశతు నో గోపాల చూడామణిః. ౨౨*

సంసార వ్యాధిగ్రస్తులకు - ఆ వ్యాధి నివారణకై మణి మంత్రౌషధములను ఉపదేశించుచున్నారు. దేవతా శిఖామణి - గోపాల చూడామణి మనకు శ్రేయస్సు నొసంగుగాక! దేవతాంతరములకంటెను గోపాలు డగు శ్రీకృష్ణ దేవుడు శ్రేయస్సు నొసగుటలో సులభుడు. అతడు కాంతామణి యగు రుక్మిణీదేవి కుచ ద్వంద్వమునకు అనన్య సాధారణ మగు భూషణ మణి. సాక్షా ల్లక్ష్మియే రుక్మిణి. వారిద్దఱు - మణి, మణి ప్రభల వలె నొకరి నొకరు విడువకుందురు. అందుచే, ఆ రుక్మిణీ మనోవల్లభుడే మనకు శ్రేయఃప్రదుడు. అట్లామె కలంకారముగా నుండుటచే, అతడు సౌందర్య ముద్రామణి. లోకములో నిది అందమయిన వస్తు వని నిరూపించుటకు - కృష్ణ సౌందర్య ముద్ర పడవలెను. ఆ యందమును జూచి, పరవశలై, గోపికలు తమ లోచన చాతకములచే ఆ కృష్ణ మేఘమునే సేవించుచుందురు. ఈ మేఘము కేవలము చాతకములనే కాదు, మూడు లోకములను తన కృపా శక్తిచే రక్షించు మణి. ఈ రక్షామణి - మూడు లోకములను రక్షించు నదియే యైనను, భక్తులపట్ల గారుడ మణియై, వారికి గల్గు అపాయము లనెడి భుజంగములను దరి చేరకుండ తొలగించును.

విశేషార్థము :-

సంసారమే ఒక త్రాచు పాము. అవిద్య యను విష మెక్కి నేను కానిది నేనుగను, నాది కానిది నాదిగను గన్పట్టుచుండును. చూపు మారిపోవును. సర్వేశ్వరునకే చెందిన సర్వ వస్తువులను నావి యనుట, దేహమే ఆత్మ యనుకొనుట ఈ రెండును ఆ విష మెక్కినందువలన కలిగెడు దోషములు. ఈ విషయమునకు మణిని ఉపయోగించిన, విష మును లాగివేయును; లేక, మంత్రము వేసిన, విషము దిగును, లేక - ఓషధిని మింగించిన, విషము విరుగును. ఆ మణి - గోపాల చూడా మణి, ఆ మంత్రము - శ్రీకృష్ణ మంత్రము, ఆ ఔషధము - శ్రీకృష్ణ దివ్యౌషధము. ఆ మణి మంత్రౌషధములను లోకమునకు చాటవలె నని కులశేఖరులు వాని గొప్పతనమును వివరించి చెప్పుచున్నారు. ఈ శ్లోకములో - మణియొక్క వైభవమును ప్రకటించుచున్నారు.

సాధారణముగా పాము తలపై నుండు మణియే పాము విష మును హరించును. మన మణి, గోపాల చూడామణి - దేవ శిఖా మణి. దేవతల తల మానికము గోపాలుర చూడామణి యైనది. జ్ఞాన ములో అధికులు దేవతలు, అధములు గోపాలురు. స్వామి కృష్ణ పర మాత్మ దేవతలకు తానే శిఖామణియై యుండి, గోపాలురకు తానే చూడామణి యైనాడు. ఎంతటి పరత్వమో - అంతటి సౌలభ్య . సర్వజ్ఞులలో సర్వజ్ఞుడు. అజ్ఞులలో అజ్ఞుడు. తన్ను తానే తగ్గించుకొని గోపాలుడైనాడు. కేవలము పరాత్పరుడైనచో - నిర్లక్ష్యము చేతుము. అందుకై, పరుడు సులభుడైనాడు. ఇదియే శ్రీకృష్ణావ తారములోని విశేషము.

ఈ మణి - భక్తాపాయ భుజంగ గారుడమణి. భక్తులకు గలిగెడి అపాయము లనెడి పాములకు గరుడుడే యన దగిన మణి. గరుడుడు పాములను శిక్షించినట్లు గోపాల చూడామణి - భక్తుల అపాయము

లను నశింపజేయును. పరమాత్మపై భక్తి నిలువకుండుటకు అపాయ
ములు ఆరు. (1) దేహాత్మాభిమానము (2) స్వాతంత్ర్యము (3) భగ
వంతుని కంటె ఇతరులకు చెంది, వారికే వినియోగపడదగినవార మను
కొనుట (అన్య శేషత్వము) (4) స్వ రక్షణమున స్వ ప్రయత్నము
(5) ఆభాస బంధువులపై లోలత (6) విషయ చాపల్యము. ఈ ఆరు
అపాయములు భగవంతుని దూరము చేయును. అట్టి అపాయములను
తొలగించువాడు మనకు కృష్ణ భగవానుడే.

అతడే త్రైలోక్య రక్షామణి. మూడు లోకములు భూర్భువ
స్వర్లోకములు. అధో, మధ్య, ఊర్ధ్వ లోకములు. కృతక, కృతకా
కృతక, అకృత లోకములు. బద్ధ ముక్త నిత్యులు. వీరందరికి అనిష్ట
మును తొలగించి, ఇష్టమును సంపాదించువాడు శ్రీకృష్ణుడే. రక్షణము =
అనిష్ట నివృత్తి, ఇష్ట ప్రాప్తి. బద్ధులైన సంసారులకు కావ సిన
రోగాది నివృత్తిని, ఐశ్వర్య ప్రాప్తిని కల్గించువాడు శ్రీకృష్ణుడే. ఆత్మ
జ్ఞానము నర్థించువారికి భగవ త్ప్రాప్తిని, భగవ త్కైంకర్యమును
కోరెడివారికి స్వస్వాతంత్ర్య స్వప్రయోజన బుద్ధులను నశింపజేసి,
భగవానుడే భగవ త్ప్రీతికొరకే తనచే కైంకర్యములను స్వీకరించు
చున్నా డనెడి బుద్ధిని ప్రసాదించును. 'ఓమ్' అను ప్రణవములోని
అకారమునకు అర్థమైనవాడు. అకారము రక్షించువానిని తెలియ
జేయును 'అవ - రక్షణే' అను ధాతువునుండి అకారము వచ్చినది.
అందుచే, శ్రీకృష్ణుడు త్రైలోక్య రక్షామణి.

ఈతడు గోపీలోచన చాతకాంబుదమణి. గోపికల నేత్రములే
చాతక పక్షులు. చాతకములు మేఘములనుండి పడుచున్న నీటిని
తప్ప, త్రాగవు. వానికొరకే ఎదురు చూచుచుండును. కాని, ఇతర

[illegible] చేసెను. అట్లే, గోపికల నేత్రములుకూడ కృష్ణ దర్శన
[illegible] కృష్ణ సమాగము రసాస్వాదనమును తప్ప, వే రొకదానిని
[illegible] పులు శ్రుతులు. వాని యర్థము నెరింగి యాచరించెడి
[illegible]కే పరతంత్రల మని భావించెడి జీవులు గోపికలు. వారి
[illegible]చనములే వారి జ్ఞానము. ఇతరమైన దేదియు ఉపాయము కాదు.
[illegible] ఉపాయము - భగవానుడే ఉపేయము అని ఉండుటయే
[illegible]కై చాతకము వలె నుండుట.

శ్రీకృష్ణ భగవానుడు సౌందర్య ముద్రామణి. సౌందర్య
[illegible] భగవానుడు. శ్రీకృష్ణుడే ఆనంద స్వరూపుడు ఆ ఆనంద
[illegible] పొందినవారు అందమైనవారు. భగవానునిచే వరింపబడినవారే
[illegible]మైనవారు. ఎవరు భగవానుని యందు నిరతిశయ ప్రీతి కలవారో -
[illegible] స్వామి ప్రేమించి, వారికి స్వస్వరూపము నావిష్కరించును
[illegible] తత్స్వరూపమును పొందినవారే సుందరులు. స్వామిచే పరి
గ్రహింపబడినవారు సుందరులు. కావున, స్వామి - సౌందర్య
ముద్రామణి.

కాంతామణియైన రుక్మిణీదేవి వక్షోజాలంకారమణి శ్రీకృష్ణ
భగవానుడు. లక్ష్మీదేవియే - నారాయణుడు ఏ యే అవతారము
దాల్చినపుడు, తానుకూడ అవతరించుచుండును. శ్రీకృష్ణావతారములో
రుక్మిణి - శ్రీమహాలక్ష్మియే. భగవానునికి అత్యంత ప్రియ యగుటచే,
ఆమె కాంతామణి. ఆమె వక్షఃస్థలమును స్వామి ఆభరణమువలె
అలంకరించి యుండును. ఆమె హృదయ మండలి జ్ఞాన భక్తులు ఘన
కుచములు. ఆ జ్ఞాన భక్తుల కలంకారము శ్రీకృష్ణ భగవానుడు.

పరత్వము, సౌలభ్యము రెండును కలిగి, దేవతాశ్రేష్ఠుడై,
[illegible] శ్రేష్ఠుడై యున్న ఆ శ్రీకృష్ణ భగవానుడు మనకు శ్రేయము

నొసంగుగాక! లౌకికము లగు అభ్యుదయములనుగాక, పరము పురుషార్థ మగు మోక్ష రూపమును, శ్రేయమును గోపాల చూడామణి ప్రసాదించి, అజ్ఞాన మనెడి విష సర్పపు కాటునుండి కాపాడుగాక!

*శత్రు చ్ఛేదైక మంత్రం సకల ముపనిష*
*ద్వాక్య సంపూజ్య మంత్రం*
*సంసారోచ్ఛేద మంత్రం సముపచిత తమ*
*స్సంఘ నిర్యాణ మంత్రమ్*
*సర్వైశ్వర్యైక మంత్రం వ్యసన భుజగ సందష్ట*
*సంత్రాణ మంత్రం*
*జిహ్వే! శ్రీకృష్ణ మంత్రం జప జప సతతం*
*జన్మసాఫల్య మంత్రమ్.* ౨౩

ఓ జిహ్వా! శ్రీకృష్ణ మంత్రమును సర్వదా జపింపుము, జపింపుము. అదియే జన్మకు సాఫల్యము నొసంగునది. కామాది శత్రువులను ఛేదించుటలో ప్రధాన సాధన మీ మంత్రము. సర్వోపనిష ద్వాక్యములు ఆ మంత్రమునే పూజించినవి. జనన మరణము లనెడి సంసారమునుండి తరింపజేయగల మంత్ర మది. రాశీభూత మయిన అవిద్యాంధకారమును నశింపజేయు మంత్రము. ఆ మంత్రమే సర్వైశ్వర్యముల నొసంగ జాలును. వ్యసనము లనెడి సర్పములు కాటు వేసినపుడు కాపాడగల మంత్రము కావున శ్రీకృష్ణ మంత్రమును జపింపుము, జపింపుము.

విశేషార్థము :-

అవిద్యా విషగ్రస్తులగు వారు అనుభవించవలసిన మంత్రమును చెప్పుచున్నారు. మానవ జన్మము బహు దుర్లభము. భగవత్ప్రాప్తికి చేరువయిన జన్మ మంది, ఫల మందక, విషయగ్రస్తులై చెడిపోవుచాని

జన్మమును సుశుభముగ సఫలము చేయు మంత్రము 'శ్రీకృష్ణ మంత్రము.'

మానవునకు విషయములే ప్రధాన శత్రువులు. అవి విషము కంటె క్రూరములు. విషము - త్రాగినవానినే చంపును. విషయములు - తలంచినంతనే చంపును. విషయములను తలంచుచుండిన, వానియందు తగులు (సంగము) కల్గును. తనకు లభించవలెనని కోరిక కల్గును. ఆ కామమునకేదయిన ప్రతిబంధక మేర్పడినచో - క్రోధము కల్గును. ఆ క్రోధముచే, ఏది చేయదగినది - ఏది చేయరానిది అను వివేకము నశించి, మోహము కల్గును. ఆ మోహము వలన భగవద్విషయకమగు స్మృతి నశించును. ఆ స్మృతి నశించుటచే, బుద్ధి చెడును. అట్లు బుద్ధి చెడుటచే, ఆత్మయే నశించును. అట్లు ఆత్మ వినాశమునకు హేతువైన విషయ సంగ మనెడి శత్రువును ఛేదించుటకు ముఖ్యమైన మంత్రము శ్రీకృష్ణ మంత్రము. ఓ నాలుకా! నీవు మంత్రమును సంతతము జపించుము.

శ్రీకృష్ణ మంత్రము సర్వోపనిష ద్వాక్యములచే పూజనీయమగు మంత్రము. 'కృష్' అనగా - 'సత్తు'. ఎల్లపుడు ఉండునది - లేక, నిరవధిక మని యర్థము. 'ణ' అనగా - ఆనందమని యర్థము. ఉపనిషత్తులు బ్రహ్మమును - సత్యము, ఆనందము, అపరిచ్ఛిన్నానందము అని చెప్పుచున్నవి. 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ' 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్' 'ఆనందం బ్రహ్మణో విద్వాన్' 'రసో వై సః' మొదలగు ఉపనిష ద్వాక్యములు - 'కృష్ణ' నామమునే ప్రతిపాదించుచున్నవి.

ఇదియే సంసారోత్తార మంత్రము. సంసారమునుండి తరింప చేయు మంత్ర మిదియే. ఆనంద స్వరూపుడుగ నుండు శ్రీకృష్ణుడే

గదా 'మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే' 'మృత్యు సంసార సాగరాత్ ఉద్ధరామి' అని చెప్పినాడు.

సముపచిత తమ స్కంధ నిర్యాణ మంత్రము శ్రీకృష్ణ మంత్రము. పేరుకొనిన చీకటిని తొలగించు సూర్య రశ్మివలె, ఏనాటి నుండియో మనలో గూడు కట్టుకొనియున్న పాపరాశిని మనలోని తమస్సును శ్రీకృష్ణ భానుడు దేవకీ పూర్వ సంధ్యయందు అర్ధరాత్రమున నావిర్భవించి (లోన అలముకొనిన తమస్సును) మటుమాయము చేసెను.

ఇక సర్వైశ్వర్యములను ప్రసాదించు ప్రధాన మంత్రము - శ్రీకృష్ణ మంత్రము. లోకములో అన్నిటిని నియమించువాడు ఈశ్వరుడు. ఆ ఈశ్వరుని నియమించువా డెవరును లేడు. కాని, శ్రీకృష్ణ పరమాత్మ సర్వభూతేశ్వరు డయ్యు, నియామ్యు డయ్యెను. అందరిని నియమించువాడు - తాను గోపికలచేత, గోపబాలకులచేత నియమింపదగినవా డాయెను - అంతే కాదు, కట్టబడి, కొట్టబడినాడు. ఎంతటి ఆశ్రిత వ్యామోహమో! తన్నాశ్రయించినవారికి తనను నియమింప శక్తి నిచ్చు మంత్రము శ్రీకృష్ణ మంత్రము.

ఆపద లనెడి భుజంగములు కాటు వేయగా, వారిని రక్షించునది మంత్రమే. వ్యసనములు భగవంతునినుండి మనలను దూరముగా చిమ్మును. 'తనను తాను రక్షించుకొనగలను, తాను స్వతంత్రుడు, తాను భగవానుని కంటె ఇతరులకు చెందినవాడు, తాను చేయు పనులు తన ప్రీతి కొరకు' అనెడి భావములే వ్యసనములు. అవి పాముల వలె కాటు వేసి, విషయ రసాస్వాద మత్తులను చేయక కాపాడునది ఈ కృష్ణ మంత్రమే. దీనిని సంతతము జపించుటయే శ్రేయ మని శ్రీ కులశేఖరులు ప్రశంసించిరి.

*వ్యామోహ ప్రశమౌషధం ముని మనోవృత్తి ప్రవృత్త్యౌషధం*
*దైత్యేంద్రార్తి కరౌషధం త్రిభువనీ సంజీవనైకౌషధమ్*
*భక్తాత్యంత హితౌషధం భవ భయ ప్రధ్వంసనైకౌషధం*
*శ్రేయః ప్రాప్తికరౌషధం పిబ మన శ్రీకృష్ణ దివ్యౌషధమ్.* ౨౪.

ఓ మనసా! శ్రేయస్సును కలిగించు శ్రీకృష్ణ దివ్యౌషధమును సేవింపుము. ఆ ఔషధము మోహమును శమింపజేయును. మునుల మనోవృత్తులను ప్రవర్తింపజేయును. రాక్షసేంద్రులకు బాధలను కలిగించును. మూడు లోకములను మరణమునుండి కాపాడును. భక్తులకు హితము చేకూర్చును. సంసార భయమును బాపును.

విశేషార్థము :-

జన్మ మృత్యు జరా వ్యాధి గ్రస్తులైనవారికి, అవిద్యా సర్ప దష్టులైన వారికి సేవింపజేయవలసిన మందు - శ్రీకృష్ణ దివ్యౌషధము. ఈ ఔషధమును మనసుతో సేవింపవలెను.

"మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః
బంధాయ విషయాసంగి ముక్త్యై నిర్విషయం మనః"

మనుష్యులకు కల్గు బంధ మోక్షములకు మనస్సే కారణము. విషయ సంగము గల మనస్సు బంధము నిచ్చును. విషయములను వీడి, భగవద్విషయమునే అవలంబించిన మనస్సు ముక్తి నిచ్చును. అందుచే, ఓ మనసా! శ్రీకృష్ణ దివ్యౌషధమును సేవించుమని చెప్పుచున్నారు.

సన్నిపాతాది జ్వరములలో - ఉన్న వస్తువులను గుర్తించలేని స్థితి కలుగును. దానికే వ్యామోహ మని పేరు. చుట్టును బంధువు లెల్లరు నిలిచియుండగా - ఏమేమిదో మాటాడుచు, దేనినో వెదకుచున్నట్లు చేతులతో తడుముచుండును. లేచి, పరుగులెత్తుచుండును.

అజ్ఞే, విషయ వ్యామోహము కలవారు - అంతట, తన లోపల, వెలుపల ఉన్నవాడు - తనకు సహజ బంధువు అయిన శ్రీకృష్ణ పరమాత్మను చూడక, లేనివానికై పలవరించి, చేతులు చాచి పొంద జూచుచుందురు. అదియే వ్యామోహము. ఆ వ్యామోహము తగ్గుటకు - 'శ్రీకృష్ణ' నామమే ఔషధము. 'ఔషధం' - అనియు, 'వైద్యః' అనియు, 'భిషక్' అనియు, 'భేషజం' అనియు విష్ణు సహస్ర నామమున భగవానునకే నామధేయములు కలవు. లోకములో వైద్యుడు వేరు, మందు వేరుగా నుండును. ఇచట కృష్ణుడే వైద్యుడు. కృష్ణుడే ఔషధము. ఔషధమునకు అనుపానము, పథ్యము వేరు వేరుగా నుండును. శ్రీకృష్ణ దివ్యౌషధమునకు సంకీర్తనమే అనుపానము, అదియే పథ్యము. అట్టి ఔషధమును త్రాగనక్కరలేదు. మనసులో స్మరించిన చాలును.

జ్వరము వచ్చినవారికి అన్నముపై రుచి పోవును. ఆకలి తగ్గి పోవును. అజ్ఞే, విషయ వ్యామోహము కల్గినవారికి భగవానునిపై మనస్సు ప్రవర్తించదు. రుచి పోయి, భక్తి లేకుండ పోవును. అట్టి మునుల మనోవృత్తులను భగవద్విషయముపై ప్రవర్తించునట్లు చేయు ఔషధము శ్రీకృష్ణ నామము

భగవానుడు అంతర్యామిగా, ఆత్మగా లేని వస్తువు ప్రపంచమున ఏ యొక్కటియు లేదు. సర్వ పదార్థములు భగవానుని శరీరములే. సర్వాత్మలు భగవానుని శరీరములే. ఈ విషయము నెరింగిన వానికి విశ్వ మంతయు భగవానుని శరీర మను జ్ఞానము కలుగుటచే, జగమున సర్వ పదార్థములపై ద్వేషము తొలగి, మైత్రి యేర్పడును. పరమాత్మపై భక్తి కలుగును. భగవానుడాత్మగా లేని పదార్థ మే యొక్కటియు లేదని తెలిసినచో - ఇంత కాలము - అది వేరు, ఇది వేరు, నేను వేరు, నీవు వేరు అను భేద జ్ఞానము నశించును. దేవతలను రాక్షసులు బాధించుచుండ, శ్రీకృష్ణ రూపమున నవతరించి, ఆ రాక్ష

సులకు బాధను కల్పించి, దేవతలను కాపాడిన శ్రీకృష్ణుడే మన మనస్సులో - ఇంద్రియములలో కలిగిన భేద జ్ఞానమును నశింపజేసి అంతయు వాని శరీరమే అని బోధించెను. అందువలన, వానివాడనే కాని, నేను కాను, నాని దేకాని, నాది కాదు అనిపించును. ఈ భేద జ్ఞానమే దైత్యేంద్రుడు కల్గించు బాధ. దైత్యేంద్రులకు ఆర్తిని కల్గించు ఔషధము శ్రీకృష్ణుడే.

'భవతి ఇతి భువనం' పరమాత్మయొక్క సంకల్పముచే నామ రూపములతో ఏర్పడిన జగత్తు - అధోలోకములు, మధ్యలోకములు, ఊర్ధ్వలోకములు అని, అవి మూడు విధములు. భూలోకము, భువర్లోకము, సువర్లోకము అని మూడు లోకములు. పృథివి, అంతరిక్షము, ద్యులోకము అని మూడు లోకములు. కృతకము, అకృతకము, కృతకాకృతకము అని,లోకములు మూడు విధములు.ఇవి త్రిభువనములు.అవి ఉండియు, లేన ట్లగుచున్నవి. 'అస్తి బ్రహ్మేతి చే ద్వేద సంత మేనం తతో విదుః' 'అసన్నేవ స భవతి. అసద్బ్రహ్మేతి వేద చేత్' బ్రహ్మ మున్నదని ఎరిగినవాడు - ఉన్నవాడగును. బ్రహ్మము లేదనుకొనినచో అతడే లేనివా డగును ఇట్టి జ్ఞానముచే, శ్రీకృష్ణ భగవానుడు పర బ్రహ్మమని ఎరిగినవాడు ఉన్నవాడు, ఎరుంగనివాడు లేనివాడు అగును. అట్లు నశించిపోవుచున్న త్రిభువనములకు తాను ప్రత్యక్షముగ కన్పించి, తానే పరబ్రహ్మమునని తెలిపి బ్రతికించిన సంజీవనౌషధము శ్రీకృష్ణ దివ్యౌషధమే.

భక్తుల కత్యంత హితమగు ఔషధము శ్రీకృష్ణ దివ్యౌషధము. హిత మనగా ఉపాయము. ఉపాయములు - కర్మము, జ్ఞానము, భక్తి, అవతార రహస్య జ్ఞానము, పురుషోత్తమ ప్రాప్తియోగము మున్నగున వెన్నియో ప్రతిపాదింపబడినవి. కాని, పరమాత్మ చేత

వరింపబడ దగు నిరతిశయమైన ప్రీతికలిగినవారగు భక్తులకు ఆ పరమాత్మయే ఉపాయము, ప్రాప్యము - ప్రాపకము అగుచుండును అందుకే, శ్రీకృష్ణుడే భక్తాత్యంత హితౌషధము.

పరమాత్మయే ఉపాయముగా కలిగి, పరమాత్మను చేరి, మరి వారినుండి వీడి సంసారమున పడరు. శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో 'యాంతి మద్యాజినోఽపిమాం' న న్నారాధించినవారు నన్ను పొందుదు రనెను. కావున, పరమాత్మకు ఉపాయముగా ఆశ్రయించిన వారికి మరల జన్మించుట అనెడి భయము నశించును. భవము అనగా జన్మము - భవ భయమును నశింపచేయు ఔషధము శ్రీకృష్ణ దివ్యౌషధము.

అంతే కాదు - ఈ ఔషధము శ్రేయః ప్రాప్తిని కల్గించును. ప్రేయము సంసారము - శ్రేయము మోక్షము. నిత్య భగవత్సాన్నిధ్య నిత్య భగవత్కైంకర్యములే శ్రేయము. వానిని భగవానుడే ప్రసాదించవలెను. అట్టి ఔషధమును సేవించి తరింపుడు.

*ఆమ్నాయాభ్యసనా న్యరణ్య రుదితం వేదవ్రతా న్యన్వహం*
*మేదశ్ఛేద ఫలాని పూర్త విధయః సర్వే హుతం భస్మని*
*తీర్థానా మవగాహనాని చ గజస్నానం వినా యత్పద*
*ద్వంద్వాంభోరుహ సంస్మృతిం విజయతే దేవస్స*
*నారాయణః. ౨౫.*

శ్రీ నారాయణ పదాంభోరుహ స్మరణమును విడిచి, కేవలము వేదములు వల్లెవేయుట అరణ్య రోదనము. వేదోక్త నియములను పాటించుట - కండలు కరుగుటకు చేయు వ్యాయామ సదృశము. యజ్ఞాది కర్మలు బూడిదపాలు. గంగాది పుణ్య తీర్థస్నానము గజ

స్నానము వలె ప్రయోజన శూన్యము. కావున, నిత్యము ఆ నారా యణుని స్మరించుచునే సర్వ కర్మల నాచరింపుము.

విశేషార్థము :-

కఠోపనిషత్తునందును, ముండకోప నిషత్తునందును కూడ -

"నాయమాత్మా ప్రవచనే న లభ్యః
న మేధయా న బహునా శ్రుతేన
య మే వైష వృణుతే తేన లభ్యః
తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్."

అను మంత్రముచే పరమాత్మ ప్రాప్తికి పరమాత్మయే ఉపాయమని చెప్పబడినది. శ్రవణ మనన నిధి ధ్యాసనములు భక్తిరహితముగ చేసి నను ప్రయోజనము లేదు. అట్లే భగవద్గీతలో -

"నాహం వేదై ర్నతపసా న దానేన న చేజ్యయా
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా"

అని వేదాధ్యయనమును కాని, తపస్సు కాని, దానము కాని, యాగము కాని ఎంత చేసినను, భక్తి లేనినాడు భగవద్దర్శనము కలుగ దని చెప్పబడినది.

అందుచే - వేదాధ్యయనము చేసినను, కర్మల నాచరించినను, దానము లాచరించినను - సంతత నారాయణ స్మృతితో చేసిన నాడు - అవి ఫలము నిచ్చును. లేనినాడు ఫలము నీయజాలవని శ్రీ కులశేఖరులు చెప్పుచున్నారు.

నారాయణ ధ్యానముతో సర్వాంతర్యామియై, సర్వాధార మయిన నారాయణుడే సర్వ కర్మలను చేయించువాడని, దాని కొరకే చేయుచున్నామని, ఆ కర్మయు ఆతనిదే యని, ఫలము ఆ సర్వేశ్వరుని

ప్రీతియే యనియు - కర్మలను, అధ్యయనమును, స్నానమును చేయ వలెను. వాని అనుగ్రహమే ఫలప్రదము. కాని, ఈ కర్మలు కావు. వానిని స్మరించకుండ దీని నాచరించుట ఎంత నిష్ప్రయోజనమో చెప్పుచున్నారు.

నారాయణ స్మరణములేకుండ వేదాధ్యయనము చేయుట అరణ్యములో - మొరను విని రక్షించువారు లేనిచోట - మొర పెట్టుట ఎంత వ్యర్థమో, అంత వ్యర్థము. అందుకే, మనము వేదము చదువునప్పుడు ముందు - 'హరిః ఓమ్' అని ప్రారంభించి, 'హరిః ఓమ్' అని అంతము చేయుదుము. వేదాధ్యయనము ఫలము నిచ్చునది కాదు. నారాయణుడా యధ్యయనముచే సంతుష్టుడై, ఫలము నొసంగవలెను. అట్లే, నారాయణ పాదపద్మ సంస్మరణ రహితమైన వేదోక్త కర్మాచరణము శరీరములోని కొవ్వును కరగించుటకు వ్యాయామము చేయుట వంటిదే యగును కాని, భగవత్ప్రాప్తికి ఉపకరించదు. అట్లే, చెరువులు త్రవ్వించుట మొదలగు ధర్మ కార్యములు ఆచరించుట కూడ - నారాయణ పాద పద్మ స్మరణముతో చేయనినాడు, బూడిదలో హోమముచేయుట ఎంత నిష్ప్రయోజనమో అంత నిష్ప్రయోజనము. పవిత్ర తీర్థములలో స్నానము చేయుట శుద్ధి నొసంగదు. ఆ స్నానము చేయునపుడు మనము చేయు నారాయణ స్మరణమే శుద్ధిని కలిగించును. లేనిచో - ఏనుగు కొలనులో దిగి, స్నానము చేసి, మరల ధూళి చిమ్ముకొనునపుడు - మరింత ఎక్కువగా ధూళి అంటుకొనుటకే స్నాన ముపయోగించును. మనము తీర్థయాత్రలను చేసితిమి అని రాజసము పెరుగుటకే స్నాన ముపయోగపడును. కాని, రజస్తమస్సులు తొలగి, సత్త్వము పెరిగి, భగవత్ప్రాప్తి కల్గుటకు పయోగపడదు. అందుచే, వేదాధ్యయనము, వేదవిహిత కర్మాచరణము మున్నగునవి చేయునపుడు - శ్రీమన్నారాయణ చరణ

ప్రేమముతో చేయవలెను. అది లేనినాడు - తమంత తాముగా అవి
సిద్ధిని కల్గింపనేరవు.

*శ్రీమన్నామ ప్రోచ్య నారాయణాఖ్యం*
*కేన ప్రాప్తా వాంఛితం పాపినోఽపి*
*హా! నః పూర్వం వాక్ప్రవృత్తా న తస్మిన్*
*తేన ప్రాప్తం గర్భవాసాది దుఃఖమ్.* ౨౩.

పాపాత్ములైనను - 'శ్రీమన్నారాయణ' అను నామమును ఉచ్చరించి, తమ కోర్కెలు నీడేర్చుకొనిరి గదా! అయ్యో! నా నాల్క ఆ నామమును ముందు ఉచ్చరించినది కాదు అందులకే నాకీ జన్మము, ఈ గర్భవాసము మున్నగు దుఃఖములు సంభవించెనవి.

విశేషార్థము :-

అన్ని నామములలో నారాయణ నామము విశిష్టమైనది. నామము లన్నియు భగవత్స్వరూపమును, గుణములను ప్రతిపాదించు నవే యయినను, వానిలో భగవానుని సర్వ వ్యాపకత్వమును తెలియ చేయు నామములు గొప్పవి. అవి మూడు. (1) విష్ణు (2) వాసుదేవ (3) నారాయణ. అనునవి. అందు నారాయణ నామము సర్వేశ్వరుని వ్యాపకత్వమును పూర్ణముగా వివరించినది. నారములు = సర్వ పదార్థములు - అయనము = ఆధారముగా కలవాడు. నారాయణుడు - ఈ విధముగ సర్వ పదార్థములయందు బహిరంత ర్వ్యాప్తిని పొందిన పరతత్త్వమును తెలియచేయు నారాయణ శబ్దము భగవానునికి ప్రధానమైన నామము. ఉపనిషత్తులలో - 'నారాయణ పరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః' అని - పరబ్రహ్మ, పరంజ్యోతి, పరమాత్మ మొదలగున వన్నియు నారాయణుడే.

"నారాయణేతి నామాస్తి వాగస్తి వశవర్తినీ
తథాఽపి నరకే ఘోరే పతంతీతి కిమద్భుతమ్."

ఉచ్చరించుటకు తగిన వాక్కున్నది. ఉచ్చరించుటకు నాలుక యున్నది. సులభముగ ఉచ్చరింపదగిన 'నారాయణ' నామ మున్నది. అయినను . నరకములో పడుచున్నారే యని వ్యాస మహర్షి బాధ పడినారు. నారాయణ శబ్దమాత్రము నుచ్చరించిన, 'విముక్త దుఃఖాః సుఖినో భవన్తి' దుఃఖములు తొలగి, సుఖము కలవా రగుదురు. మన మీ గర్భవాసాది దుఃఖములను పొందితిమి, జన్మ నెత్తితిమి, అనగా - వెనుకటి జన్మలో శ్రీమన్నారాయణుని స్మరింపలేదని తెలియు చున్నది. శ్రీమన్నారాయణ నామము నుచ్చరించిన వానికి మరి జన్మ యుండదు. ఎంతటి పాపాత్ములైనను శ్రీమన్నారాయణ నామము నుచ్చరించినచో - వారి కోరికలు నెరవేరి తీరును. మరల జన్మ రాదు. అయ్యో! మన మిపుడు జన్మ నెత్తితి మనిన, క్రిందటి జన్మలలోను మననోట నారాయణ నామ ముచ్చరింపబడలేదు. ఇప్పుడైనను ఉచ్చ రించి, మనము మరల జన్మ లేకుండ చేసికొందము. అని కులశేఖరులు చెప్పుచున్నారు.

*మజ్జన్మనః ఫల మిదం మధుకైటభారే
మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏష ఏవ
త్వద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య
భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ!* ౨౨.

దైత్య సంహారక! లోకనాథ! ఈ నా కోర్కె నీడేర్చుము. న న్ననుగ్రహింపుము. నీ భృత్య భృత్య పరిచారక భృత్య భృత్యు నకు భృత్యుడనుగా నన్ను తలంపుము. అట్లు నీ భృత్య పరంపరలో ఒకనిగా నన్ను తలంచుటయే ప్రభూ! నా జన్మకు ఫలము!

**విశేషార్థము :—**

కులశేఖరులు తమ వాంఛితమును ఈ విధముగ తెలియజేయు చున్నారు. భగవంతునికే దాసులమై యుండుట కోరదగినది కాదు. భగవద్దాసులకు దాసులమై యుండుట జీవితమున సాధింపదగినది.

"సిద్ధి ర్భవతి వా నేతి సంశయోఽ చ్యుత సేవినాం
. .. ... న తు తత్పరిచర్యా రతాత్మనామ్."

భగవంతుని సేవించువారికి సిద్ధి కలదో - లేదో సంశయము కాని, భగవద్భక్తులను సేవించినవారికి సంశయము లేదు. ఆ రహస్యము నెరింగిన కులశేఖరులు - మధుకైటభారే! నా జన్మకు ఫలము నొసంగుము. నా యందు నీ యనుగ్రహమును ప్రసరింపజేసి, నా కోకరిను నెరవేర్పుము అని ప్రార్థించిరి. భగవానుడు ఏమి ఆ కోరిక? ఏమి కావలెను? అని ప్రశ్నింపగా, హే లోకనాథ! నీ భృత్యుల భృతుల పరిచారకుల భృత్యుల భృత్యునకు భృత్యుడనై నే నుండు నట్లు అనుగ్రహింపుము. ఇదియే నా ప్రార్థన యనిరి. యామునాచార్యులవారుకూడ, ఇట్లే - భగవాను డెవరిని క్షణ కాలము విడువ లేడో, ఎవరు భగవ ద్దర్శనమునకై భోగ మోక్షములను త్యజింతురో - అట్టి మహాత్ములు నన్ను ప్రేమతో చూచునట్లు అనుగ్రహింపు మని సర్వేశ్వరుని ప్రార్థించిరి. భగవ ద్భక్తులను సేవించుటయే, వారి యనుగ్రహమును పొందుటయే జీవితమునకు సాఫల్య మని ఎరుంగవలెను.

*నాథే నః పురుషోత్తమే త్రిజగతా మేకాధిపే చేతసా*
*సేవ్యే స్వస్య పదస్య దాతరి సురే నారాయణే తిష్ఠతి*
*యం కంచి త్పురుషాధమం కతిపయ గ్రామేశ మల్పార్థదం*
*సేవాయై మృగయామహే వయ మహో మూకా వరాకా*
*వయమ్. ఇలా.*

ప్రభూ! మాకు నాథుడు, పురుషోత్తముడు, మూడు లోకముల కేకైకనాథుడు, మనసు మాత్రముచేత సేవింపజాలినవాడు, సేవించిన వారికి తన పదవి నొసంగువాడు, దేవతా మూర్తియు నగు నారాయణు డుండగా, మాతో ఏ సంబంధము లేని ఒకానొక మానవాధముని ఏ కొలది గ్రామములకో అధిపతి యగు వానిని అల్పాల్పము లగు ఫలముల నొసంగువానిని ఒక మానవ మాత్రుని సేవించుటకై తహ తహ లాడుచున్నాము. అహో! ఏమి మా జాడ్యము! నారాయణుని సేవింపక, నరుని సేవించువారికి స్పష్టముగా తెలియజేయుటకై వారికి గల తారతమ్యమును ఇందు విశదముగా వివరించినారు. నారాయణుడు సర్వ నర సమూహమున కాశ్రయుడై, సర్వ నరులలో అంతర్యామియై యుండువాడు, ఆతడు లేనిదే నిలకడ లేనివాడు ఈ నరుడు. నారాయణుడు మనకు ప్రభువు. ఆ సంబంధము మనకు తొలగించు కొంద మన్నను తొలగునది కాదు నరునకు నరునితో సంబంధము కల్పితము. ఆతడు త్రిజగన్నాథుడు. ఇతడు కొలది గ్రామములకు కధినేత. వానిని మనసుతో సేవించిన చాలును. వీనికి శరీరమును కష్ట పెట్టి, ఊడిగము సేయవలెను. నారాయణుడు - తన్ను కొలిచిన వారికి తన పదమునే యొసంగును, ఈ నరు డల్పాల్పముల నీడేర్చును. ఆతడు పురుషోత్తముడు; ఇతడు పురుషాధముడు. ఆతడు దివ్యుడు, ఈతడు మర్త్యుడు. ఇంత భేద మున్నను, ఆ నరులనే కొల్చు మూఢాత్ముల మగు మా సంగతి ఏ మనుకొనవలెనో తెలియదు.

విశేషార్థము -

మన మెంత తెలివి తక్కువవారము! పురుషోత్తము డగు నారాయణు డుండగా - ఆతని సేవింపక, పురుషాధము డగు ఒక నరుని సేవించుచుందుము. పురుషోత్తము డగు నారాయణునితో మనకు విడదీయరాని సంబంధము కలదు. అతడు మనకు సహజముగ

నిరుపాధికముగ పిత, రక్షకుడు, శేషి, భర్త, జ్ఞేయుడు, స్వామి, ఆధారము, ఆత్మ, భోక్తయై యుండును. ఈ రీతిగ తొమ్మిది విధములగు పరమాత్మతోడి సంబంధము నెరింగిన నాడు - సహజముగ నాతడు నాథుడు కనుక, ఆతని దాసుల మగు మన నాతడే తనంత రక్షించును. ఇతరు లాశ్రయించిన కాని రక్షింపరు. కాని, పరమాత్మకు చెందినవారమని తెలిసినంత మాత్రముననే పరమాత్మ రక్షించును. అంతే! ఆతనికి మనము విముఖుల మైనను, ఆతడు మనను విడువడు. ఇతరులు మనతో సంబంధము లేనివా రగుటచే, వాని నెంత ఆశ్రయించినను - రక్షింప నుద్యుక్తులు కారు సిద్ధపడినను వారు పూర్తిగా రక్షింపజాలరు. సహజ స్వామి యగు పురుషోత్తముని విడచి ఏ సంబంధము లేని ఒక నరుని ఆశ్రయింతుము. ఎంత మూర్ఖులమో చూడుడు.

అంతే కాదు. భగవానుడు పురుషోత్తముడు. మన మాశ్రయించు పురుషుడు పురుషాధముడు. సమస్తము తన కుండియు, ఇతరులను రక్షించనిదే జీవించలేమని తన జీవిత మంతయు ఇతర రక్షణమునకే వినియోగించువాడు పురుషోత్తముడు. ఒకరిని హింసించియైనను తనకొరకే తాను జీవించువాడు పురుషాధముడు. అందరును తనకే ఉపయోగపడవలె ననువాడు పురుషాధముడు. తాను అందరకు సాయపడవలె ననువాడు పురుషోత్తముడు. క్షరులగు సంసారుల కంటెను, అక్షరులగు ముక్తులకంటెను ఉత్తముడు పురుషోత్తముడు. వానినే ఆశ్రయించి సేవించవలెను. కాని, మనము పురుషాధములను సేవించుట ఎంత అవివేకమో చూచుడు.

అంతేనా! భగవానుడు మూడు లోకములకు తానే ప్రభువు. మనము వాని నాశ్రయించము. ఒక ఊరికో, రెండు ఊళ్ళకో, ప్రభువైన వాని నాశ్రయింతుము. అన్ని లోకములకు తానే ప్రభువయి మనకు సేవలు చేయును. మనను నియమించువాడై, మనచే నియ

మింపబడును. గోప బాలకులకు, గోపికలకు, అర్జునునకు తాను లొంగి ప్రవర్తించిన శ్రీకృష్ణ భగవానుడు పురుషోత్తముడే కదా! సామాన్యులకు కొద్దిపాటి ఐశ్వర్యము కాని, ధనము కాని కల్గిన, వారి అహంకారమునకే మేర యుండదు. అందరిచేతను తాను సేవలు చేయించుకొనునే కాని, ఎవరిని తాను సేవింపడు. అంతటి అహంకారము గలవాని నాశ్రయించుటను కాని, సుశీలుడు - సులభుడు అగు వానిని ఆశ్రయింపము. లోకములో నరాధములను సేవించుట ఎంతో కష్టము శరీరమును శ్రమ పెట్టి సేవలు చేయవలెను. మాటలతో వారినే పొగడుచుండవలెను. ఇంతటి శ్రమపడినను - వారు సంతుష్టి నందుట దుర్లభము. ఏదియో కొంక దోషమునే ఎంచుచుందురు. పురుషోత్తముని సేవించుట సులభము. మన శరీరమును శ్రమపెట్ట నవసరము లేదు. మన పనులనే మనము చేసికొనుచు, మన మాటలే మన మాడుకొనుచు మనసుతో మాత్రము సేవించిన చాలును. అంతటి సులభుడైన పురుషోత్తముని సేవింపక, కష్టసాధ్యమగు నీచ మానవ సేవనే వాంఛించుచుందుము.

పరమాత్మను సేవించినచో — పరమ పదము నొసంగును. తన పదవినే యొసంగును. తనతో సమాన మగు జ్ఞానానందములను ప్రసాదించును. ఐశ్వర్యమును ప్రసాదించును. తన నుండి విడువక, తనతోనే ఉండునట్లు చేయును. పురుషాధములను సేవించిన, అల్పాల్ప మగు తుచ్ఛ ధనము నొసంగుదురు. ఇచ్చి, కృతజ్ఞతనే సతతము వాంఛించు చుందురు. వారిని తమకంటె తక్కువగనే చూచుచుందురు. అట్టి హీను లగు నరాధముల సేవకే జీవిత సంకితము చేసి, పురుషోత్తము సేవను మరచిన మన మెంత అవివేకులమో! ఎంత మూర్ఖులమో! చూడుడు. ఈ భేదము నం

మనసులో ఆలోచించుకొని, మానవాధముల సేవను విడచి, పురుషోత్తము నందే జీవితమును గడపి, ధన్య మొనర్చుకొనవలెను.

నాథేనః = మనకు సహజముగ స్వామి పురుషోత్తముడు.
యేనకేనచిత్ = మనతో ఏ సంబంధము లేనివాడు పురుషాధముడు.

త్రిజగతాం ఏకాధిపుడు = పురుషోత్తముడు.
కతిపయ గ్రామేశుడు = పురుషాధముడు.

స్వస్య పదస్య దాతరి = తన పదవినే ఒసంగువాడు పురుషోత్తముడు

అల్పార్థదుడు = పురుషాధముడు.
నారాయణుడు = పురుషోత్తముడు.
నరుడు = పురుషాధముడు.

ఇంతటి భేదమున్నను — పురుషోత్తముని విడచి పురుషాధముని సేవించువార లెంతటి మూర్ఖులో యోచించుకొనుడు.

*మదన! పరిహర స్థితిం మదీయే*
*మనసి ముకుంద పదారవింద ధామ్ని*
*హర నయన కృశానునా కృశోఽసి*
*స్మరసి న చక్ర పరాక్రమం మురారేః.* ౨౯.

ఓ మదనా! నా మనసులో ___ ముకుంద చరణారవిందములు పాదుకొని యున్నవి. నీ వచట చేరుకొన ప్రయత్నింపకుము. పురారి నేత్రాగ్నిచేతనే కృశించితివి ఇక — మురారి చక్ర పరాక్రమము గూర్చి యెఱింగి మసలుము.

విశేషార్థము :-

అన్నిటికంటెను ప్రధానమైన శత్రువు కామము. దానికి అధి దేవత మదనుడు — మన్మథుడు. ఆ మన్మథుడు లక్ష్మీ పుత్రుడే. కాని, శ్రీ మహావిష్ణువు యొక్క చక్రమువద్ద భయముచే, చక్రధారిని స్మరించినవారి దగ్గరకు రాడు. పరమ శివుని వద్దకు వెళ్ళి, పూర్వము ఆతని మూడవ నేత్రపు అగ్నిహోత్రముచే భస్మమైనాడు. ఆ విధముగా శివుని వద్దకు వెళ్ళుటకైనను రాడు. అందుచే, మన కులశేఖరుల వారు — మన్మథా! నా మనస్సులో నీ విక నుండుట మానుము. నా మనస్సు ముకుందుని పాదారవిందములకు నివాస స్థానమైనది. వెనుక — హరుడుండు చోటికేగి భస్మమైతివి. ఆ నాడతడు కన్ను విప్పవరకైనను బ్రతికితివి. కాని, ఇచ్చట — శ్రీమహావిష్ణువు చూడనవసరము లేకయే, వాని చక్రము నిన్ను తుత్తునియలు చేయును. దహించివేయును. చక్ర పరాక్రమము నెరుగుదువు గదా! కావున, ఇక — చక్రధారి, మురారియు నగు శ్రీ మహావిష్ణువునకు వాసస్థానమగు నా మనస్సులో నిలువకుము అనిచెప్పుచున్నారు. మనస్సులో శ్రీకృష్ణుడు వసించినచో — మరి కామము వసింపదు ఆత్మ వినాశకమగు కామమునకు చోటు లేకుండా చేయుటకు మనసులో శ్రీమహావిష్ణువుని నిలుపుకొనవలెను.

*తత్త్వం బ్రువాణాని పరం పరస్మా*<br>
*న్మధు క్షరంతీవ సతాం ఫలాని*<br>
*ప్రావర్తయ ప్రాంజలి రస్మి జిహ్వే!*<br>
*నామాని నారాయణ గోచరాణి.* 30.

ఓ జిహ్వా! దోసిలి యొగ్గి ప్రార్థించుచున్నాను. పరతత్త్వమగు నారాయణుని ప్రతిపాదించుచు, సత్పురుషులకు అమృతమును స్రవించు ఫలములవంటివైన నామములను మరల మరల నుచ్చరింపుము,

తాత్పర్యము —

నామ స్మరణమే భవ తరణము. నామికి, నామమునకు భేదము లేదు. నామి స్వరూప పరతత్త్వము దుర్లభమైనను, నామము సులభము. నామిని [illegible] పట్టి పిలిచిన, నామి ఎచ్చట నున్నను వచ్చి తీరను. శ్రీకృష్ణ పరమాత్మ పరోక్షముగా నున్నను, ద్రౌపదిని కాపాడి, అభయ మొసంగిన నామము. పరతత్త్వము బంగారపు ముద్దవంటిది నామము బంగారముతో చేసిన నగ వంటిది. ఇది మనకు అలంకారమై యుండి రక్షించును. పరతత్త్వమును తెలియజేయు నామములలో ప్రధానమైనది నారాయణ యనునది. ఆ నారాయణ నామముచే తెలియజేయబడు వానినే తెలియజేయునవి — అనంత, గోవింద, హరి, కృష్ణ మొదలగునవి. ఈ నామములు ఈ ప్రకృతికంటె, పరుడైన జీవునికంటె పరుడైన పరమాత్మను తెలియజేయును. పరబ్రహ్మ మున్నాడని ఎరిగిన వ్యక్తులకు ఈ నామములు తేనెలను స్రవించును. నారాయణుని ప్రేమాస్పదమైన నామములనే మరల మరల పలుకుచుండవలెనని శ్రీ కులశేఖరులు తమ జిహ్వతో చెప్పి, చేతులు జోడించి ప్రార్థించుచున్నారు.

*ఇదం శరీరం పరిణామ పేశలం*
*పత త్యవశ్యం శ్లథసంధి జర్ఝరమ్*
*కి మౌషధైః క్లిశ్యసి మూఢ! దుర్మతే!*
*నిరామయం కృష్ణ రసాయనం పిబ.* ౩౧

ఓ మూఢా! దుర్బుద్ధీ! ఈ శరీరము క్రమముగ జీర్ణించిపోవునది. కీళ్లు సడలి పోవునవి. పడిలి పోవునది. ఎప్పుడో ఒకనాడు తప్పక. ఈ [illegible] దీని ఔషధములతో నిలబెట్టుటకు క్లేశ పడెదవేల? వ్యాధిగ్రస్తము కానీయక కాపాడు కృష్ణ రసాయనమును త్రాగుము.

విశేషార్థము —

ప్రకృతియొక్క వికారమై, సంతతము మార్పు చెందునదై, అనిత్యమై, వినాశ దగినదై యుండు ఈ శరీరములో చేరిన జీవుడు ఆ దేహమే తాను అను భ్రాంతి కలిగియుండును. అట్టి మూఢుడు అతడే దుర్మతి. ఆ మూఢత్వముచే శరీరము కాపాడుకొనుటయే తాను సాధించవలసినదని భావించి, అది చనిపోవునేమో యని, మందులు తిని కాపాడుకొనుచుండును. శరీర మెన్ని మందులు తినినను చివికి చివికి కృశించి, చివరకు లేకుండా పోవునదే కాని, స్థిరముగా నిలుచునది కాదు. దేహముకంటె వేరైన ఆత్మ — పరమాత్మతో విడువక యుండునట్లు చేసికొనుటయే మరణము లేకుండుట. దానిని సాధించుటయే మనము చేయవలసినది. దానికే మందులు కావలెను. ఆ మందు — 'కృష్ణ రసాయనము.' కృష్ణ అనునామము నుచ్చరించుచు, కృష్ణుని యందే భక్తి కలిగి యున్నచో — ఎన్నటికిని ముసలితనము కాని, రోగముగాని, చావుగాని లేనివాడై, పరమాత్మతో చేరి యుండును కృష్ణ నామము రసాయనము. రసాయనము ముసలితనమును, రోగమును దూరము చేయును.* అట్లే, కృష్ణ నామ రసాయనము. రస స్వరూపు డగు పరమాత్మతో మనలను నిత్యము చేర్చియుంచును. అట్లే, రోగములు లేకుండ చేయును. దేహాత్మాభిమానము తానే స్వతంత్రుడ ననుబుద్ధి, భగవంతునికంటె ఇతరులకు చెందినవాడనను బుద్ధి, తనను తాను రక్షించుకొనువాడ ననుబుద్ధి, బంధువుల వలె కనబడు దేహబంధువులపై ఆసక్తి, విషయాభిలాష ప్రీతి అనునవి

* [illegible] — [illegible] ముసలితనమును, [illegible] చుచున్నది

— సంపాదకుడు

అరు రోగములు. ఈ రోగములు లేకుండ చేసి, పరమాత్మను ఎన్నడును వదలకుండ నుంచెడి కృష్ణ రసాయనమును త్రాగినను ప్రయోజనము లేదు.

*దారా వారా కరవర సుతా తే తనూజో విరించిః*
*స్తోతా వేద స్తవ సురగణో భృత్యవర్గ ప్రసాదః*
*ముక్తి ర్మాయా జగ దవికలం తావకీ దేవకీ తే*
*మాతా మిత్రం బలరిపుసుతః త్వయ్యతోఽన్యన్న జానే. ౩౨.*

కృష్ణా! జలనిధి పుత్రి యగు లక్ష్మి నీ భార్య. బ్రహ్మ నీ కుమారుడు. వేదము నీ స్తోత్ర పాఠకుడు. దేవతా గణము నీ భృత్యకోటి. మోక్షము నీ అనుగ్రహము. ఈ జగత్తు నీ మాయ. దేవకీ దేవి నీ తల్లి. ఇంద్ర పుత్రుడగు అర్జునుడు నీ మిత్రుడు. అట్టి నీకంటె ఇతర దైవమును ఎవరిని ఎరుగను.

విశేషార్థము –

కృష్ణా! నీకంటె వేరొకరిని నే నెరుగను. నీవే సర్వ జగత్కర్త యగు బ్రహ్మకు తండ్రివి. మా దేవకికి కుమారుడవు. కారణ కారణుడవై యుండదగినవాడవు. కార్యమగు జగత్తులో ఒక యాదవుని బిడ్డవై జన్మించితివి. ఏమి నిరంతర సౌభాగ్యములు! సముద్రమును మథించగా జన్మించిన క్షీరసాగర తనూజ నీ భార్య. నీ కుమారుడు సృష్టికర్త యగు బ్రహ్మ. పురుషునిచే నిర్మింపబడనివి, అనాదులు, నిత్యములు అగు వేదములు నిన్ను స్తోత్రము చేయును. ఇంద్రాది దేవగణమంతయు నీ భృత్యవర్గము. నీ యనుగ్రహమే ముక్తి. నీ సంకల్పమే జగత్తును నిర్మించును [illegible] ఈ విధముగ లక్ష్మీపతి – సర్వజగత్త్రాణుడు, వేదవేద్యుడు, దేవగణపూజ్యుడు, మోక్షప్రదుడు, మాయావియైన నీకు తల్లి దేవకి మిత్రుడు ఇంద్ర పుత్రుడు అర్జునుడు. కృష్ణా!

నీ వైభవమును ఎవ రెరుంగ జాలుదురు! పరుడవై, మావంటి వారి కొరకు సులభుడవైన నీకంటె ఇతరమును నే నెరుంగను కృష్ణా! నీవే నావాడ నని భావించి రక్షింపుము.

*కృష్ణో రక్షతు నో జగత్త్రయ గురుః, కృష్ణం నమస్యా మ్యహం*
*కృష్ణే నామర శత్రవో వినిహతాః, కృష్ణాయ తస్మై నమః*

*కృష్ణా దేవ సముత్థితం జగ దిదం, కృష్ణస్య దాసో౽ స్మ్యహం*
*కృష్ణే తిష్ఠతి సర్వ మేత దఖిలం హే కృష్ణ ! రక్షస్వ మామ్* 33.

ఈ శ్లోకమున చమత్కారముగ విభక్తు లన్నింటిలోను అనగా — ప్రథమా విభక్తి మొదలు సప్తమీ విభక్తి వరకును సంబోధన ప్రథమా విభక్తితో సహా - కృష్ణ శబ్దమును నిర్దేశించి స్తుతించుచున్నారు

కృష్ణుడు జగత్త్రయ గురువు. మమ్ములను రక్షించుగాక! కృష్ణుని నేను నమస్కరించుచున్నాను. కృష్ణునిచేత రాక్షసులు చంపబడిరి. కృష్ణునికొఱకు నమస్కరించుచున్నాను. కృష్ణునినుండి ఈ జగత్తు బయల్వెడలినది. కృష్ణునకు నేను దాసుడను. కృష్ణుని యందే ఈ సర్వ జగత్తు నిలచియున్నది. ఓ కృష్ణా! నన్ను రక్షింపుము.

విశేషార్థము :-

కృష్ణునితోనే అన్ని విధములగు సంబంధములను కల్గియుండుటయే మనము కోరదగినది' అని తెలియజేయుటకు కృష్ణ శబ్దములను అన్ని విభక్తులలోను నిర్దేశించి, వానితో మనకుగల సంబంధములను నిరూపించు చున్నారు. కృష్ణ శబ్దమును ఏడువిభక్తులలోను, సంబోధనములోను నిర్దేశించిచెప్పుచున్నారు

కృష్ణః = కృష్ణుడు - ప్రథమా విభక్తి
కృష్ణః రక్షతు నః జగత్త్రయగురుః

మూడు లోకములకు తండ్రియైన కృష్ణుడు మనలను రక్షించుగాక! తండ్రియై, రక్షకుడై, సహజమగు సంబంధము ఉండుటచే, మన నుండి ప్రతిఫలము నపేక్షింపకయే, తానే మన రక్షణమును చేయును.

కృష్ణం = కృష్ణుని - ద్వితీయా విభక్తి.
కృష్ణం నమస్యామి అహమ్.

నేను కృష్ణుని నమస్కరించుచున్నాను. మనము చేయు పను లన్నియు కృష్ణునివే. కృష్ణుడే మనను తన దాసులుగా తన పనులయందు నియమించి చేయించుకొని, ప్రతిఫలముగా పోషించుచున్నాడు. అట్టిచో - మన మెవనిచేత పోషింపబడుచున్నామో, ఎవనికి దాసులమో వానికి నమస్కరింపవలెను. అందుచే, నేను కృష్ణుని నమస్కరించు చున్నాను అనవలెను.

కృష్ణేన = కృష్ణునిచేత - తృతీయా విభక్తి.
కృష్ణేన అమరశత్రవో వినిహతాః.

కృష్ణునిచే అమరుల శత్రువులు చంపబడినారు. దేవతలు సర్వ ఫలప్రదులు. వారి శత్రువులు రాక్షసులు. వారిని చంపి కృష్ణుడే దేవతలను కాపాడినవాడు. ఇంద్రాగ్ని యమ వరుణాది దేవతలకు ఆయా ఆధిపత్యముల నిచ్చి, ఆ దేవతల కొఱతలను కల్గించు రాక్షసులను చంపి, స్థైర్యమును కల్గించువాడు కృష్ణుడే. మనలో నుండు ఆసుర చిత్తవృత్తులే అమరత్వమును ఎదిరించెడి శత్రువులు. పరమాత్మలో నిత్య సాన్నిధ్యము కల్గి యుండుట అమరత్వము. దానికి శత్రువులు ఆసురము లగు

చిత్త వృత్తులు. ఆ చిత్త వృత్తులను మనకు తనతో సాన్నిధ్యమును ప్రసాదించెడివాడు శ్రీకృష్ణ పరమాత్మయే.

కృష్ణాయ = కృష్ణుని కొఱకు - చతుర్థీ విభక్తి.
కృష్ణాయ తస్మై నమః.

ఆ కృష్ణుని కొరకు నమస్కారము. భగవత్ప్రాప్తికి ప్రతిబంధకము లగు - విరోధు లగు 'నేను చేయుచున్నాను, నే ననుభవించుచున్నాను, నేను నన్ను రక్షించుకొనుచున్నాను' మొదలగు వానిని తొలగించి, అతడే చేయించుచున్నాడు, అతడే అనుభవించుచున్నాడు. అతడే రక్షించువాడు' అను భావము కల్గుటకు 'నమః' శబ్దమే శరణము. మః = నాది, న = కాదు అని భగవానునకే అర్పింపవలెను.

కృష్ణాత్ = కృష్ణుని వలన - పంచమీ విభక్తి.
కృష్ణాత్ ఏవ సముద్గితం జగత్ ఇదం.

ఈ జగత్తు అంతయు కృష్ణుని వలననే బయల్వెడలుచున్నది. ఈ జగత్తు ఎవనివలన జన్మించుచున్నదో, ఎవనిచేత జీవించుచున్నదో, ఎవనియందు లీన మగుచున్నదో, అతడే పరబ్రహ్మము అని ఉపనిషత్తు చెప్పుచున్నది.

ఈ జగత్తు సృష్టికి ముందు విత్తనములో చెట్టు వలె సూక్ష్మముగా పరమాత్మలో అణగి యుండి, సృష్టి సమయమున పరమాత్మ సంకల్పముచే లేచుచున్నది. ఆ కారణ తత్త్వమే శ్రీకృష్ణ పరబ్రహ్మము.

కృష్ణస్య = కృష్ణుని యొక్క - షష్ఠీ విభక్తి.
కృష్ణస్య దాసో స్మ్యహమ్.

నేను కృష్ణుని యొక్క - దాసుడను షష్ఠీ విభక్తి యొక్క - అర్థము శేషత్వము. అనగా - దానికే చెంది, దాని అతిశయమునకే ఉపయోగపడునది శేషము. జీవులందరును పరమాత్మకే శేషభూతులు.

అనగా - పరమాత్మకే చెంది, పరమాత్మచే పరమాత్మకొరకే వినియోగించుకొన దగినవారు. అనగా - దాసులు అని అర్థము. పరమాత్మ శేషి - ప్రభువు - స్వామి, నేను శేషము - దాసుడు - సొత్తు అని గుర్తింపవలెను. ఆ భావననే నేను కృష్ణునియొక్క దాసుడను అని తెలియచేసిరి.

కృష్ణే = కృష్ణునియందు - సప్తమీ విభక్తి.
కృష్ణే తిష్ఠతి సర్వ మేత దఖిలం.

కృష్ణునియందే ఆధారపడి ఈ సమస్త జగత్తు నిలచి యున్నది. సర్వ భూతములకు, చరాచర మగు సర్వ విశ్వమునకు శ్రీకృష్ణ పరమాత్మయే ఆధారము. సప్తమీ విభక్తికి ఆధారము అని అర్థము. ఉపనిషత్తులలో - 'సదాయతనములు - సత్ప్రతిష్ఠితములు ఈ లోకములు' అని సత్ శబ్దముచే తెలుపబడు పరమాత్మయే ఆధారమని చెప్పబడినది దానినే భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు - 'మత్స్థాని సర్వ భూతాని' నాయందు సర్వ భూతము లున్నవి అని చెప్పెను. సర్వజగదాధార భూతుడు శ్రీకృష్ణ భగవానుడే.

హే కృష్ణ ! సంబోధన ప్రథమా విభక్తి.
హే కృష్ణ ! రక్ష స్వమామ్=ఓ కృష్ణా ! నన్ను రక్షింపుము.

జగ ద్రక్షకుడు, జగద్గురువు, ప్రభువు, విరోధి నాశకుడు, సర్వాధికుడు, సర్వ జగ త్కారణుడు, సర్వ జగ త్స్వామి, సర్వ జగ దాధార భూతుడు అగు ఓ కృష్ణా ! నన్ను రక్షింపుము. ఈ విధముగ కృష్ణా

విశేషార్థము :-

నీతో అన్ని విధము లగు సంబంధముల నెరింగి, రక్షకుడుగా శ్రీ కులశేఖరులు వరించుచున్నారు.

*తత్త్వం ప్రసీద భగవన్! కురు మయ్యనాథే*
*విష్ణో కృపాం పరమ కారుణికః కిల త్వమ్*
*సంసార సాగర నిమగ్న మనంత దీన*
*ముద్ధర్తు మర్హసి హరే! పురుషోత్తమోఽసి.* ౩౪

సర్వేశ్వరా! అనాథుడ నగు నా యెడల దయ చూపుము. అనుగ్రహింపుము. నీవు పరమ దయామయుడవుగదా! హరే! అనంత! ఈ సంసార సాగరమును మునుగు దీను నుద్ధరింపుము. నీవు పురుషోత్తముడవుగదా!

విశేషార్థము :-

హే భగవన్! జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్య తేజస్సులు పరిపూర్ణముగా గలవాడవు కదా నీవు. నేను అనాథుడను. నన్ను రక్షించుకొను జ్ఞానము, శక్తి, బలము లేనివాడను. అందుచే, నీవు అనుగ్రహింపుము. నీవు విష్ణువు కదా! సర్వ వ్యాపకుడవు. నే నెంత బాధపడుచున్నానో ఎరుంగనివాడవు కావు. కరుణామయుడవు అయిన నీవు నా యందు కరుణ చూపుము. అనన్త! కాలముచేతకాని, దేశముచేతకాని, వస్తువుచేతగాని పరిచ్ఛేదింపబడనివాడవై యుండు నీవు ఈ సంసార సముద్రమున బడి మునిగి, దీనుడనైన నాలో లేవా? నన్ను ఈ సముద్రము నుండి ఎత్తలేవా? నీవు సమస్తాపదలను హరించు హరివి కదా! ఈ దీనుని ఆపదను పోగొట్ట తగదా! పురుషోత్తముడవు కదా! స్వార్థమునకై ఒకరిని హింసించువా డధముడు. తనకు కూడ లాభ ముండిన, ఒకరికి సాయపడువాడు మధ్యముడు. తనకు ఏ లాభము లేకున్నను - ఇతరులను రక్షించువాడు పురుషోత్తముడు. అట్టి పురుషోత్తముడవుకదా! రక్షింపుము.

*నమామి నారాయణ పాద పంకజం*
*కరోమి నారాయణ పూజనం సదా*
*వదామి నారాయణ నామ నిర్మలం*
*స్మరామి నారాయణ తత్త్వ మవ్యయమ్.* ౭౨

శ్రీమన్నారాయణుని పాద పద్మములకు నమస్కరింతును. నారాయణుని సదా పూజింతును. నారాయణుని నిర్మల మగు నామమును కీర్తింతును శాశ్వత మగు నారాయణ తత్త్వమును స్మరింతును.

విశేషార్థము :-

శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో తొమ్మిదవ అధ్యాయము నందును, పదునెనిమిదవ అధ్యాయమునందును కూడ, భగవత్ప్రాప్తి కాంక్షించు భక్తుడు ఏమి చేయవలెనో చెప్పినాడు.

"మ న్మనా భవ మ ద్భక్తః మ ద్యాజీ మాం నమస్కురు"

నా యందే మనసు నుంచుము. నా యందు భక్తి కలవాడవు కమ్ము. నా ఆరాధనమే చేయుచుండుము. నన్నే నమస్కరించు చుండుము, అను దానినే తాను నిత్యము ఆచరింతునని శ్రీ కులశేఖరుల వారు ఈ శ్లోకములో చెప్పుచున్నారు.

సర్వ పదార్థములలో - లోపల, వెలుపల - అంతటను వ్యాపించి యుండు నారాయణునకే మన వ్యాపారముల నన్నిటిని అర్పించి యుండుటయే కర్తవ్యము. అందుచే, శ్రీమన్నారాయణ చరణ పద్మములకే నమస్కరించు చుందును.

సంతతము నారాయణ పూజనమునే చేయు చుందును. పవిత్ర మగు నారాయణ నామమునే ఉచ్చరించుచుందును. నాశ రహితము - శాశ్వతము అగు నారాయణ తత్త్వమునే స్మరించుచుందును. సర్వ

వ్యాపారములు నారాయణార్పణముగ చేయుట, పూజలన్నియు నారాయణునకే చేయుట, సతతము నారాయణ పరముగనే స్మరణము చేయుట జీవితపరమార్థ మని కులశేఖరులవారు ఉపదేశించిరి.

*శ్రీనాథ! నారాయణ! వాసుదేవ!*
*శ్రీకృష్ణ! భక్తప్రియ! చక్రపాణే!*
*శ్రీ పద్మనాభాచ్యుత కైటభారే!*
*శ్రీరామ! పద్మాక్ష! హరే! మురారే!* ౨౬
*అనంత! వైకుంఠ! ముకుంద! కృష్ణ*
*గోవింద! దామోదర! మాధవేతి*
*వక్తుం సమర్థోఽపి న వక్తి కశ్చిత్*
*అహో! జనానాం వ్యసనాభిముఖ్యమ్.* ౨౭

శ్రీనాథ! నారాయణ! వాసుదేవ! శ్రీకృష్ణ! భక్తప్రియ! శ్రీపద్మనాభ! అచ్యుత! కైటభారీ! శ్రీరామ! పద్మాక్ష! హరీ! మురారీ! అనంత! వైకుంఠ! ముకుంద! కృష్ణ! గోవింద! దామోదర! మాధవ!' అని పలుకగలిగిన మనుజుడు పలుకుట లేదు. అయ్యో! ఈ వ్యసన లంపటత్వ మెంతటిది!

విశేషార్థము -

శ్రీ కులశేఖరులు చక్రవర్తిగా ప్రజల హితమునే కాంక్షించు వారు. ప్రజలు ఎన్నివిధముల చెప్పినను - భగవన్నామమును ఉచ్చరింపక, వ్యసనములచే ఆకర్షింపబడి, భగవద్విముఖులై యుండుట జూచి శ్రీ కులశేఖరులవారు బాధపడుచున్నారు. భగవన్నామముల నుచ్చరించుటకూడ మీకు శ్రమయేనా? శ్రీనాథ! నారాయణ! వాసుదేవ! శ్రీకృష్ణ! భక్తప్రియ! చక్రపాణీ! శ్రీపద్మనాభ! అచ్యుత! కైటభారే! శ్రీరామ! పద్మాక్ష! హరే! మురారే! అనంత! వైకుంఠ! ముకుంద! కృష్ణ! గోవింద! దామోదర!

మాధవ! అని పలుకగలిగియు- నోటితో పలుకరే! అయ్యో! ఏమి వీరి వ్యసనాసక్తి! యని కులశేఖరులు విలపించుచున్నారు

*ధ్యాయంతి యే విష్ణు మనంత మవ్యయం*
*హృత్పద్మ మధ్యే సతతంవ్యవస్థితమ్*
*సమాహితానాం సతతాభయప్రదం*
*తేయాంతి సిద్ధిం పరమాం చ వైష్ణవీమ్.* 3౹౹

సంతతము హృదయ పుండరీక మధ్యమున సుస్థిరముగ నిలచి యున్నవాడును, తనను ధ్యానించుచున్న వారలకు అభయ మొసంగు వాడును, ఆద్యంతములు లేనివాడును, శాశ్వతుడును అగు ఆ విష్ణువును ఎవరు ధ్యానింతురో, వారు విష్ణు సంబంధ మనెడి పరమ సిద్ధి నొందజాలుదురు.

విశేషార్థము :-

భగవత్తత్త్వము అయిదు విధములుగ నుండును. 1 పరము 2. వ్యూహము 3. విభవము 4. అంతర్యామి 5. అర్చ అని. అందు పరతత్త్వము శ్రీవైకుంఠమున వేంచేసి యుండును. వ్యూహము పాల సముద్రమునం దుండును. రామకృష్ణాది రూపమున నవతరించి యుండున నది విభవము. హృదయ స్థానమున దహరమున నుండునది అంతర్యామి. ఆలయములలో - గృహములలో ఆరాధించు మూర్తులు అర్చ. ఈవిధముగ నుండు నైదింటిలోను హృదయ పుండరీకమున వసించు భగవానుని ధ్యానింపవలెను.

"దహ్రం విపాప్మం పరమధ్య సంస్థం హృత్పుండరీకం పరవేశ్మభూతమ్ "

అని శరీర మధ్యభాగమున పరమ పురుష నివాస స్థానముగ సూక్ష్మ మగు దహర పుండరీక ముండును. దానియందు అనంతుడు, అవ్యయుడు అగు విష్ణువు అంగుష్ఠమాత్రుడై, ఉపాసకుల ననుగ్రహించు

టుకు వసించి యుండును. ఆ పరమాత్మయందే మనసును మధ్యలో విచ్ఛేదము లేకుండ నిలిపి, ప్రీతి పూర్వకముగ తలంచుటయే ధ్యానము. అట్టి ధ్యానమును చేయువారికి ప్రత్యక్ష సమానముగ పరమాత్మ సాక్షాత్కరించి, సతతము ఆ స్మృతి చెడకుండ నిలిపి, అభయము నొసంగును. అట్లు ధ్యానము చేయువారు- 'త ద్విష్ణోః పరమం పదమ్' అని చెప్పబడు పరము పదము - 'పరంధామము' 'పరమ వ్యోమము' అని చెప్పబడు వైష్ణవ స్థానమును చెంది, పరమసిద్ధి నందుదురు.

*క్షీరసాగర తరంగ శీకరా*
*సార తారకిత చారు మూర్తయే*
*భోగి భోగ శయనీయశాయినే*
*మాధవాయ మధు విద్విషే నమః.* ౨౨

క్షీర సాగరమున తరంగముల జల్లుచే అచ్చటచ్చట నక్షత్రములు పొడమిన ట్లున్న సుందర విగ్రహుడు, శేష భోగశయ్యపై పవళించిన మధుసూదను డగు మాధవునకు నమస్కారము.

విశేషార్థము :-

పాల సముద్రములో శేష శయ్యపై, నీలమేఘశ్యామలమైన నారాయణమూర్తి శయనించియుండును ఆ నీలమేఘ శ్యామల సుగుణమధుర మంజుల దివ్య మంగళ విగ్రహముపై క్షీరసాగర తరంగముల నుండి గాలి కెగిరిన శీకరముల జల్లు పడగా - ఆ నీలమేఘ శ్యామల చారుమూర్తి తారకిత మగును నీలాకాశముపై నక్షత్రములవలె, మాధవుని దివ్య మంగళ విగ్రహముపై చిందిన పాల తరగల చినుకులు ప్రకాశించుచుండును. అట్టి మధుసూదను డగు మాధవునకు నమస్కారము.

*యస్య ప్రియౌ శ్రుతిధరౌ కవిలోక వీరౌ*
*మిత్రౌ ద్విజన్మవర పద్మ శరావభూతామ్*

*తేనాంబుజాక్ష చరణాంబుజ షట్పదేన*
*రాజ్ఞా కృతా కృతి రియం కులశేఖరేణ.* ౪౦

వేదవిద్యా ప్రతిష్ఠాపకులు, కవిలోకవీరులు అగు 'ద్విజన్మ పద్మ శరులు' ఎవరికి మిత్రులై యుండిరో, ఆ పుండరీకాక్షు పదాంబుజ భృంగ మగు కులశేఖర మహారాజు ఈ కృతిని నిర్మించెను.

కులశేఖరునకు ద్విజన్మవర - పద్మశరు లను ఇద్దఱు మిత్రు లుండిరి. ఆ ద్విజన్మవరుడు వ్యాసుడో, వాల్మీకియో అయి యుండవలయు ననియు, పద్మశరుడు - శఠగోపులు అను ఆళ్వారు (నమ్మాళ్వారు) అనియు పెద్దలు చెప్పుచుందురు. అందు - కవిలోకవీరు డనుటచే, ఆదికవి యగు వాల్మీకియే ద్విజన్మ వరుడని, ఆయన శ్రీరామాయణ మును వేదోపబృంహణము చేయుటచే, శ్రుతిధరు డని చెప్పవచ్చును. తమిళమున, సంస్కృతమున ప్రసిద్ధు లగు కవులలో శఠకోప - వాల్మీకులు ఆద్యులు కనుక, వారినే యిచట పేర్కొనెనని చెప్పవచ్చును. శఠకోపునకు - 'మారన్' అని తమిళ నామము. మారు డనగా - మన్మథుడు గావున, దానికి సంస్కృతమున పర్యాయ మగు 'పద్మ శరుడు' అని యిందు ప్రయోగింపబడినది

విశేషార్థము -

ఈ ముకుందమాలను కులశేఖరులు అనెడిరాజు రచించెను. పుండరీకాక్షు చరణము లనెడి పద్మములయందలి మకరందము నానెడి తుమ్మెదవంటివారు. వారికి ద్విజన్మవర పద్మ శరులు ఇద్దరు మిత్రులు. ద్విజన్మవరు లనగా - వాల్మీకి. ఆయన తల్లిదండ్రులనుండి మొదటి జన్మము నంది, వల్మీకమునుండి రెండవ జన్మ నెత్తెను. అందుచే వాల్మీకి ద్విజన్మవరులు. పద్మశరులు ద్రావిడమున దివ్య ప్రబంధమును రచించిన నమ్మాళ్వారులు పద్మశరునకు మారుడు అని పేరు ద్రావిడమున నమ్మాళ్వారులు శఠక, శఠకోపునకు - 'మారన్' అని పేరు. వీ రిద్దరి

గ్రంథములు మన కులశేఖరుల కత్యంతము ప్రీతిపాత్రములు. 'వాల్మీకి రామాయణము', నమ్మాళ్వారుల 'తిరువాయిమొళి' అను ప్రబంధము వీరి కిష్టములు. వారి గ్రంథములు వేదములే యని ఆదరింపబడినవి.

"వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా"

అని, వేదమే రామాయణమై అవతరించిన దని చెప్పుదురు. నమ్మాళ్వారుల నాలుగు గ్రంథములు నాల్గువేదము లని ద్రావిడ సంప్రదాయము. అందుచే, వాల్మీకి శఠకోపులు శ్రుతిధరులు. సంస్కృతములో వాల్మీకి, ద్రావిడమున శఠకోపులు కవిలోక వీరులు. అట్టివారిద్దరు మిత్రులుగా గల మన కులశేఖరులు ఈ ముకుంద మాలను మనకు అనుగ్రహించిరి.



# వైజయంతీ వైభవము

(తొండరడిప్పొడియాళ్వారులు అను విప్రనారాయణ చరిత్ర)

'విద్వత్కవిరాజ'
శ్రీమాన్ కొమాండూరు గోపాలకృష్ణమాచార్యులు

— ౦ —

శ్రీ మండంగుడి చోళ
క్ష్మా మండల మండనాయం బగుచున్
ద్రామిడ సూక్తి 'విశారద'
భూమీసుర నిలయ మగుచుఁ బుడమిన్ వెలసెన్.

ఆ 'విశారదు'నకు హార్వ్యంశ సంభూతుఁ
డగుచు నుద్భవించె నాత్మజుండు
బ్రహ్మ తేజమునను భాసిల్లు నాతనిఁ
బడసి ముదితుఁ డయ్యె బ్రాహ్మణుండు.

తిరునారాయణ పురమున
హరి సన్నిధి కేగి యతఁడు నాత్మజుఁ గోరెన్
కరుణా పరవశుఁ డగు హరి
వరమున జనియించె భాగవతుఁ డాతఁ డిలన్.

ఆదినారాయణుని కృప నవతరించె
నాతఁ డటుగాన విప్రనారాయణాఖ్య
భూమి వెలసెను బితృ దత్త నాముఁ డగుచు
నెల్ల జనులును విష్ణువే యితఁ డనంగ.

మండంగుడి చోళావని
'తొండరడిప్పొడి, జనించి తోమాలెలు పూ
దండలు రంగని కొసఁగుచు
నుండెన్ వైరాగ్య భక్తి యుక్తుం డయ్యెన్.

విధి యుక్తముగ నెల్ల వేదముల్ పఠియించె
సాంగంబులుగ నిజాచార్యు నొద్ద
స్నాతక వ్రతమును సల్పి కృతోద్వాహ
విధి గృహమేధియై వివిధ దివ్య
దేశంబులను దేవదేవుని సేవించి
శ్రీ రంగనాయకు సేవఁ జేయు
నవసరంబున నొక్క యశరీర శబ్దంబు
తత్కర్ణ పాత్ర పేయంబుఁ గాఁగ
నపుడు విన నయ్యె విప్రనారాయణార్య!
మాకు ననిశంబు నవ పుష్ప మాలికలను
గూర్చి యొసఁగుము నీ కేమి గూర్తు మేలు
భాగవత ముఖ్య!' యను దివ్యవాణి యొకటి.

పరిపక్వ స్ఫుటతేక్షు పర్వగళిత ప్రస్ఫీత ముక్తాఫల
స్ఫురితాంతర్ఘన సైకతస్థ నద దూర్మి ప్రవాహోద్ధతయై
సురసింధు ప్రతి యెల్ల వైభవమునన్ శోభిల్లు చోళావనిన్
హరి దివ్యాలయ వప్ర ఖేయములు సహస్ర ప్రోద్భవాంబుచ్ఛటల్.

కావేరీ భుజవల్లరీ పరియుత ద్వీపాముఖ్య దేశంబునన్
భూవైకుంఠము, సర్వ భక్తజన సంపూజ్యంబు, శ్రీ రంగరా
జావాసంబు సమస్త కిల్బిష హరంబై, నిత్య కల్యాణమై,
సేవార్థాగత రాజలోక శిబిర శ్రీయుంగతిన్ యొప్పెడున్.

కావేరీ ద్వయ మధ్య సంస్థిత మహా కల్యాణ ధామంబు, భూ
దేవ వ్రాత కృతాధ్వరాయుతములన్ దివ్యంబు, శ్రీరంగరా
క్షేత్రస్థానము సత్త్వప్రప మగుచున్ దేదీప్యమానాకృతిన్
శ్రీవత్సాంక విశేష తోష కరమై చెన్నారు నుర్వీస్థలిన్.

శ్రీమ ద్రంగనాథాంఘ్రి సేవా కుతూహలాధీన మానసుం డయి విప్రనారాయ
ణుండు దివ్య వాణి యనుశాసనంబున భగవత్కైంకర్యంబు సేయం బూని

రంగ క్షేత్ర సమీపదేశమున నారామంబు నిర్మించి, యా
రంగస్వామి కహర్నిశంబు తులసీ స్రగ్దామ భూషావళుల్
సింగారంబుగఁ గూర్చి యిచ్చుచుఁ గడున్ శేషత్వ కైంకర్య దీ
క్షం గావించుచునుండె భక్తిపరుఁడై స్వస్వామి భావంబునన్.

శ్రీ వైష్ణవ గృహముల భి
క్షా విధ నిజ దేహయాత్ర గావించుచు భూ
దేవ కుమారుఁడు నిజ వ
న్యానపథమున వసించు హరి తత్పరతన్.

మాకంద నవ పుష్ప మకరందమునుఁ గ్రోలి
రొదసేయు కొదమ తుమ్మెదల దమ్ము
పరిపక్వ ఫలభార తరు లతా గుల్మముల్
దూఱి కేరెడు శుక శారికలును
ఒనాముల రసాల తరు లెక్కి వెస నిక్కి
కొసరి గూసెడు గండు కోయిలలును
వకుళ పుష్ప ద్రుమ ప్రకట శాఖల నెక్కి
చెలఁగి కేకలు వెట్టు శిఖి కులంబు

కలిగి రతి మన్మథాశ్రమస్థలి యనంగ
పొలుపు మిగిలెడు నాళ్వారు పుష్ప వనము
రంగయాత్రాగతాగత ప్రవణ పాంథ
జానపదులకు విశ్రమ స్థాన మయ్యె.

చూతమె! డాసి చూత వన శోభను బాల తమాల పల్లవ
వ్రాతము నేరఁబోదమె జపా కుసుమోజ్జ్వల కిర్ణిశార సం
పాతి మనోహరంబు వనవాటిఁ గనుంగొను మమ్మ! యంచు ప
ద్యా తరుణీ గణంబు హృదయంబున మెచ్చెను దద్విభూతికిన్.

జిత కాముండు జితేంద్రియుండు నిరత శ్రీమూల మంత్రద్వయు
స్తుతిపార స్ఫురితాధరోష్ఠుఁడును సంతుష్టుండునై మన్మథ
ప్రతిరూపుం డతఁ డాత్మ నిష్కుట లతా ప్రస్ఫీత పుష్పోత్కర
ప్రతిబద్ధోజ్జ్వల మాలికార్హణమునన్ భావించు రంగేశ్వరున్.

దేవ సముం డీ విప్రుఁడు
కోవెల కైంకర్యపరుఁ డకుంఠిత భక్తిన్
సేవించు రంగనాథుని
గావున వర మొసఁగు నితఁడు కారుణ్యమునన్.

అని యా హరిభక్తుని మహాత్మునిగా భావించి త త్పుర జనంబు-

అతని మాహాత్మ్యము నెఱింగి యచటి పౌర
జానపదు లెల్ల వచ్చి త చ్చరణ కమల
సేవఁ గావించును జల సేచనమునఁ
జిత్త ములరంగ వనము పోషింతు రెపుడు.

జ్యోతిశ్శాస్త్ర మెఱుంగును
గౌతమ కాణాద సాంఖ్య ఘన శాస్త్రంబుల్

ఇతిహాస పురాణంబుల
శ్రుతులం దగఁ బాంచరాత్ర సూక్తులఁ దెలియున్.

అనుచు నతని యెడల నతిభక్తి యుక్తుఁడై
చెంత నుండు పల్లెసీమ జనులు
నిత్య మాళువారి నిలయంబునకు వచ్చి
కొలుచు నతని చిత్త మలరు కరణి.

ఆర్య ! మా శిశువున కన్నంబు పెట్టంగ
నరయుఁగదు సుముహూర్త మనుచు నొకతె
బాలగ్రహావేశ పరితప్త యీ బాల
రక్షిఁ గట్టుఁ డటంచుఁ రమణి యొకతె
సతత జ్వరార్తిచే నున్న మాయొక్క కుమారి
శాంతిఁ దెల్పుఁ డటంచుఁ జాన యొకతె
సర్ప విషాగ్నిచేఁ జైతన్య మెడబాసె
విను బ్రోవు మటంచు వేఁడ నొకతె

యహా రసాంబుపు ద తత్కుటీరాంగణమున
నేచియుండెడి నాళ్వారు వీక్షణమున
మార్జనంబున, మంత్ర సంభాషణమున
నయము దను నన్న కష్ట నష్టము లడంచు.

కర్కోటక విషంబు గ్రక్కుచుండెడివాని
రక్షించు 'గరుడ మంత్రము'న నతఁడు
ఆహిక వ్యాధిహర ప్రత్యాహిక జ్వరముల
మాయించు నతఁ 'డపా మార్జనము'న

గ్రహచార గోచార క్లిష్ట దోషంబుల
'నరుణా పారంబు'న నపనయించు
బాల గ్రహంబుల భంజించు నాతండు
'కృష్ణ నామ సహస్ర' కీర్తనమున

శాకినీ భూత రక్షః పిశాచ కలిత
సకల దోషంబులను 'సుదర్శన' 'నృసింహ'
మంత్ర తంత్రార్చనంబుల మాన్పఁగఁ జేయు
భూత హితమును గోరి యా భూసురుండు

ఇట్లు సత్త్వ మయుం డగు వాసుదేవు" యనుగ్రహంబున నిఖిల భూత హితం బగు ప్రవర్తనంబున నమ్మహీసురుం డఖిల జనంబుల కర్చనీయుఁ డయి, భాగవత పరాకాష్ఠ నధిష్ఠించి, యాత్మారామంబున నాత్మారాముం డయి, పాంచకాలిక సేవా పరాయణుం డయి కాలక్షేపంబు సేయుచుండ.

చోళ దేశమునందు నిచోళ పురము
రాజధానిగఁ భావించు రాజవరుఁడు
చైత్ర నవరాత్రి వేళ నుత్సవములందు
ధనముల నొసంగు పాత్రులౌ జనుల కతఁడు.

మఱియు నా చోళదేశంబున –

కల దొక పణ్యాంగన శశి
కల యన రూపోజ్జ్వలాంగి కాముని బాణం
బులలో నమ్మోహనమున
వెలయాండ్రకు మేలుబంతి వెలయుచు నుండున్.

ఆకృతినిఁ జూడ శశికల యనఁగ నొప్పు
'దేవ దేవి'గ పేర్గన్న దివ్య వనిత
ఆట పాటలలోన దివ్యాప్సరసల
యూడలం దన్నజాలు వేశ్యాలలామ.

అలివేణి, దేవదేవియు
కలలం దనమా - న గాన కౌశల్యము సన్
వెలయాంధ్రలోన వీరే
తలమానికములుగఁ గీర్తి తద్దయు వెలసెన్.

అంత వసంత మొప్పెను వనాంత లతాంత మరందలోల సం
భ్రాంత మిళింద బృంద మధుర స్వర ఝుంకృతులన్ రసాల సం
క్రాంత పికద్విజ ప్రకర కంఠ కల స్ఫుట కాకలీ రవా
క్రాంత దిగంతరాళ ముఖరం బయి పుష్పవనాంతరంబులన్.

తలిరుటాకుల మేత దనివు కోయిల కూత
మునరు తేఁటుల మ్రోఁత లెసక మెసఁగ
సారసంబుల కూఁత కేరు చిల్కల మ్రోఁత
రాలు మావుల వ్రాఁత లోలి సెలఁగ
వడి గాడుపుల లీలఁ జలియించెడు రసాల
శాల పల్లవ రాగ జాల మడరె
ప్రసవ బాణుఁడు చేతఁ గుసుమ సాయక మెత్తి
బిసరుహాక్షులపైని కసి మసంగ

ధరణి నూత్న వసంతావతరణ వేళ
దివ్య వనమున నవ పుష్ప దీప్తి లెసఁగ
సరస కాసారముల సిత చ్ఛద గరుత్ప
రంపరాహత విస్వనార్భటులు సెలఁగె.

రమణీయం బగు తద్వసంత సమయారంభంబునన్ జోళ భూ
రమణావాసమునందుఁ జాటబడియెన్ రాజాజ్ఞ చే నుత్సవం
బమరేంద్ర ప్రతిమానభావుఁ డగు నా క్ష్మాధీశుఁ గొల్వంగ నా
రమణుల్ వోఁఋరి నాట్య గాన కళలన్ రంజిప భూమీశుతిన్.

అట్లు వోయి యా యక్క సెల్లెం(డు స్వీయ నాట్య గాన లాస్య లీలా విశేషంబుల నా భూపాలుం బరితుష్టుం జేయం దలంచి రందు దేవదేవి.

కామ కళావిలాసముల క్రమతిరోజ్జ్వల లాస్యలీలలన్
గోమలి మెచ్చ వచ్చరలఁ గొండొకనాఁటి వసంతవేళ నా
భామయుఁ జోళమండల నృపాలుని యానతి గోపకామినీ
భూమికఁ దాల్చి నాట్యమున భూ విభునిన్ ముదితాత్ముఁ జేసినన్.

మణి భూషణాంబరంబులు
గణికామణి కపుడు రాజు కానుక లీయన్
బ్రణతిన్ సెలవున్ గైకొని
యణుమధ్య నిజాలయ ప్రయాణోన్ముఖియై.

తత్ప్రియాణావసరంబున -

తరణికర ప్రసార పరితప్త విసంస్థుల పాంసుజాల దు
ర్భరతర మార్గసీమల నిరంతర మారుతధూత రేణు సం
కర పరిలుప్త దృష్టి నసుఖస్థితి నేగెడు పాంథ వర్గముల్
విరళ జలాశయంబులను వేసవి భీషణ మయ్యె నత్తరిన్.

అంత లతాంత కాంత సమయాంత విజృంభిత చండభాస్కరో
ద్ధ్వాంత నితాంత వహ్నికణతప్త మహాగజయూథగాహిత
ప్రాంత సరోవరాంతరము, భానుకరానలశుష్కవంబు, సం
భ్రాంత ఝషంబు గ్రీష్మ మతి భాసుర మయ్యె వనాంతరంబులన్.

సంతప్తోగ్ర భుజంగ ఫూత్కృత మరుత్సంవర్ధితోద్దామ దా
వాంత ర్వహ్ని శిఖాస్ఫుట జ్జరఠ వేణ్వంత ర్గళ న్మౌక్తికా
క్రాంతానంత దిగంత కీచక మహాకాంతార నిర్వాంత భూ
మాంతఃపాత ఖగాతి భీషణము గ్రీష్మారంభ మొప్ప న్వనిన్.

చండ రయప్రవిష్ట ఘనశైల దరీజనిత ప్రఘోష ము
ద్దండ పరాగ పాండుర లతా తరు గుల్మ విధూననోగ్ర చే
దండ మఖండ రేణుమయ దారుణ మండల మధ్య సంభ్రము
త్పాండుర పత్ర మేర్చెను నిదాఘ సమీర ముదార ధీరమై.

సరస కుసుమర్తు యుగ ముపసంహరించి
సాంద్ర నవమల్లికాట్టహాసములతోడ
నవతరించెను వసుధ భయంకరముగ
గ్రీష్మ సమయ మహాకాలుఁ డూష్మ మెఱయ.

అట్టి భీష్మం బగు గ్రీష్మంబున.

ఆకులు పీడి మ్రోడు లయి యచ్చట నచ్చట నన్న పాదపా
నీకముతోడ శూన్య నళినీ నివహంబులతోఁ, దృషార్దిత
స్తోక మృగాళితో, నమిత దుస్సహ భానుకరాళితోడ ని
ర్భీకములైన నవ్య పథసీమలు కష్టమునన్ గ్రమించుతన్.

కోమల గాత్రవల్లికల కొండల మండెడు కాను దీఁగలన్
కాము మద ద్విపప్రకట కర్కశ కుంభ సమస్తనంబులన్
మోమున ఘర్మబిందు మణిపుంజములన్ వసివాడు మేనులన్
గామిను లేగుచున్ గుతప కాలమునం గని రాశ్రమ స్థలిన్.

తోలుకారు మెఱపుఁ దీఁగల
కలుములు హరియించు మేని కాంతులతోడన్
మొలఁతలు చీఁకటి మ్రాకుల
వెలుఁగు కడన్ దోఁట పొంత విడిసిరి యెండన్.

అప్పుడు దేవదేవి త దారామ రామణీయకంబునకు ముగ్ధురా లఘు యతివేణిం గాంచి యి ట్లనియె -

అక్కరో! చూడవమ్మ వన మయ్యది కన్నుల పండువయ్యె, యిం
దొక్కఁడు గానరాఁడు, మన మూరక యుండఁగనేల? లోన నీ
యిక్కను యెండవేడిమికి యించుకసే పటు విశ్రమింపగన్
మక్కువ యయ్యెఁ, బోద సుమమాల మదేలనె మానినీమణీ!

అని తద్వనాంతరంబు సొచ్చి -

సహకార ఫల రసాస్వాదలోల శుకాంగ
నాలాప ముఖరితాశాంతరంబు
నవచూత రుచిర పల్లవ భోజనాస్వాయి
తానేక పిక కూజితాకులంబు
షట్పద ఝుంకార సాంద్ర గాన ధ్వాన
ఘూర్ణిత ప్రతి శబ్ద కోటరంబు
మధుర శంబరలోల మల్లికాక్ష విశాల
పక్షపాతాక్రాంత పటుహా రవము

పుష్పవన మది హృదయ ప్రమోదకరము
నైనఁ దద్వన రామణీయకము జూడఁ
చలిత నూత్న ప్రవాళ హస్తములతోడ
వనము తముఁ బిల్చునట్లుండ జనిరి వారు.

వరుసన్ బాదులఁ గట్టి నీటఁ దడుపన్ వర్ధిల్లుచున్ మల్లెలున్
విరజాజుల్ మరువంపు మొక్కలును సంపెంగల్ జపా పుష్పముల్
తఱచై తోఁచెడు వీథిలో శుక పిక ధ్వానంబులున్ మత్త బం
భర నాదంబులు మానసంబు హరియింపన్ బోయి యం దొక్కచోన్.

జీర్ణ పర్ణ చ్ఛటాకీర్ణమై నతి భక్తి
యుగు నాత్మ పర్ణగేహాంతరమున
కతిపయ శిష్య వర్గమునకు నితిహాస
పంక్తుల యర్థంబు పలుకువాని

ధవళ యజ్ఞోపవీతంబుతో శుక్లాంబ
  రాశ్లిష్టతను యష్టి నలరువాని
సతత త్రిభాగ ముండిత మస్తక స్థాన
  బద్ధ శిఖా కలాపంబువాని
ద్వాదశ స్థాన పరికల్పితంబు లగుచు
డంబుగా మేన నూర్ధ్వపుండ్రంబు లొప్పఁ
జైల కుశ చర్మ కల్పితాసనమునందు
గనిరి భక్తాంఘ్రిరేణు విగ్రహ మునీంద్రు.

తిరుమణి పదములు గళమున
దఱచైన పవిత్రములు సుదారత మెఱయన్
బరువంబున వైరాగ్య
స్ఫురణన్ వెలుఁగొందు వైష్ణవునిఁ గని మ్రొక్కన్.

అమ్ముని ప్రవరుండు ప్రతివచనం బొసంగక మిన్నకుంట గాంచి, యది వంచనగా దలంచి, దేవదేవి రూక్షేక్షణంబుల నగ్రజ యగు సలివేణిం గని-

వాతికె వైష్ణవుం డితఁడు వచ్చిన కార్య మదేమి యంచుఁ దాఁ
జేరఁగ స్త్రీరి వా కొనఁడు, జిన్నెల వన్నెలనైనఁ జూడఁడే
కోరికలేనివాఁ డితఁ డౌకో! యను మాడ్కిని నున్నవాఁడు, వీఁ
డారయ భీష్ముఁడో? శుకుఁడా? యర్జునుఁడో తెలియంగరాఁ డిటన్.

అను దేవదేవి సావహేళన వచనంబులు విని, యగ్రజ యిట్లు సాంత్వ వచనంబుల హితంబు సెప్పె.

వీరలు వైష్ణవోత్తములు, వీరికి మ్రొక్కిన దప్పఁ గల్గునే
యూరక గర్వ మేలనె? యుత్పల లోచన! రాజు కైవడిన్
భూరి గుణోన్నతుం డయిన భూసురుఁ డీతఁడు వశ్యుఁ డౌనొకో?
నేరము లెంచ కమ్మరో! ముని ప్రవరుం డలుకన్ శపించునో!

రూప గర్విత యగు నా రూప రాజీవ నాకాంత యిట్లు పంతంబు లాడె :-

మేనక వెనువెంటఁ గానలఁ దిరిగిన
  గాధేయు నెఱుఁగవే కమల నయన!
గౌతము నిల్లాలికై సిగ్గు విడిచిన
  కౌశికు నెఱుఁగవే కాంతరాక్షి!
జల మధ్యమున ధీవరుల బాలకై జాలి
  పడు తపస్విని గానవా లతాంగి!
ముని కాంతలకుఁ దొల్లి ముచ్చిచ్చు విరహార్తిఁ
  గృశియించు నెఱుఁగవే కీరవాణి!

ప్రాయ మంట! పుష్పవాటికా వాస మంట!
మన్మథునివంటి రూపసంపదలవాఁడు
మేనకను మించు నాబోటి మించుబోఁడి
గన్న, జపములు గిపములు సున్నకావె?

రవి సమతేజులైన మునిరాజులు యోగపుటుంపు నావలన్
భవజలరాశి దాటు నెడ భావజ వాయు సమీరితంబులై
యవి దివిజాంగనా కుచ మహోద్రి శిలాహతి ప్రవ్యథలై చెడన్
ప్రవహణ శూన్యలై తుదకు భగ్న మనోరథు లౌట జూడమే!

మండిత మస్తకంబుపయి ముంగురులన్ గయిసేయకుండునో!
దండలుఁ బాఱవైచి సుమ దామములన్ గళసీమఁ దాల్పఁడో!
నిండిన కావి దోవతులనే ధరియించెడు వీడు పాండు రా
ఖండ దుకూల ధారి యయి కాంతరో! కాముని బారి ప్రగ్గఁడే!

వెండియు - రూపజిత రంభ యగు నా గుణకామణి యగ్రజుం గని యిట్లని ప్రతిన గావించె :-

కమలాక్షి ! మత్పాద కమల లాక్షా రేఖ
శ్రీచూర్ణ పునరుక్తి సేయదేని
శ్రీమ దష్టాక్షరీ చింతనా పూతమౌ
నధరంబు సీధువు నానదేని
మహితాక్ష వలయ మస్మత్కుచాభోగ చం
దన కర్దమంబునఁ దడియదేని
ఘన బాహుమూల చక్ర శ్యామికా రుచుల్
నేత్రాంజనము సంధింపనేని
దేవదేవుని గొల్చు భూదేవుఁ డితఁడు
దేవదేవిఁ గొల్చుచుఁ దిరుగఁడేని
అక్క ! దాస్య మొసఁగు నీ కాలు నెలలు
ఉభయులకుఁ బంత మిదియచు మ్ముత్పలాక్షి !

అని పంతంబు బాడి, దేవదేవి భాస్వ ద్వేషంబు వర్జించి, భక్త వేషంబు ధరియించి,భక్తాంఘ్రిరేణు చరణ సేవాయత్త చిత్తయై, యాతనిం గొలువ వచ్చి .

నవ సంధ్యారుణ చేలమున్ గటి తటిన్ సంధించి, దివ్యాంగ సౌ
ష్ఠవ మించించుకఁ దేటతెల్లముగ భూషాశ్రేణి వర్జించి, చెం
దొవలన్ మించెడు పాణి పల్లవములన్ దోఁటన్ బనుల్ సల్పుచున్
జవరా లాతని చిత్తవృత్త్యనువృత్తి కాంక్షన్ జేసెఁ గైంకర్యముల్.

రవి కిరణాళికిన్ జొరగరాని వనాళిని బాటఁ గోయుచున్
నవ తులసీ వనంబుల కనల్ప జలంబులు సంఘటించుచున్
గువలయ పత్రనేత్ర నిజ కోమలగాత్ర లతల్లతా రుచుల్
దవిలి తమాలకుంజ జలదంబులఁ బర్వగ సంచరించుచున్.

ఫాలమునందు ఘర్మకణ బిందువులు మౌక్తిక శోభఁ దాల్పఁగా
బాల జల ప్రపూర్ణ ఘటభార వినమ్ర శరీర యష్టియై

కాల భుజంగ కల్ప మయి గాఢ నితంబము పైని వేణి గై
వ్రాలఁగ నాలవాలముల వారి సవారిగఁ దోయుచుండెడిన్.

వను లిట్లా నవమోహనాంగి సచరింపగన్ గాంచి యయ్యాళువా
రనియెన్ దా నొకనాఁడు, కాంతరో! యిదేమా రామకైంకర్యముల్
ఘన భక్తిన్ సలుపంగ నేల? చనుమా కల్యాణి నీ యింటికిన్
అవమానింతురు లోకు, లేల యిటు నీ కాయాసకృత్కార్యముల్!

రంగని కైంకర్యంబుల
కంగన! మీవంటివార లర్హులఁగా రీ
చెంగట నిలువం దగదు శు
భాంగిరో! పని యేమి నీ కహర్నిశ మిచటన్ ?

చానరో! శిష్యులున్ మదిని సందియ మందఁగ మేనికిన్
గాసి పనుల్ ఘటింపకుము - కర్కశ కాయము గాదు నీది - వి
జ్ఞానము గోరి వచ్చితివొ? శాంత మనస్కులు గానివారి క
జ్ఞానమెగాని చిత్తము వశం బయి నిల్వగు భక్తి సేయఁగన్

రూపమా! క్షీరాబ్ధి లోపల జనియించు
నప్సర స్త్రీలను ననువదించు
తారుణ్యమా! మన్మథ ప్రాణహారుఁడైన
హరున కైననుఁ జూడ నశక్యంబు
కాయ లావణ్యమా! కలశాబ్ధిఁ బొడమిన
చెలువనుఁ దలపించుఁ జిత్తవీధి
ఘన కేశ భారమా! వన మయూర వ్రాత
బర్హంబులకు నుపాసనమయ్యె

జగతి లావణ్యముఁ బ్రోవు సంఘటించి
పద్మ సంభవుఁ డాత్మ శిల్పముఁ జూప
కరఁగి పోసిన సౌందర్య ఖనివిగాని
తరుణి వనరాశి నిన్ను నుత్పలాక్షి !

ఇట్లని యమ్మునివరేణ్యుం డనన్య సామాన్యం బగు నాయమరూపరేఖా విలాసంబులనేక విధంబులఁ గొనియాడి వెండియు

వటువుల చదువులు చెడునో !
పటు బద్ధులమైన మేము ప్రాల్మాలెదమో !
యిట నిల్వఁ దగదు పొమ్మిక
వటు మాయము లేక సెప్ప మాటలు సుమ్మీ !

అని దూర దర్శి యగు నా విప్రయోగి పలుక, దేవదేవి యిట్లని సవినయంబుగ సమాధాన మొసంగె

స్వామిరా ! మీ పద పద్మము
లేమర కుండంగఁ గొలువ నే తెంచితి, నే
పామరత రాను - లక్ష్మీ
ధాముసకు - మీకు భేద దర్శన మెఱుఁగన్.

తన విద్యన్ వదలంగలేక తొలుతన్ దార్క్యత్రిక ప్రక్రియన్
ఘన పాండిత్యముఁ బూనియున్ దుదకస త్కల్పంబు గావించితిన్
జననీ వాక్యము నమ్మి పణ్యవనితాచారంబు భావించి వం
చన నార్జించితి విత్త మందులకుఁ బశ్చాత్తాపమున్ బొందితిన్.

మనువంశ భూపాల మహితార్చనారూపు
విభు రంగనాథు సేవించు దాన
శ్రీశ భక్తాంఘ్రి సంసేవల ముద్రూప
శీల సంపదల వెచ్చించు దాన

ఘన పుష్ప మాలికా కైంకర్యములకునై
కరములు వినియోగ పఱచు దాన
స్వాచార్య సదుపాసనాచారములచేత
దినచర్య సాగింప దివురు దాన
నొక్క ప్రొద్దుల నుపవాస ముండు దాన
నాదినారాయణుండె దైవ మనెడు దాన
ననుచు నిశ్చయ బుద్ధినై యనఘ ! నేను
వచ్చితిని నేఁడు మీ పదాబ్జముల కడకు.

"తిరు మాల" నభ్యసించితి
తిరు మంత్రము జపము సేసి తీర్థము లందున్
దిరునాళ్ళ సేవఁ జేసితిఁ
దిరువారాధనము కేనఁ దీర్తును ఘనులన్.

రంగని కైంకర్యమునకు
సంగతిగా నేనుఁ గూర్తుఁ జక్కని దంపల్
మంగళ హారతిఁ బాడుదు
సంగము వీడితిని వేరొదు సంగమె దిక్కా.

జలముల శీర్ణ పర్ణముల శాకములన్ ఫలమూల భుక్తిచే
బలిమిని కాయ శోషణ మవారణ సేయుదుఁగాని, యింకనేఁ
గులటను గాను సుమ్ము ; శతకోటి కఠోరము మానసంబు, మా
కులమున బుట్టి లే జిగురు కొమ్మకు నైనను జేవఁ గల్గదే !

అను న మ్ముదిత బలుకుల నాలకించు న మ్మునీంద్ర ప్రవరు ఛాత్ర వర్గంబు మనంబున నక్కుటిలాలక మాయావినిఁగా వెలకామినిగా నెఱింగి, దాని యునికి నెంత

స్తోత్రంబును సహియింప నోపక మిగుల గినియ, నం దొక్క గడుసరి శిష్యుం డిట్లనియె :—

విట భుజాశ్లేష సంపీడిత స్తన ఘనా
  భోగంబు కాయ మీ భోగినులకు
పల్లవ సీధు సంపర్క కర్కశ దంత
  ఘాతితం బధర మీ జాతి కెపుడు
ఖర నఖాంక శశాంక కవి తాప ఘనము లీ
  వెలయాండ్ర నెమ్మేని విలసనములు
హాస్య లీలా లస ల్లాస్య కేళీ విలా
  సములచే నార్థ్య వంచనమె విద్య
జార విట ధూర్త చోర ప్రచార భూమి
తాంగణంబులు వారాంగనాలయములు

వేశ్య వాటిక యొప్పు మీ వేషములకుఁ
దగదు మీ కాశ్రమాంతర స్థలము తగదు.

తిలకంబు రకముగా దిద్ద నేర్తువు గాని
  కలశంబు మోయంగ గలవె నీవు?
చింగులు వారంగ జీర కట్టెదు గాని
  రంగని సేవ సేయంగ గలవె?
సొగసుగా జడ నల్లి సుమము బెట్టెదు గాని
  తోమాల లెట్లు గూర్తువు లతాంగి?
వీటికా గంధముల్ వెలయఁ జిమ్మెదు గాని
  గంధముల్ గలుపంగ గలవె నీవు?

ప్రకట ఘట చేటికా పరంపరలచేతఁ
బసఁ గొను పాణిఁ బలుగును బట్టఁగలవె?

తోయ్యలీ! మోసగింపకు మయ్యవారి;
వలకు నీ సాయ మిట, మాకు వలదు వలదు.

బలిభు ద్భుక్త విస్రస్త బీజములు దేవస్థాన వైమానిక
స్థలమం దంకురముల్ ఘటింపఁగ దృఢాశ్మ స్నిగ్ధముల్ దేవతా
కులముల్ కూలున కాదె? వేశ్యలకు మాకున్ బొత్తు చేకూరునే
కలికీ! యాశ్రమ సీమ నీవు నిలువం గా నేల వాదం బికన్.

స్వామీ! యోగ నిరూఢ చిత్త మతి వేశ్యా లోలతం జిక్కునే?
తా మీ కామిని కాశ్రమ స్థలమునం దావీయఁగాఁ జెల్లదో
భామా! పొమ్మిక, మీ గృహాంగణమునన్ బ్రస్ఫీత చూత ద్రుమ
స్తోమాకీర్ణ వనంబు లేదె? వను లచ్చో నిర్వహింపం దగున్.

వేదాభ్యాస విశేష పూత రసనావిఖ్యాత శక్తుండు – కా
మాది ప్రస్ఫుట దోష దూరుఁడును – శ్రీమ ద్రంగనాథాంఘ్రి సే
వా దక్షుండు భవాదృశ ప్రకట రూపాజీవరాజౌనన్
మోదం బొప్ప గ్రహించునే? చనదు పో! ముమ్మాటికిన్ నిల్వఁగన్.

అపుడు విప్రనారాయణుం డిట్లనియె –

వానప్రస్థుల మైన మాకు ధనమా! వానంబులా! భృత్యులా!
మేనం దాల్ప దుకూల పట్ట యుగమా! మృష్టాన్నమా! భేరికా
ధ్వానంబా! వటు కాహళ స్వనములా! పద్మాక్షి! ఆచార్యక
శ్రేణిం గూడి ధనార్జనంబు సలుపన్ యోజింతువా కామినీ!

అనవుడు నయ్యువతి యానన తల వంచి, కాలివేల నేల వ్రాయుచు, నల్లన నిట్లనియె

తులసీ మాలలతో వాలుమునకున్ దోరంబుగా నీరముల్
కలశంబున్ గొని పోయుదానఁ బనులన్ గావింతు మీ తోఁటలో

వెలయాలన్ దొలు జన్మ పాపమున; నా విఖ్యాత విజ్ఞానినై
గొలువన్ వచ్చితి మీ పదంబుల, నొసంగుం డార్య! మంత్రార్థముల్.

అంత విప్రనారాయణుం డిట్లని ప్రత్యుత్తరం బొసంగె –

తిరుమణి, తిరుచూర్ణంబులు,
తిరువడములు, తీర్థపాత్ర, తిరువడిగళులున్,
తిరుపణ్యారము, కోవెల
తిరువీసము నీకుఁ గలదె తెలవా మురియున్!

రోవెలదుల భాగ్యంబులు
దేవతలకు నైనఁ గలవె? దివ్యాంగన లీ
కోవెల నాదం గంటిని
వావిరి సంపదలుఁ గలవు వారల కెందున్.

పలుమారున్ ద్రవిడాగమంబుల హరిన్ బాడంగ నే నోర్తు, కో
వెల కైంకర్యము సేయఁజాలుదును, కావిన్ దోవతిన్ గట్టుచున్,
వెలయాం డ్రన్నను సేవగింతు నలివేణీ! మా కడన్ నిల్వఁగా
నెలవీయంగను రాదు ధూర్తులు కదా శిష్యోత్తముల్ మానినీ!

అని యి వ్విధంబున విప్రనారాయణుం డా మానినీమణి నెంత వారించినను వినక, నామె నయ వినయంబులతో నా ముని వరుని మఱి మఱి వేడ, నెట్టకేల కతి కష్టంబున నామె యునికి కంగీకారం బొసంగి, యాతం డిట్లని యాదేశించె

ఐనం గానిమ్ము భవ
ద్దీనత గని యొప్పుకొంటి దేవీ! తులసీ
కాననమునఁ బనిఁ గొను మీ
యే నొసఁగుదు భాండ శేవ యింతీ! నీకున్.

అదె మత్స్వర్ణ గృహంబు చెంత సహకారారామ మధ్యంబునన్
పదిలంబై నెలకొన్న వాస కుటి రమా పద్మాక్షి! నీ వచ్చటన్
సాదర మొప్పన్ నివసింపవచ్చును సమిత్పుష్పంబులం గూర్చుచున్
మృదు రీతిన్ బరిచర్య సేయు మబలా! మే లయ్యెడున్ నీ కిటన్.

అంత నా గడుసరి శిష్యుం డిట్లనియె –

అంగీకార మొసంగినారలుగదా యాళ్వారు లో యమ్మ! నీ
సంగీతంబులు, నాట్య లీలలును మా సాన్నిధ్యమం దొప్ప నీ
రంగస్వామికిఁ బూల మాలికలు నారామంబుఁ గైంకర్యముల్
చెంగావుల్ మఱి దోవతుల్ గలవు నీ సింగారముల్ వీడుమా!

అని శిష్యునకు విప్రనారాయణుం డిట్లనియె –

అబ్బాపైఁ గోపించకుమయ్య నీవు
భూతదయ లేని చదువులు బూటకములు
హరి కటాక్షంబు గలిగిన యపుడ కలుగు
సకల జనులకు నాధ్యాత్మికానురక్తి.

పరమాత్మునందు రక్తియు
విరసత్వ నిరూఢి సర్వ విషయములందున్
హరిపాద భక్త సేవయుఁ
గర మరుదుగఁ గల్గు నృహరి కారుణ్యమునన్.

కాంతలు మోక్ష విదూరలె?
యంతయు జైనాభిరతిని నటు బల్కుట యై
కాంతిక భక్తిని ముక్తిన్
జింతనమునఁ జింతయంతి జెందదె శిష్యా!

తరుణీ! శిష్యులు ధూర్తు లంటకు నిదే తారార్కాణమా, నీవు మా
కరుణావృష్టికిఁ బాత్రమైతివి గదా! కానిమ్ము, శిష్యోత్తముల్
తిరుణాట్లాఘవుఁ గోపగింతు రదియున్ దక్ష్యంబు, శాంతాత్మవై
హరి కైంకర్యము సల్పుచుండుము మదీయాజ్ఞానుసారంబుగన్.

ఇట్లనుమతి వడసి, యా యింతి కైంకర్యములు సలుపుచుండ, నాఱు మాసములు చన, విప్రనారాయణుం డెట్లును వశ్యుండు గాక యుండ, విఫల మనోరథయై, యొక్కనాటి నిశీధంబునఁ బర్ణశాల బహిర్ద్వారాళిందంబున శరణాగత తంత్రజ్ఞుం డగు హరిని సమీహితార్థ సిద్ధికై యివ్విధంబున వినుతించె —

మాసము లాఱు చెల్లెను రమాధవ! కుబ్జకు శక్కటీ వహో!
భూసుర పుంగవుం డితఁడు పూరికి నైకొనఁ డస్మదీయ వి
న్యాస విశేష రూప గుణ హాస లసన్నటనా విలాసముల్
ఈసున దోస మెంచకు హరీ! ప్రతినన్ జరితార్థఁ జేయవే!

నాకల్యంబున నీవు షోడశ సహస్ర స్త్రీలఁ గామింపవే?
ఏక స్త్రీ నిరతుండవై జనకజన్ హేలా గతిన్ బొందవే?
ఆ కళ్యాణ తనూ విలాసముల కత్యాహారమా రూపమున్
వీఁకన్ భార్గవరాము చిత్తము వహో! వీక్షించితిన్ నేఁ డిటకే.

మతి చెడి శపథము చేసితి
కృత కృత్యనుఁ గాకపోతిఁ గృష్ణా! కుబ్జా
సతి నేలిన నీవే యిఁక
గతి నా కని నమ్మితిని జగన్నుత! శౌరీ!

గాండివి సైంధవుం దునుము కాలమునందు ప్రతిజ్ఞ నిల్ప, నా
ఖండలసూతికై రవినిఁ గప్పవె గాఢ తమంబుచేత నో
యాదవచూన! నా కయి మహాత్ముని జ్ఞాన రవి ప్రకాశమున్
జెంది తమోఘనం బితని చిత్తమునన్ వెలయంగఁ జేయవే!

హరి భక్తుం డితఁ డింక నాకు వశుఁడౌ నట్లీవుఁ గావింపవేన్
గరళంబుగ్ గొనిగాని, దీవ్ర హుతభుగ్ జ్వాలావళిం గాని, బం
ధుర పాశంబునఁగాని కాయము సముద్ధూతంబు గావింతు నే
నరవిందాక్ష ! ఘటింపుమయ్య నిజ భక్తాంఘ్రిద్వయీ శేఖరున్.

పరభక్తి నిట్లు వేడిన
వరదుఁడు కలలోన నపుడు ప్రత్యక్షంబై
తరుణీ ! దుఃఖింపకు మత్
కరుణన్ నిజకార్యసిద్ధి కలిగెడు ననియెన్.

అట్లు స్వప్నంబున రంగనాథు దివ్యవాణి శ్రవణ గోచరం బగుటయు, నాయమ మేల్కాంచి, నిజ కార్య సిద్ధి భగవదనుగ్రహంబున నగు నని సముత్సాహ వికసిత మానసాబ్జయై, స్వప్నగత వృత్తాంతంబునకు విస్మితయై మననంబు సేయుచు న్నంత, నఘటనాఘటనా శక్తుం డగు రంగనాథు ననుగ్రహంబున –

గగనాభోగము నిండి వారిదము లుగ్ర ధ్వానముల్ సేయుచున్
బ్రగతిన్ నీరము గుమ్మరింప, బిడుగుల్ రాలన్, మరుద్ధూతమై
నగముల్ కూకటి వ్రేళ్ళతోఁ బడ, మహానాదంబునన్ గాతగుల్
నెగ డొందంగఁ బ్రచండ వృష్టి గురిసెన్ విద్యు[illegible] దీప్తులన్

పటు వజ్రపాత నిష్పత దద్రి శిఖర సం
ప్పిష్ట భీమాభోగ విషధరంబు
ఝంఝా మరుద్భూత సాల హింతాలాది [illegible]
తరు లతా గుల్మ దుస్తర పథంబు
భూరి ధారాసార పూర సంప్లావిత
స్థల జలాద్వయ సిద్ధి దర్శనంబు
వర్షార్తి తాక్లిన్న బహు పక్షి మృగ సమా
క్రాంత పర్వత గుహా ప్రస్తరంబు

కాల జీమూత నిబిడాంధకార లుప్త
శైల సాగర భేద విశ్వ ప్రపంచ
మగుచుఁ బ్రావృట్పయోద ధారా నిపాత
మపుడు భీషణ మయ్యె న య్యాశ్రమమున.

అంత దేవదేవి శార్వరి ని ట్లని సంస్తుతించె -

ఘన శూన్యంబులు వన్య మార్గములు దిక్చక్రంబు కాదంబినీ
స్తనిత ధ్వాన భయంకరంబు పటు దైత్య క్రూర సంచార భీ
షణ మీ ధ్వాంతము గాఢ నిద్ర మునిగెన్ సర్వ ప్రపంచంబు నా
జననీ శార్వరి ! వైష్ణవాంఘ్రి సరసీజ ద్వంద్వమున్ జేర్పవే !

ఘన సాంద్రం బగు నంబరంబున చెన ల్గంపింప, గాఢంబిని
నినదంబుల్ హృదయ ప్రభేదకముగా నిర్ఘాత పాతంబులన్
ఘన నాలంబులు నేఁడు గూడఁగ మహోగ్రంబైన వర్షంబునన్
వనితా రత్నము చేరె వైష్ణవ కుటీ బాహ్యాంగణాళిందమున్.

వర్ష మారుత వైద్యుతార్భటుల కులికి
యబల యే మయ్యెనో యనాభ్యంతరమున
కారుఁ జీకటిఁ గ్రమ్మి దిక్తటములందుఁ
బిలుతుఁగా కని తెఱచెను తలుపు నతఁడు.

నీల పయోద మండలి విసర్పల లీల వెలుంగఁ జేయు శం
పా లత వోలె పర్ణ గృహ బాహ్య గతాంధ తమిస్ర పుంజములో
చీలికలై వెలిం బడఁగ శీత మయూఖ నఖాస్య శోభతో
బాలిక నిల్చెఁ గట్టెదుట భావజ మోహన బాణమో యనన్.

జడి వానం దడియన్ దుకూలము నిశా సంపర్క సౌభాగ్యముల్
వెడలం జిమ్ముచుఁ దప్త కాంచన తనూ విన్యాస లావణ్యముల్

కడు నొప్పున్ నిజ పర్ణశాల మొగసాలన్ నిల్చి సబ్బాల నో
పడతీ ! లోనికి రమ్మటంచనియె నాళ్వారుల్ కృపానమ్రతన్.

స్వామీ ! మీ గృహదేవతార్చన మదే శంకింతు రా లోనికిన్
ఈ మూలన్ జలపూర్ణ కుంభముగదా ! యే లీల రా గల్గు నా
కా మూలన్ నుడి వేష్టవల్ గలవు దివ్యగ్రంథముల్ భాష్యముల్
మే మెట్లంటఁగవచ్చు ? వేశ్యలము కామే ? దేవ ! రా జెల్లునే ?

స్వస్తిక బాహుబంధయును, సన్నత వక్త్రియు, దంత వాద్యయై
మస్తక మొప్ప వాల్చి గృహ మధ్యమునన్ నిలుచున్న బాల న
య్యాస్తిక శేఖరుండు గని, యబ్జముఖీ ! జలకీర్ణ వేణి ! నీ
హస్తములందు బిందుకొను మంబరమున్ సవరించుకొమ్మనెన్.

స్వామీ ! మీ కెవ్వ డన్నినాళ్ళ కిటు నాపై వచ్చె నిర్హేతుక
వ్యామోహం బిది చేతనావనము మీ వ్యాపారమా గాదె ! మీ
నామోచ్చారణమే పవిత్ర మగు మంత్రం ధ్యాన మాళ్వారు లీ
భూమిన్ బుట్టుట భక్తి మార్గమును సంబోధింప నౌనే కదా !

మఱి మాన్యంబులు లేవు మా కిచట భామా ! స్థండిలాకీర్ణమై
గుడిపా రిచ్చిన జీర్ణ కంథయ గదా ! కోరంగనా శయ్య, మీ
కుడిపా రిట్టి దరిద్ర శేఖరుని భక్తం బంచు మన్నింతురే !
మడి గట్టన్ దడి యారఁబెట్టుకొన లేమా ! లేవు పుట్టంబులున్.

అని యివ్విధంబున బరస్పర సముచిత సంభాషణంబు సల్పిన యనంతరంబు దేవదేవి స్వప్నంబున సాక్షాత్కరించిన హరిని తన మనంబున నిల్పి యిట్లని ప్రార్థించె -

వామ భుజాగ్రపీఠ పరివర్తిత వామ కపోల భాగమై
వామ కరాంగుళీ సుషిర పర్వములన్ వెస మార్చి పుచ్చుచున్

కోమల వేణు గానమున గోప వధూ హృదయాబ్జ సీమలన్
గామ మరంద నిర్ఝరము గ్రాల నటించెడు మూర్తిఁ గొల్చెదున్.

కలలోనన్ నను గాంచి 'నీ కొసఁగితిన్ గళ్యాణి! యిష్టార్థ' మం
చలవోకన్ బలుకంగ వింటినిగదా! యబ్జాక్షుఁ డ శ్లాటకున్
గలుగన్ జాల దసత్య శంక యిపు డీ నారాయణుం డాత్మలోఁ
గలతన్ జెందు నటంచు నెంచెద మహోగ్రంబైన వర్షార్భటిన్.

ప్రవిశుద్ధానన చంద్రదీప్తిగృహా దీపచ్ఛాయ మాయించుచున్
సవిధ స్థాయినియా నవన్య తరుణీ సౌందర్య మత్యంత చి
త్ర వికారం బొనరించి ప్రతుంచెను లవిత్రంబై, తన శ్నొచ సం
భవమా వైష్ణవ మాని ధైర్య లతికా పాశంబు న త్యుద్ధతిన్.

హరి పదాబ్జముల నత్యంత భక్తిని గొల్చు
 ముని దృష్టి కాంత నెమ్మోముఁ జేరె
వన పుష్ప మాలికా కరణ ప్రవణముతో
 కరములు సాధ్వస కలిత మయ్యె
యోగాసనారూఢ యుక్తి నిశ్చలమైన
 పద యుగ్మమునఁ దొట్రుపాటు గలిగె
సంతతాష్టాక్షరీ జప పరాయణముతో
 పెదవుల నవ్యక్తి పదము వెడలె

కామినీ భ్రూలతా చాప ! లిత కాత
వీక్షణాశుగ వేగ నిర్భిద్యమాన
ధైర్య వర్మ ప్రలుప్తాంగ ధారియైన
ధరుణి సురునకు - వైష్ణవోత్తమున కపుడు.

శ్రీమ ద్భక్త పదాంఘ్రిరేణువును వంచింపంగ నేతెంచి యా
భామారత్నము చెంత నిల్వ వదనాబ్జ జ్యోత్స్న నుప్పొంగుచున్
వ్యామోహాబ్ధి తదీయ ధైర్య సికతా బంధంబు ఖండింప నా
భూమీదేవుఁ డనంగ బాణహతి నుద్భ్రాంతాత్ముఁడై తూలినన్.

అంత నా యదను గని య వ్విలాసిని యనంగ రంగోద్దీపనంబు సేయ సమకట్టి, రాధా మాధా రహః కేళీ విలాసోపన్యాసరూపాఖ్యానా సేచనం ద స్మతి మనోగత మన్మథానిలంబు నిట్లు ప్రజ్వలింపజేసె.

ఒక పౌదరింటిలోపల మహోజ్జ్వల వేష విలాసి యైన గో
పిక నొక దానిఁ గూడి యదువీరుఁడు భోగ రసైక లోలుఁడై
సుఖమున నుండఁ జూతురె? యనూయను గోప నితంబినీ మణుల్
అకట! యొకింత సిగ్గు వలదా హరి! మానవతీ లలామకున్.

రాగోద్రిక్తయె రాధ గోపికల కెల్లన్ బొత్తుగా నున్న త
ద్భోగం బంతయుఁ దానె కైకొనెఁగదా పూఁబోణియే జాణ యు
ద్వేగార్తిన్ యమునాంతరీపసికతా విన్యస్త శస్తాంగలై
యా గోపాంగన లెట్లు కృష్ణ విరహాయాసంబు సైరించిరో!

ధారాసారము ఘోరమై కురియ రాధామాధవుం డార్తులన్
ఏ రీతిన్ వ్రజ సుందరీమణులఁ దా నేలెన్ భుజచ్ఛాయ నేఁ
డా రీతిన్ నను నేలినారలు మహాత్మా! యీ ఋణం బెట్లుగా
దీరున్? మీ పదసేవ నా కొసఁగి సంతృప్తాత్మగాఁ జేయరే!

అంత విప్రనారాయణుండు -

వనితా! నీభుజ పంజరాంతమునన్ వర్తింప దేవేంద్రుఁడున్
గను సౌఖ్యంబున నింక మాదృశులకున్ గాంక్షల్ మదిన్ బుట్టవే!
కని గొందున్ నిను బ్రహ్మచర్యమునకున్ భంగంబు గాకుండినన్
నను రంగేశ్వర దాస దాసు నడఁదన్ గామింతువే కోమలీ!

తరుణి వసన్త కాంతవు, సుగార చరిత్రవు, నాటు మానసమున్
పరిపూర్ణ మెప్పుఁ జేసితివి వానవ లోక విలాసినీ మణుల్
సరి యనరాదు నీ కయిన శౌరి కథా రస లోల చిత్తమే
కరఁగని మార సంభవ వికారములన్ గఁగునే దలోదరీ!

బాల మృణాళ తంతువును బాఱని నీ కుచ మధ్యమందు నీ
లాలక లగ్నమైన హృదయాంబుజమున్ మరలింపఁజాల నో
బాల! ధనుంజయాత్మజుఁడు వైరులు గన్నిన తమ్మి మొగ్గరం
బాలము సేయఁజొచ్చినటు లయ్యెను వెల్వడ నేర్పు చాలమిన్.

కాంచన కుంభ గౌరవము గాంచి, భుజ ద్వయ పువ్వుమాలికో
దంచితమైన చందన రసార్ద్ర భవ త్కుచ మండలంబు నా
హించెద కుంచపాయకున కైత్రిన మంగళ కుంభ యుగ్మకం
బంచు మదీయ చిత్తమున బోయన మాత్ర కురంగ లోచనా!

ఆయత పల్లవ చ్ఛద నవారుణ దీప్తి వహించు విప్రనా
రాయణ పాద పంకజము హస్త తలంబున మెత్త నొత్తు న
బ్జాయత లోచనం గనియు నాతఁడు వల్దనఁ డయ్యె కామ బా
ణాయిత తత్కటాక్ష నిశితాశుగపాత విలుప్త ధైర్యుఁడై.

తరుణార్కోజ్జ్వల రాగ రంజిత లస త్కౌశేయ దీప్తి చ్ఛటా
చ్ఛురితంబై, తనువల్లి యగ్ని శిఖగా శోభిల్ల వారాంగనా
వపు సంస్పర్శమునన్ గరంగె ఘృతకుంభస్ఫూర్తి నయ్యాభువా
రరయున్ లౌకిక నీతి యట్లగు బురాణాఖ్యాయికార్థంబుగన్.

స్థిర వృత్తిన్ మణి భాజనాంతర తటి ద్దీపాకృతిన్ వెల్గు నా
ధరణీ దేవుని జ్ఞాన దీప శిఖ కాంతా వక్త్ర వాతాంకుర
స్ఫురితంబై, మరణాశుగాంచల గరుద్వ్యాధూత ప్రవాతాహతిన్
రిసెన్, సౌగత శూన్య తత్త్వ మనఁగా నిర్వాణ భూయిష్ఠమై.

శేషాహీంద్ర శయాన భక్తి కనచాశ్లేషంబునన్ గాఢమై
మూషాంత స్నిహితాచ్ఛ కాంచన ఘన స్ఫూర్తిన్ విడంబించుచున్
శేషత్వ స్థిరమైన చిత్త మది విశ్లిష్టాంగమై నీరుగా
రోషా వైద్యుత వహ్నిచేఁ గరఁగ సంయోగ ప్రభావంబునన్.

చల దుర్వీరుహ రూఢమూల రయ ఝంఝూవాత నిష్పేష ని
స్తుల పాత ప్రతిబుద్ధమై జలద సందోహంబునన్ బుట్టు ను
జ్జ్వల ఘోరాశ నిఘాత మొందు సవిధ క్ష్మాజంబులన్ గూల్ప న
య్యలి నీలాలక భీతిఁ డాగెను దదీయాశ్లేష బాధంబునన్.

ఘన సాంద్రం బగు నంబరంబున దెస ల్గంపింప గాదంబినీ
నినద బుల్ హృదయ ప్రభేదకముగా నిర్ఘాత పాతంబునన్
ఘన సాలంబులు నేలఁ గూలఁగ మహోగ్రంబైన వర్షంబునన్
వనితా రత్నము నిల్చె వైష్ణవ భుజా వక్షాంతర స్థాయియై.

హాలహలంబు భంగి హృదయాబ్ధిని బొంగుచు, భావనాశుగా
స్ఫాలితమైన రాగ విష వహ్నికి మూర్ఛిత మానసాబ్జుఁడై
బాల భుజాంతరాళమున భాగవతోత్తముఁ డుండె కాళియో
ర్వ్యాల విశాల భోగ పరివేష్టితుఁడైన మురాంతకుం డనన్.

ఆమూలాగ్ర నిపీడితాధరము వాగ్విద్యాలాప సంతాప ము
ద్దామాలింగన భుగ్న చూచుక కుచాంత ర్మగ్న కందర్పమున్
వ్యాయమ ప్రగాహ్య పరస్పరాంగ కలితా ద్వంద్వార్థ సంపాద మ
త్యామోదావహమయ్యె నత్తఱి రతం బానంద నిష్యందమై.

అంతట గాఢ పీడిత కుచాగ్ర విభుగ్న పయోధరంబుగాఁ
గాంతను దార్చి గండ ఫలక ద్వితయ ప్రతిబింబితాస్యుఁడై
పంతముఁ గోడ ముద్దు లిడె బాల ముఖాంబుజ మంస యుగ్మ ని
ర్వ్యాంత కచాబ్ద పుష్పమును వర్ష నిపాత మనోహరంబుగన్.

ధీర సమీర సంచలిత దీప్ర లతాంత విలీన భృంగ ఝం
కార మనోహరంబు లగు క్రమ రసాల వనాంతరమ్ములన్
భూరి లతా కుడుంగముల బుష్ప వనంబుల దేవదేవియున్
ఆ రసికావతంసుఁడు నహార్నిశ మంగజ రాగ మత్తులై.

దినముల్ మాసము లేగుచుండఁగ సము ద్దీప్తాంగజోన్మాదులై
వన భూమిన్ జనతా విశూన్య కలిత స్వైరానులాపంబులన్
మనసుల్ మేనులు నేకమై తగ సుఖాంభశ్పూర నిర్మగ్నులై
మునియున్ గాంతయు బుచ్చిరొక్క త్రుటిగా పూర్ణాబ్దకాలావధిన్.

వనమాలాంశమునన్ జనించి, హరికిన్ భక్తాగ్రగణ్యుండునై
మను నా భక్తపదాంఘ్రిరేణు వాక సామాన్యపశుం డౌనొకో ?
చన న ల్లివ్వరు నూహ సేయ హరి యిచ్చెన్ జెల్లె నాత్మీయులన్
జనతా మాన్యులఁ జేయఁగోరు హరి సన్నాహంబు లిట్లొప్పెడున్.

నాఁటినుండియు వేశ్య కూటముల్ మరగిన
స్వామివారికి భక్తి సన్న మయ్యె
బూల మాలలు గ్రుచ్చి పూఁబోణి తొడ వైన
వాణి వుటంబులు పాటు పడియె
వనితాననాబ్జ శోభఁ జిక్కి హృదయంబు
హరి పదంబుల దెస కరుగకుండె
గణికా పయోధరా సంకలితమ్మై తన చూపు
పూర్ణ కుంభములపైఁ బోవకుండె
గోపెలకుఁ బోవు దృష్టి సంకుచితమయ్యె
నుంఛ వృత్తికి శిష్యుల నొప్పగించి
స్వైరిణీ సేవ నిత్యంబు సలుపుచుండఁ
గఁ గనిన యట్లు చనుచుండె కాల మపుడు.

ఇట్లాచార్యుండు వేశ్యాలోలుం డగుటచే నధ్యాపనంబు వ్యర్థం బగుట యెఱింగి శిష్యవర్గంబు పరస్పర మిట్లనుకొన నారంభించిరి :-

చదువులు సంధ్యలు లేవీ
మదపతితో నయ్యవారు మరగిరి క్రీడల్
పద పద నిల్వఁగ నేటికి
మదనాతురుఁ డేటి గురువు మాన్యుఁడె యైనన్.

ఉంఛవృత్తి దక్కె నొక్కఁడు మన కింక
వాంఛితార్థ విద్య వాసి చెడియె
నేల బిచ్చమెత్త? నే పేద పల్లెకో
జేర నగును చింత చీకు లేక.

ఇట్లు చింతించి శిష్యకోటి యథాభిమత స్థలంబుల కరుగుటయు, వనంబు నిర్జనం బయ్యె నంత పూర్ణకామ యగు దేవదేవి యాత్మగతంబున నిట్లని తలంచె :-

ప్రతిన నెరవేరె యక్కతో బలికినట్టు
లితని విడనాడుటకు మది నిచ్చగింప
దెట్టులైనను గృహమున కేగవలయు
స్వామి సెలవునఁ బోవుట సమ్మతంబు.

అని యేకాంతమ్మున న మ్మునివరునితో నిట్లనియె :-

ఆయెను వచ్చి మీ కడకు నబ్దము మీ యెల దోఁటలో బనుల్
సేయుచునుండ, మ జ్జనని సేవ యొనర్ప మనంబు గట్టె నేఁ
బోయెద మీదు నానతిని బుణ్య చరిత్ర కృతార్థనైతి, నా
ప్రాయము కొంత మీకు భుజ పంజరమందు గతించెనే కదా!

భాగవతాపచారమున పావనమయ్యె మదీయ జన్మ; ము
ద్యోగము జన్మ సిద్ధ మది ద్రోఁవఁగరా దని యందురే కదా!

భోగ రసైకలోల మగు బుద్ధి మఱల్చుకొనంగలేని బై
రాగికి గౌరవంబెకడ రమ్యగుణాకర ! పోయి వత్తునా !

ఇట్టుల విప్రయోగి యానతిఁ గైకొని దేవదేవి జననీ సందర్శనోత్సుకయై, నిజ గృహంబున కేగుటయు నంత నా హరిభక్తుఁ డహర్నిశ మా యంగన సాహచర్యంబు కలిగియున్న కతన ప్రియా వియోగంబు భరింప నోపక, నిరంతర నిపతిత పంచశర శర వేదనాభరం బసహ్యం బయిన నాయమ పిఱుందన చన, నాతనిం గని పురంబున జనంబు లిట్లని తలంచిరి :—

ఈ సుదతీ శిరోమణికి నీ గతిఁ జిక్కెను నాళువారు ల
య్యో ! సువిశుద్ధ బుద్ధి పురుషోత్తమ భక్తుఁ డితండు వేశ్య దీ
దోసముఁగాక వీరికడ దోచుకొనం ధన మున్నదే మొకో !
కాసుకు రానివాని వెల కామిని గోరుటఁ గాన మెయ్యెడన్.

ఇట్లు దేవదేవి సదనంబు సేరిన విప్రనారాయణుని దరిద్ర నారాయణునిగా నెఱింగి వేశ్యమాత రూక్ష స్వరంబున నిట్లుపాలంభించె.

మీ తిరుచూర్ణ రేఖ లవి మేలిమి బంగరు తీవె లాయెనో !
మీ తిరుకావి పుట్టములు మేలిమి దువ్వలువల్ ఘటించెనో !
యీ తిరిపెంపు బాపల కిసీ ! జడదారుల కేల సాని ? యీ
రాతిరి దాసురాలి దెస రాకుఁడు నాయని పెత్తనం బిటన్.

అని దేవదేవినిఁ గాంచి.

కొమ్మరో ! యీతఁ డేమి నలకూబరుఁడో ! నవ మన్మథుండొకో !
అమ్మరో ! రాజు కొల్వున మహార్ఘ్య మణి ప్రకరంబు గొన్న నీ
కెమ్మెయిఁ జిక్కె నీ విటకులేశ్వరుఁ డీతని రాక యిప్పుడే
సమ్మతిఁ గాదు నాకు నిముసం బిక నిల్వఁగ నీయ నీ యెడన్.

కోరిన భూషణంబులకుఁ గోటి మడుంగులు మెచ్చి యిచ్చు చే
వారులు నీ కదేమి కఱవా? నర వాహనుఁడైన దెత్తు నా
కారము గల్గువాని, కొఱగాని యితం డెవఁడమ్మ నీకు, నా
కూరిమి కూతురా! వలదు కోమలి! యీతనితోడి కూటముల్

అలివేణిం గని నీవు వాకొనిన నీ యానాఁటి పంతంబులున్
చెలువా చెల్లవె? యయ్యవారును భవత్సేవాపరుండయ్యె, ఱా
వెలయాం ద్రందఱు నవ్వ నీ గృహ బహిర్వేదిన్ వసించున్ గదా!
వల పీ వంగడమందు లే దితనితో వర్తింపు సంగాతముల్.

ఖాఁకటివేళినాఁడు మముఁ గోరిరి బాలురు యౌవనంబునన్
బ్రాఁకట వృత్తి వేఁడి నరపాలురు మా వెనువెంట వచ్చి రా
పోకలె వృద్ధ భావమునఁ బోవవి నేఁటికిఁ గన్నెప్రాఁతవం
ద్రి కత లేటికే తపము లేటికె యింతుల మేలుబంతికిన్?

అనిన దేవదేవి యిట్లని ప్రత్యుత్తరం బొసంగ :-

వంతము లాడి తెచ్చితిని పాడ మెఱుంగని యయ్యవారి నీ
శాంత మనస్కుని౯ జెఱచి సర్వ విధంబులఁ బాసినైతి నా
గాంతకవాహనున్ గొలుచు నాతనిఁ జేసితిఁ గ్రీత దాసునిన్
ఎంతకుఁ జేరనీయక యిసీ! వెడలన్ నడిపించు టొప్పునే!

రోవెలందుల బోషించెడి
కోవెల కైంకర్యపరులు కొందఱు గల రా
జీవ సముం డగు నీతని
భావింపఁగ వలవ దట్టివానిగ జననీ!

అను కొమరిత పలుకుల నవకర్ణించి -

దేవదేవిని దిగనాడి దేవ సముని
వెడల నడిచెను నడురేయి వృద్ధవేశ్య
తరుణి నెడబాయలేక వితర్ది మీద
విప్రయోగాకులత నుండె విప్రయోగి.

శీతల వాతపోతముల జీర్ణ పటావృత దేహయష్టి య
త్యాతతలీల తాపమున కాస్పదమై కడుఁ బీడ సేయఁగాఁ
గాతర చిత్తవృత్తి యయి కామ శరాహతి గ్రుగ్గుచుండె భూ
మీతలదేవుఁ డాతఁడు సమీహిత వస్తు వియోగ ఖిన్నతన్.

ఆర్తుఁడు ముముక్షు వర్గార్థి యనెడు పేరు
మువ్వురే శ్రీహరిని గాదు పుణ్యమూర్తు
లట్టుఁ గావున విప్రనారాయణుండు
పరమపదనాథుఁ గాడె నీ పాశురమున.

హృదయవిశుద్ధి లేదు - పరుషేతర వాక్యము బల్కఁజాల - నా
పెదవులఁ బుట్టు మాటలు పవిత్ర విఘాత సమంబు లౌను - కెం
జెదవుల నొప్పు సుందరుల వెంట జనున్ మన మట్లుఁగాన నీ
పదములె నమ్మినాఁడ - సదుపాయ మెఱుంగను రంగనాయకా!

తపము లొనర్పఁజాలను - వృథా జననం బిది - వేశ్యవాటమే
యిపు డొక యాశ్రమంబు మదిరేక్షణ మానసవీధి నిల్చె - నా
జపము తరంబు సన్నగిలె - జారశిఖామణి నైతి - రంగనుం
దపగతివోయెఁ గామ నిగడ ప్రతిబద్ధుఁడ రంగనాయకా!

పరిచిత యోగనిష్ఠ నిజ భక్తుఁడు దన్నిటు బాడుచుండ నా
హారి భుజ మధ్య కంచుకము హార్ద భరంబునఁ బిక్కటిల్లె, నం
బురుహ నిభంబులౌ కనులఁ బొంగె, ప్రమోదమయాంబుపూరముల్
గురిసెను రంగమేఘ మనుకూల కృపారసవృష్టి భక్తుపై.

ఆ సమయంబున :-

కాయచ్ఛాయలు గాఢ సంతమసమున్ ఖండింప, సంపూర్ణతా
లాయామాకఘనంబు భూగగన మధ్యవ్యాప్తమై యుండ ను
చ్ఛ్రాయంబై పటు దివ్య దీప్తి యెదుటన్ సాక్షాత్కరింపన్ నిర
భ్రాయా తాశు తడి ప్రకాశ మని సంభావించె భక్తుం డదన్

త త్ప్రకాశంబు తోడ్తోన తఱిగి తఱిగి
నీల కుంతలయు మూర్తియై నిలిచె నెదుట ;
గాఢ సంతమసంబునఁ గరఁగిపోయె
నెఱుఁగ రాతఁడు శోకాంధహృదయుఁ డగుట

కన్నులు మూసి యాతఁ డతి గాఢ సమాధి నిమగ్నుఁ డయ్యె, నా
పన్న శరణ్యుఁడైన హరి బాలక రూపముఁ దాల్చి నిల్చె నా
యున్నెమిన్న వాకిట మహార్ఘ్య మణిప్రకర ప్రదీప్తమౌ
గిన్నెను బూని, వార నతికిన విన నయ్యెఁ గవాట ఘట్టనల్.

వచ్చె విటుం డొకం డనుచు వార చరాచరితాంగి వచ్చి, యా
పచ్చని వింటిజో దనఁగ వాకిట నిల్చిన బాలు గాంచి యున్
బచ్చల హేమ పాత్రమును పాణిపుటంబునఁ జూచి గారవం
బచ్చుపడంగఁ బల్కె వినయావనతానన వానర ధ్వనిన్.

అయ్య వచ్చినాఁడ నతి విస్మయం బయ్యెఁ
దయ్య విలుతు తండ్రి తీరుఁ దోఁచెఁ
బైడి గిన్నె నేఁడు పార్థివుం డంపెనో
చూడ ముచ్చటయ్యెఁ జూపుమయ్య !

అనుటయు నా వామనుండు :-

గురువు లగు నాభివారలు
గురుతరకృప నంపినారు గొను సిద్ధాన్నన్
అరుదైన హేమ పాత్రము
వరిగద నే వైశ్యమనుచు నయ్యాది యొసఁగెన్.

భర్మ పాత్ర మొసఁగి వరుగిడె బాలుండు
ఆళువారి గాంచి యురఁగుమీఁక ;
జరర పలికె స్వామి! చనుదెంచు లోనికి
తరుణి పిలిచె మిమ్ము దాసురాలు.

ఏమో వార్ధక చిత్తవృత్తి యిది నా కేనాఁటి కెట్లుండునో
స్వామీ! మీరలు శాంత మూర్తులుగదా! సామాన్యపైఁ గోపమా?
శ్రీమంతుల్ కృహావేది నుంటఁ గని నా చిత్తంబు క్షోభించెనున్
భూమీశుల్ దమసాటివా రగుదురే భూమీసురగ్రామణీ!

జరర వనితా సమాహ్వాన శబ్ద మపుడు
కర్ణపేయంబుగా విని కాయజార్తి
తాయ, లోనికి సరిగె నాళ్వారు లపుడు
తెలఁగెఁ గుక్కుటకంఠ కాహళి రవంబు

అరుణ చోదిత సప్త తురగ ఖుర క్షుణ్ణ
ధ్వాంత గైరిక ధాతు ధూళి యనఁగ
ఖండిత మందేహ కాయ నిర్వాహద సృక్
ఝుంర శీకరాసార జాల మనఁగ
సంతరాదిత్య విగ్రహ నిరూపిత నాసు
జేవ కౌస్తుభ రత్న దీప్తి యనఁగ
జంభారి కుంభీంద్ర కుంభ సంభృత సాంద్ర
సిందూర పటల ప్రకాశ మనఁగ

బద్మినీ సూర్య సూత్ర వివాహవేళ
వాసవీ ముఖ కుంకుమస్థాపక మన
చారు చక్రైక సప్తాశ్వ సహిత మగుచు
రవి రథము దోచె నరుణ పురస్సరముగ

జంభారి కుంభీంద్ర కుంభ సంభృత సాంద్ర
సిందూర కాంతులఁ జిల్కు నెవ్వి?
ఉదయ మహీధర ప్రోద్భూత గైరిక
ద్రవ రంజితంబులై దనరు నెవ్వి?
పరిఫుల్ల హల్లక ప్రౌఢ ప్రభాజాల
జటిలంబులై యొప్పు జలద నెవ్వి?
పద్మరాగ ప్రభావ పటలాంకురాస్ఫూర్తి
నుడువీథి భగణంబు నూల్చు నెవ్వి?
అంధ తమసాంతర స్వైర యానధీర
పారదారిక చోర దుర్వార గంధ
బంధురానంత దళన పాణింధమమ్ము
లెవ్వి? యా భాను భానువు లెసక మెసఁగ

పురుహూత ద్విప కుంభ పీఠములపైఁ బోల్పాడు సిందూరపుం
గెరలన్ లేఁదోఁగ రెక్క సిక్కి, యుదయాద్రిన్ ధాతు రక్తౌఘ ని
ర్ఝులన్ దానము లాడి, శోణ రుచులన్ జంభారి దిక్కుంభిని
ఏం మాలిన్ కనుపట్టె భాస్కర కరోద్యత్సాంధ్య రాగ ప్రభల్.

జాతె దమంబు - తామరల సాంద్ర మరందము లూరె - ది
గ్గారము దూర మాయె - ద్విజ వర్గము మేతకు వోయె - దేవతా
గారములన్ సెలంగెఁ బటు కాహళ నిస్వనముల్ - కవేరజా
తీరమునన్ మహీసురులు తీర్థము లాడి యొసంగి రర్ఘ్యముల్.

శ్రీరంగేశ్వరు నభిగమ
నారాధన మాచరించు నర్చకుఁడు కవా
టారరముఁ దెఱచి సన్నిధిఁ
జేరం జని పాత్ర శుద్ధిఁ జేసెడు వేళన్.

కాంచన పాత్రంబుల సము
దంచిత మగు హేమ పాత్ర మచ్చట లేమిన్
వంచన తస్కరు లిది గ్రహి
యించి రటం చెఱుకపఱచె నీశున కంతన్.

నరపాలుఁడు పుర రక్షక
వరునిం బిలిపించి చౌర్య పద్ధతి నెఱుఁగన్
వెరవరుఁ కాజ్ఞ నొసఁగినఁ
బరుపత బంధించి రచటి పరిచారంబున్.

పణ్యవని తాలయంబునఁ బనులు సేయు
కుంభ దాసికిఁ బ్రియుఁడైన కులిటుఁ డొకఁడు
బద్ధుఁడై యుంట నది గాంచి భట కులాగ్ర
గణ్యుఁ గని పల్కె తరుణి దుఃఖమున నిట్లు.

హేమ మయ పాత్ర మార్య! మా యింట నుండె
నాళువారలు బంపె మా యమ్మ కదియు
పద్ధరాత్రంబునం దొక్క యర్చకుండు
వారి శిష్యుఁడ నంచుఁ దా వచ్చి యిచ్చె.

అనుటయు నృపు నానతినిన్
దనుజాలు ప్రహ్లాదుఁ గట్టు త ద్విధ మొప్పన్
దనుజాంతక భక్తుని వన
ఘుని పాళావృతునిఁ జేసి కొట్టియు బెట్టన్.

ఇట్లు నృప శాసనంబున రాజభటులు -

పరుష కశాభిఘాతముల భక్తుని దేహము నొంప బాధలన్
బొరవుఁడు - రక్త రేఖ లటఁ బుట్టవు - తన్ముఖ కాంతి శోభయున్
దఱుగదు - తత్పరత్వమున, దైత్యకులాంతక! రంగనాథ! యం
చురగశయానునిం దలచు నూర్జిత భక్తి ననన్య చిత్తుఁడై.

అంత దండాధ్యక్షుండు పేరోలగంబున నరపాలు మ్రోల నిట్లని విన్నవించె -

బాపఁడు చోరవృత్తి హరిభాజనమున్ హరియించె దాసికై
భూప లలామ! యాతనిని భోగినితోఁ దగఁబట్టి తెచ్చినా
రీ పుర రక్షకుల్, విబుధు లీతని దోష ము నిర్ణయించి యే
రూపున నాజ్ఞ యిత్తురో నిరూపణ సేయుఁడభిజ్ఞ శేఖరుల్.

అని రాజు ముదల యిడిన యనంతరంబ రాజాస్థానంబున నధికరణ ప్రాడ్వివాక సాన్నిధ్యంబున విట విత్త హరణ ప్రవీణ యగు నా జరద్వేశ్య యిట్లని వాఙ్మాలం బొసంగె :-

వామనుఁ డొక్క బాలకుఁడు వారికి శిష్యుఁడ నంచుఁ దెల్పి, మా
కీ మణి భాజనం బొసఁగె నింతియు కాని మఱే మెఱుంగమో
భూమిప! రంగనాథు గృహభూమి దృఢార్గళకీలబద్ధమై
యామిక రక్షితం బగు నయారె! చొరంగ వశంబె మాదృశుల్!

గణికా సంగము నిచ్చగించి, గుడిలోఁ గైంకర్యముల్ మాని, దు
ర్గుణ పుంజంబుల కాలవాల మయి యుతోఁ బ్రచార్థ మీతెండు రం
గని మాణిక్య కిరీటమైన హరి వక్షః కౌస్తుభంబైన తి
న్మణి కాంచీగుణమైన యూరక హరింపన్ జాలు భూమీశ్వరా!

అనుటయు భక్తాగ్రగణ్యుం డగు నమ్మునివరేణ్యు గుణ గణంబుల నూహించి నృపాల శేఖరుం డిట్లని యాన తిచ్చె :-

స్వామీ! మీరలు భక్తశేఖరులు - మీ చారిత్ర మింట్లాట మా
కేమో చోద్యముఁగాఁగఁ దోఁచె, హరిదో యీరీతి గావించెనో!
తామే యిట్లొనరించినారలొ! భవత్సాన్నిధ్యమం దున్న యీ
భూమీదేవకులార్భకుం డెవఁడు? వాఙ్మూలంబుఁ దెల్పం దగున్.

అని పలుక నా హరి భక్తుండు .-

దేవుని సేవ మాని సుదతీమణి నీమెను జెట్టవట్టి యా
దేవికి దేవదేవుని యధీనమునం గల గిన్నె నిచ్చె భూ
దేవుఁ డటంచుఁ దెల్పిరట దేవర! యీ యభియోగ కారకుల్
శ్రీ విభుఁ డిట్లు సేయు నొకొ? శిష్యుఁడు లే డిఁక నాదె నేరమా!

కాదన నమ్మ్రవా రెవరు? కావలివారలచేతఁ జిక్కెఁడా
భూదివిజార్భకుం డెచట వోయిరొ శిష్యుఁ డొకండు లేఁడు, దా
మోదరు గిన్నె తథ్య మది యుగ్మలి యింటనె చిక్కె, మన్మథో
న్మాదహతుం డొనర్చెను ననర్థము లిట్టివిఁ గాక యుండునే?

అన విని నరపాలక తిలకుం డిట్లనియె .-

దేవ బ్రాహ్మణ విత్త చౌర్యమున భూదేవుండు దండ్యుం డగున్
దేవీ నిగ్రహ భీతి నీతఁడు సము ద్విగ్మాత్ముఁడై చేసె రం
గావాసుంబున హేమ పాత్ర హరణం బట్లాట నిష్కాస్యుఁడౌ
నీ వార్తన్ బురిఁ జాటి తస్కరు నెనన్ హీనాత్ము బంధింపుఁడీ!

అంతటఁ గాలకింకరుల యాకృతి నొప్పు భటాళి వచ్చి, భూ
కాంతుని యానతిన్ ద్విజునిఁ గర్కశపాశ నిబద్ధుఁ జేయ, దై
త్యాంతకుఁ డొప్పె నప్పుడు కృతాంత కిరాంత నిపాంత పాశ సం
క్రాంత శరీరుఁడై యుదర కల్పిత బంధయుతో నహీంద్రుఁడై.

అంతట రంగనాథాలయంబున స్వామి సందర్శనార్థం బరిగిన యర్చకుండు గర్భాలయ కవాటంబు దెఱచి, దామోదరుం డను రంగనాథు నద్భుత దృశ్యంబు గాంచి, ఆశ్చర్యాభిభూతుండై యిట్లని వితర్కించె :-

కర మాశ్చర్యము రంగనాయక ! భవ త్కల్యాణ దేహంబు సు
స్థిరతన్ శేష ఫణీంద్ర పీఠమునకున్ దీర్ఘో గపాశంబులన్
వెఱ పావంతయు లేక గట్టి రసురో ర్వీధ ర్త వైరోచనుం
డరవిందాక్ష ! ప్రతిక్రియాభిరతి నత్యాచారమున్ సల్పెనో !

భవవారాకర మగ్న మాదృశ జన ప్రారబ్ధ కర్మానుసం
భవ బ ధచ్ఛిదురంబు నీదు గుణ కర్మ ధ్యానమో దేవ ! నే
డవివేకాస్పదుఁ డెవ్వఁ డీ కరణి నత్యాచారమున్ సల్పె, వాఁ
డవనీశాగ్రహ పాత్రుఁడై యిపు డవధ్యస్థానమున్ జేరెడున్.

అంత నవధ్యస్థానమునకు గొంపోఁబడిన విప్రనారాయణుండు రంగనాథుని స్తుతియించుచుండ, ఇట రంగనాథు నాలయంబునందలి మహాద్భుతం బర్చకుండు రాజునకు నివేదింప, నాతం డాశ్చర్య మగ్న మానసుండై, స్వీయావిమృశ్యకారిత్వ చింతాపరుండై, సత్వరము కతిపయ పరివార పరివృతుండై యర్చకుతోడ నవధ్య స్థానంబు సేరి, రంగనాథ ధ్యానాధీన మానసుండై యున్న విప్రయోగిం గనియె

## విప్రనారాయణ కృత రంగనాథ స్తుతి

బహు రత్న మేదురోజ్జ్వల కిరీట చ్ఛాయ
జరతార్క దీప్తులఁ బరిభవింప
ఉదయాద్రి శిఖరిపై నుష్ణాంశు కై వడిఁ
బాద నూపుర మణి ప్రభలు వెలుఁగ

కౌబేర దివ్యానగతుండైన రవి దీప్తి
యనఁగ నాద ద్భాగ మతిశయింప
ముఖ చంద్ర మండల స్ఫుట కౌముదీ కాంతి
సేతు పథాలోక సీమ మెఱయ

ప్రాగ్దిశను పాదములు సాచి, పశ్చిమమున
శిరము మెఱయంగ వీపు నుత్తరము జేర్చి
పూర్ణ దృష్టిని లంకపై బొందుపఱచు
నాగ శయనుని గొల్తు మన్నాథు నెపుడు.

రామత్వంబున సీతకై హర ధను ర్భంగంబు గావింప, వి
శ్వామిత్రుండు పురోహితుండుగ విదేహాధీశ యజ్ఞావనిన్
భీమాకారత నొప్పు కార్ముకము దోర్వీర్యాతిరేకంబునన్
భూమీశుల్ వెగడొంద ద్రుంచెదు భవన్మూర్తిన్ మదిన్ గొల్చెదన్.

హర చాపంబు భుజంగ భోగ నిభ బాహా యుగ్మ నిష్పీడిత
స్వరసంబై, విరసేక్షు కాండము క్రియన్ భగ్నంబు గావింపఁ ద
ద్గురు శబ్దంబున భగ్న మయ్యె వెస రక్షోనాథ శుద్ధాంత భా
సుర కాంతాగళ సూత్రముల్ దశ ముఖాసుధ్వంస శంసంబులై.

పారావార విశోషణ ప్రవణ దోర్వ్యాపార పర్యాయ వి
స్ఫారాకృష్ట కఠోర కార్ముక సముద్యద్బాణ వహ్ని చ్ఛటల్
వారి స్తోమము నింకఁ జేయఁగ నకూపాంతరవ్యాళ భో
గా రూఢోజ్వల రత్న దీపములు నీ కారాత్రికంబుల్ గదా!

మత్త మయూర కంఠ రుచి మన్మహితాశ్వసహస్ర యుక్తమై
యుత్తమ సారథిత్వమున నొప్పు మహేంద్ర రథంబు నెక్కి, రా
జోత్తమ రూపివై యసుర నొంచిన నాటి భవ ప్రతాపమున్
జిత్తమునం దలంచెదను జిత్తజ పంక విశోషణార్థినై.

తురగ చోదక పురందర సూతకర్ణ దర్వ
రాపాదక గరుత్మహాశుగములు
ఐంద్ర వాయవ్యాస్త్ర హత కుంభకర్ణ కా
హాసృజ నిమజ్జనాప్యాయితములు
రక్షః కులా ధ్యక్ష వక్షః కవాటార
ఘట్టన స్ఫుటితాస్థి కుట్టకములు
వర్మితాసుర బృహ ద్వక్షస్థలోత్క్రాంత
శాంత వేగక్షిప్త సాల తరులు

సాల సప్తక శైల రసాతలాంత
రాళ జంఘాల చరణ దుర్వార వేగ
విదళితాఖండలాత్మజ విక్రమములు
శరణ మగు రామ ! నాకు నీ సాయకములు.

దేవతా ద్రవ్యంబు దీయంగఁ దలఁచిన
హృదయంబు భిన్నమై చెదరుగాక !
కనక పాత్రముఁ దీయ కర యుగ్మ మిప్పుడే
పటు ఖడ్గ హతి ఊడి పడునుగాక !
చౌర్య వృత్తికి దేవ సదనంబుఁ జేరెడు
పదముల నిగడముల్ బొదలుఁగాక !
ధరణీశు సభ నసత్యముఁ బల్క నా జిహ్వ
శతధా విశీర్ణమై చనెడుగాక !
మహిత సాష్టాంగ యోగ సమాధి నిష
దేవ ! నిను నిత్య మెడఁదఁ జింతింతు నేని
రంగనాయక ! యీ మహారాజు నెదుట
సత్య మగుఁగాక మ ద్వాక్య సరణి యిపుడు.

అని యిట్లా హరిభక్తుండు పశ్చాత్తాప తప్తుండై నుతించుటయు నాశ్రిత వత్సలుండును, పరమ దయాళుండును నగు శ్రీరంగనాథుం డర్చక ముఖంబున ట్లానతిచ్చె :—

పరగన్ వైష్ణవ దర్శనం బవనినాపాలావిపాలంబుగా
వరుసన్ దెల్ప మదీయ భక్తు లుదయింపన్ బాంధ్య చోళాఖ్యల
ధరణీ భాగము లుర్విలోఁ గను బవిత్ర స్థానము ల్గావె ! మే
లరయన్ జాలవు మ ద్విభూతి వనమాలాంశంబుసు విష్ణుతేఁడున్.

మా కీతఁ డెప్పుడున్ దులసి మాలలు గూర్చి యొసంగుచుంటయున్
మీ కెఱుంగఁగరా దితని మేలిమి జన్మ, మదీయ భక్తి వే
బోఁక నితండు శబ్దమయ పుష్పములన్ దిరుమాలఁ గూర్చి మ
మ్మా కవి ద్రావిడోక్తుల మహీశ ! నుతించును బ్రాహ్మ్య వేళలన్.

భాషా గీతియు భక్తలోక రచిత ప్రస్ఫీత సూక్తిచ్ఛటా
వేద స్ఫూర్తి వహించియున్ దివిజవా గ్విన్యాస తుల్యం బగున్
యోషా రత్నము భూమికా రుచులచే నొక్కొక్క రూపంబునన్
భాసింపన్ దలపించుఁగాదె వెస న ద్భామా స్వరూపంబులన్.

వనమాలాంశమునన్ జనించిన మహా భక్తుం డితండో గదా !
వనితా రత్నము దివ్య కామినియు, న ద్భాలుంఁడు నైన్యాధిపుం
డని భావింపుము చౌర్య వృత్తియు తదీయాసంగ రంగంబు మ
త్తను బాధంబు మదీయ కృత్యము లగున్ ధాత్రీతలాఖండలా !

తొలి జన్మంబునఁ జూప్పనాక యిది, మద్దోర్దండ చండాంసిని
ర్దళిత ప్రస్ఫుట నాసికాగ్ర యగుచున్ రాగాంధయై, మన్మథా
కులతన్ దేహము వీడి ద్వాపరమునన్ గుబ్జాకృతిం బుట్టె, నా
వలనన్ కొంత సుఖంబు గాంచియును సర్థ్యర్థించె సాంగత్యమున్.

వనమాలాంశమునన్ జనింతు నబలా ! వారాంగనా జన్మ నా
వన సీమం బని నేసి ప్రాగ్గతి సంధర్త్రంబు భక్షించి, పా
వనతం గాంచి పదాబ్జ సేవ యొనరింపన్ వచ్చి నీ కంచు నీ
వనితం గూర్చి వరం బొసంగితివి రాజా ! యిట్లు చెల్లించితిన్.

పరిశుద్ధుండు మదీయ భర్తృఁ డితఁ డీ ధర్మాంబు పాత్రంబు నే
నరవిందాక్షి కొసంగినాడ నిది వేశ్యా శుల్కమా గాన, భూ
వర ! యగ్రాహ్యము, దేవదేవి ధన మీ పాత్రంబు, భూదేవు నా
దర మొప్పంగ విముక్తుఁ జేయు మిచటన్ దండ్యుండు లేఁ డెవ్వఁడున్.

అనుటయు విప్రనారాయణుండు -

స్వామీ ! దండ్యుఁడ నున్న వాఁడ నిచటన్ సర్వస్వమున్ వీడియున్
గామాంధత్వముతోడ వీడితిని మీ కైంకర్యము ల్గాన నన్
రామాబద్ధు నొనర్ప భూతకుల వధ్య స్థానమున్ జేర్పఁగా
భూమీశా ! వెస నాజ్ఞ యిమ్ము నరకంబున్ బాయుదున్ నిష్కృతిన్.

మహిని నారాధ పతితుఁడౌ మానవునకు
గనను నిష్కృతి మరణ దండనము దక్క
పద్మనాభుని కరుణకుఁ బాత్ర మగుట
పరమ పదనాథు సేవింపఁ బాడి యగును.

అనుటయు హరి యిట్లనియె -

నీ యిచ్చయె వత్సా ! యిట
నా యుడుగుము నొసఁగుచుంటి ప్రాయశ్చిత్తిఁ
బాయు ప్రశ్నీకర మిది యగు
బాయును నీ కింక సర్వ పాపము లనఘా !

భక్తాంఘ్రి పాద తోయము
ముక్తికి సాధనముఁ గాన మునివర ! యిట నా
భక్తుల సన్నిధిఁ గొను మను
రక్తిన్ 'భక్తాంఘ్రిరేణు' రమ్యాభిదయున్.

భక్తపాదోదకంబున పావనతను
గాంచినాఁడవు గాన లోకంబునందు
'భక్త పదరేణు' వను పేరఁ బరగు మింక
నిది మదీయాజ్ఞ యగును మీ కెల్లరకును.

రాసక్రీడ మదీయ కృత్యములు ధూర్త క్రీడలే ? మానుఁడా
వ్యాసాదుల్ కరియి పరే యటుల నీ భక్తాంఘ్రి ధూళీ కణల్
ఆసక్తిన్ లిఖియింకఁ, బాడ, విన నిత్య శ్రీ యశ స్సౌఖ్యముల్
భాసించున్ మహి సర్వ మానవులకున్ బహ్వాయు రారోగ్యముల్.

అని హరి యానతిచ్చుటయు రాజేంద్రుండు సగౌరవంబుగా శ్రీమన్నారాయణ చరణ కమల ద్వంద్వ సేవా పరాయణుండైన విప్రనారాయణుం గొని వచ్చి, భగవత్సాన్నిధ్యంబునఁ బ్రణిపాత పురస్సరంబుగా శరణాగతుం డయి, తత్కృపాలబ్ధ పంచసంస్కారుండై సుఖం బుండె గణికా శిరోమణి యగు దేవదేవియు రంగనాథ కృపా కటాక్ష వీక్షణాశుగ ప్రహరంబున నిరస్త కిల్బిషయై, జ్ఞాన వైరాగ్య భక్తి సమన్వితయై, తన సర్వస్వంబును భగవద్భాగవత కైంకర్యంబులకు వినియోగించుచుఁ సద్వర్తనంబున దేహ యాత్ర గడపుచుండె.



# శ్రీ నాథమునుల వైభవము

'సంగీత సాహిత్య కళానిధి'

శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు

—※—

"నమో ఽచిన్త్యాద్భుతాక్లిష్ట జ్ఞాన వైరాగ్య మూర్తయే
నాథాయ మునయే ఽగాధ భగవ ద్భక్తి సిన్ధవే"

## జ్ఞాన భక్తి వైరాగ్యములు

జ్ఞాన భక్తి వైరాగ్యములు కొందరివి 'ఇట్టివి' అని యూహింపవచ్చును. 'వీరి కీ విషయమున నింత జ్ఞాన మున్నది, వీరి వైరాగ్యమిట్టిది; వీరు జ్ఞాన భక్తి వైరాగ్యములను ఈ సాధనములచే నభ్యసించిరి' అని ఊహించి చెప్పవచ్చును. కాని, నాథమునుల జ్ఞాన మీ విషయములందు 'కొంత మాత్ర మున్నది' అని చెప్పుటకు కుదురనిది.

నమ్మాళ్వారుల విషయమున - 'కృష్ణ తృష్ణా తత్త్వ మివోదితం' భగవ ద్భక్తియే ఈ రూపమున నవతరించిన దని చెప్పఁబడినది. మరియు - 'పత్యుః శ్రియః ప్రసాదేన ప్రాప్త సర్వజ్ఞ సంపదమ్' శ్రియఃపతి అనుగ్రహముచేత నమ్మాళ్వారులు 'సర్వజ్ఞులు' అని చెప్పఁబడినది. కాని, 'నాథ మునుల జ్ఞాన వైరాగ్యము లచింత్యములు, అద్భుతములు, అక్లిష్టములు' అని కొనియాడబడినవి. అంతియే కాక, సముద్రమునకు లోతు ఎట్లు దురవగాహమో, అట్లే - 'నాథ మునుల భక్తి లోతు నెరుంగుట కష్టమే' అనిరి. మరియు, వారి పౌత్రు లగు యామునాచార్యులు - 'అకృత్రిమ త్వ చ్చరణారవింద ప్రేమ ప్రకర్షావధి మాత్మవంతమ్' అనిరి. బంగారమునకు కాంతి, పుష్పమునకు సౌరభము ఎట్లు సహజములో, నాథమునులకు భగవ త్ప్రేమ భక్తి

అట్లు సహజము. అదియును సాధారణ చరణారవింద ప్రేమ మాత్రము చాలక, ఆ గాఢ భక్తికి నాథమునులే అవధి యట. అదియే ప్రపత్తి. నిర్భరత్వానుసంధానముతో భగవచ్ఛేషత్వ పారతంత్ర్యము లనుసంధించుట 'సత్సంగాద్భవ నిస్పృహాః' అనినట్లు, ఎంత ధన్యాత్ము లకైనను సత్సంగమువలన సంసారమందు వైరాగ్యము, దాని వలన ఆత్మయొక్క స్వరూపము లగు అణుత్వ - కించిజ్ఞత్వాదుల నెరుగుట, లక్షణములైన శేషత్వ పారతంత్ర్యములను ధరించుట కుదురదు. కాని, నాథమునులకో! మొదటి దెప్పుడు సహజమో, పరంపరయా - తక్కిన వన్నియు సహజ సిద్ధము లైనవి. 'కవితా వనితా చైవ స్వయమే వాగతా వరా' అనిన రీతి, కవిత్వము స్వయం సమృద్ధ మైనదే హృద్య మగును భక్తియును స్వయం సమృద్ధ మైన పుడే రమ్య మగును. అట్లు కానిచో - అది 'హృద్య భక్తి' అనఁ బడక, 'సభ్య భక్తి' అనఁబడును. సాధారణముగా భక్తి వృక్షము నకు - హృద్య భక్తి, సభ్య భక్తి అను రెండు శాఖ లున్నవి.[1] ఇందు హృద్య భక్తి - పరిసమాప్తము, వర్ధమానము అని రెండు విధములు. ఆత్మ లాభము కొరకు అంతఃకరణ శుద్ధముగనే ఆవిర్భ వించి, ఆత్మ లాభము కలుగగనే పరిసమాప్తినొందునది పరిసమాప్తి భక్తి. దీనికి ధ్రువాదులు ఉదాహరణము. ఇఁక, భగవద్గుణానుసంధా నము నిర్వ్యాజముగా - అంత కంతకును అభివృద్ధి నొందునది వర్ధ మాన భక్తి. ఇందు, సీతా - రుక్మిణీ - శుక - పరాంకుశ - పరకా లాది సూరు లుదాహరణము. నాథ మునుల భక్తియు ఈ కోవలోనిదే.

సభ్య భక్తి యందు వ్యాసాదుల భక్తి - యోగ్య భక్తి అనియు, రావణుని సభ్య భక్తి - యోగ్య మైన శివ భక్తి యనియు నిర్వచింప నగును. కంస దుర్యోధనాదుల భక్తి - అయోగ్యము,

1 హృద్య భక్తి యనఁగా - హృదయమున బుట్టినది, సభ్య భక్తి యనఁగా - బాహ్య ముగ గోచరించునది.

అవాచ్యము అని, మన పూర్వాచార్యులు నిర్దేశించిరి[2]. ఇక ఈ ద్వితీయ భక్తి విషయము నాథ మునుల చెంత స్మరణీయమే కాదు. అందుచేతనే, 'అకృత్రిమ భక్తి నాథ మునులది' అని కొనియాడ బడినది.

## మూల పురుషులు

భగవచ్ఛాస్త్ర విష్ణు పురాణాదులచే పర్యవసన్నమగు ప్రపత్తి - విశిష్టాద్వైతమునకు మూల స్తంభము. ఆళ్వారులు, ఆచార్యులు అని మన పూర్వాచార్యుల నిర్దేశనము, విభజనము. ఆళ్వారులు నిరతిశయ ప్రీతిచేత భగవద్గుణానుభవము చేయగా - ఆ అనుభవము రస ప్రవాహమై, అక్షర రూపమున 'నాలాయిర దివ్య ప్రబంధము' అయినది. వారికి ఆత్మానుభవమే కాని, ఇతరులతో పని లేదు. ఆచార్యులు ఆ ప్రబంధములను, ప్రబంధార్థములను - 'ఆచినోతి హి శాస్త్రార్థాన్' అనినట్లు, మహా దర్థములను గ్రహించి, దేశములు పర్యటించి, అధీతి బోధాచరణముల చేత జనులను తరింపజేసెడివారు. నమ్మాళ్వారులు సర్వ ప్రపన్న జనులకు మూల పురుషులైనచో - నాథ మునులు ఆచార్యులలో మూల పురుషులైరి. అందుచేతనే, ప్రపన్నుల తిరువారాధనమునందు - 'నాథ యాము నాది పూర్వాచార్యేభ్యో నమః' అని, షోడశోపచారములందు వారికి స్థానముంచుట, వాక్య గురుపరంపరయందు - 'శ్రీమన్నాథ మునయే నమః' అని అనుసంధింపబడుట. మణవాళ మహా మునులు ఉపదేశ రత్నమాల యందు - 'నాథముని ముదలాన నందేశికరై అల్లాల్ పేదై మనమే ఉండో పేసు' నాథ ముని మొదలైన దేశి

2 ఈ భక్తి విషయము లిట్లు, కీ: శే. చిలకమర్తి కందాడై అప్పయాచార్యులవారి 'నవ రహస్య మంజరి' యందు వివరముగా ప్రతిపాదింపబడినవి

కులు లేక, ఆళ్వారుల దివ్య ప్రబంధములు గాని, తదర్థములు గాని మనకు కరతలామలకము లయి యుండెడివి కావు' అనిరి.

నాథమునులు గృహస్థాశ్రమ నివిష్టు లయినను - 'వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః సన్న్యాస యోగా ద్యతయః శుద్ధసత్త్వాః' ఉపనిషద్వాదుల విజ్ఞానముచేత పరమాత్మ స్వరూప మెఱిగి, సన్న్యాస యోగ మవలంబించి, యతులై, శుద్ధ సత్త్వ గుణము కలవారు' అని చెప్పినట్లు, బాహ్య యతి వేషధారులు కాకున్నను. అష్టాంగాది యోగ విద్యారహస్య గ్రహణ పారీణులై, పరమాత్మ సాక్షాత్కా-రమును బొందిన మహా యోగేశ్వరులు నాథమునులు. వీరి పేరున నున్న ముని శబ్దము - వీరు ఎల్లప్పుడు మనన శీలు రని స్పష్టపరచు చున్నది. వీరి మొదటి నామధేయము 'రంగనాథులు' అని. వీరి మనన శీలము చేతనే వారిని ప్రత్యక్షముగా ననుభవించిన శిష్యుల ద్వారా - 'నాథమునులు' అని అన్వర్థ నామ మేర్పడినది. నాథ మును లను శబ్ద మునకు - రక్షకులకు మనన శీలురు, మనన శీలురలో నగ్రేసరులు' అని అర్థము చెప్పవచ్చును.

## క్షేత్ర దర్శనము

దక్షిణ దేశమున వీర నారాయణపుర మను క్షేత్రము గలదు. దీని నిప్పుడు 'మన్నారు గుడి' యందురు. మొదటి పేరు చోళవంశ్య ప్రభువులలో నొకరి పేరున నెలకొన్నది. రెండవది - మన్నారు గోపాల స్వామి ఆలయ మగుటచేత ప్రసిద్ధ మైనది. 'మన్ననార్' అనఁగా - శాశ్వత ప్రభువు అని అర్థము. మన్ననారే క్రమముగా 'మన్నార్' అయినది. శాశ్వత ప్రభు వను రాజగోపాల దేవునికి నివాస మైనందున, ఈ క్షేత్రమునకు - 'దక్షిణ ద్వారక' అని ప్రసిద్ధి కల్గినది.. ఆ క్షేత్రమున 'ఈశ్వర భట్టారకు' లను వైష్ణవ విద్వాంసు లుండిరి.

వారి కుమారులు నాథమునులు.[3] తండ్రిగారి వద్ద వేదాంగము లభ్యసించిరి. అధ్యయనమునకు మించినది అర్థావబోధకము. దానికి వారి ప్రతిభయే మూల కారణము. మన్నారు గోపాలుని నిత్య సేవ యందును, పితృసేవ యందును తమ జీవితమును ధన్య మొనరించుకొను చుండిరి. ఇట్లుండి,

"అయోధ్యా, మధురా, మాయా, కాశీ, కాంచీ, హ్యవంతికా
పురీ ద్వారవతీ చైవ సప్తైతే మోక్ష దాయకాః"

అను సభియుక్తోక్తిని స్మరించి నాథ మునులు ఆ క్షేత్రములను సేవించు సంకల్పము కలవారైరి. వెంటనే - శంఖ చక్రాద్యాయుధుండును, పీతాంబర దివ్యవాససుండును, గళశోభి కౌస్తుభుండును, మహార్హ వైడూర్యకాంతి పరిస్ఫురిత సహస్ర కుంతలుండును, రుక్మిణీ సత్యభామా దేవితోభయపార్శ్వుండును నగు రాజగోపాలుని సేవించి, వినుతించి, 'స్వామీ! నీవు క్షీరార్ణవమును, నాగ పర్యంకమును వీడి, మధురయం దవతరించితివి. మరియు - నీ చేతి నిర్మింపి, అధివసించి, ముక్తిస్థానము కాఁగల దని ద్వారకను కటాక్షించితివి. అట్టి ద్వారక మొదలగు క్షేత్రములను సేవింప కుతూహలము కలిగినది. నీ వనుగ్రహించి, అభ్యనుజ్ఞ నొసంగినచో - నేఁడే పయన మయ్యెద' నని వేడుకొనఁగా - రాజగోపాలుఁడు అర్చక ముఖమున నావేశించి, 'యోగ క్షేమం వహామ్యహమ్' అని నాథమునులను కృపచేసెను. ధన్యోఽహం - కృతకృత్యోఽహం అని నాథ మునులు స్వామి ప్రసాదము శిరసా వహించి, ఉత్తరమున సమస్త దివ్య దేశములు సేవించి, క్రమముగా - శ్రీ జగన్నాథము, శ్రీకూర్మము, సింహాచలము సేవించిరి. అచట నొకనాఁడు మన్నారు రాజగోపాలుఁడు నాథమునులకు స్వప్న గోచరుఁడై, త్వరలో

3. నాథమునులు క్రీ. శ. 823 సంవత్సర ప్రాంతము వారని చారిత్రకుల నిర్ణయము
- సంపాదకుఁడు.

మరలి రమ్మని అజ్ఞాపించెను. ఆ యాజ్ఞతో - తిరుమల, అహోబలము సేవించి, నాథమునులు తిరిగి మన్నారు గుడి చేరిరి.

## స్వాగత సత్కారములు

మన్నారుగుడి పౌరులైన భాగవతోత్తములు నాథమునులకు ఘన స్వాగత మొసఁగి, సన్మానించిరి. నాథమునులు స్వామిని సేవించి, 'రాజగోపాలదేవా ! నీ యనుగ్రహమున ఉత్తర దక్షిణములందలి నీ యర్చామూర్తులను సేవించితిని. ఆ యనేక మూర్తులయందు నీ ఏక మూర్తి సాక్షాత్కరించుచున్నది' అని, దర్శనానంద బాష్పములతో నాథమునులు పలికిరి. అర్చక - భాగవతోత్తములు నాథమునులను శేషవస్త్ర శఠారి తీర్థ ప్రసాద ప్రసక్చందనాదులతో గౌరవించిరి. అప్పుడు రాజగోపాలుఁడు ఒక అర్చకస్వామి ముఖమున నావేశించి, 'ఇచ్చట నాథమునికి స్థిర నివాసము లేదు; ఈతఁడు నా సన్నిధిని నిత్య నివాస మొనరింపవలె నని నా యిచ్ఛ కనుక, మీరీ నాథమునికి గృహ నిర్మాణము గావించి యిచ్చి, సనాథులు కండు' అని ఆజ్ఞాపించగా - వా రట్లే చేసిరి ఆ నాఁటి నుండియు నాథమునులు - 'స్వ గృహే కో విచారో ఽ స్తి' అని, నిత్య నైమిత్తికాదులయందు - 'భగవత్ భాగవతాచార్య సన్నిధౌ' అను దానితోపాటు, 'స్వ గృహే' అని సంకల్పము చెప్పుకొనుచు, పితృ పుత్రాదులతో నాథమునులు సుఖా వాసము చేయుచుండిరి. వారు గోదాదేవి తిరుప్పావై యందు - 'ఉంగళ్ ఉడైక్కడై తోట్టత్తు వావియుళ్' అని చెప్పిన రీతిగా - తమ పెరటిలో పుష్పారామాదుల నేర్పరచి, ఆ నాఁటి నుండి, పెరియా ళ్వారుల వలె రాజ గోపాలదేవునకు పుష్ప మాలా కైంకర్యము చేయుచు, శిష్యులకు శాస్త్రములను బోధించుచు, భగవద్గుణానుభవ ముతో కాలక్షేపము చేయుచుండిరి.

## దివ్య ప్రబంధ ప్రాప్తి

ఇట్లుండగా నొక సమయమున 'మేల్నాడు' నుండి కొందరు శ్రీవైష్ణవులు మన్నారుగుడి వచ్చి, రాజగోపాలుని సేవించుకొని, 'ఆరావముదే అడియే నుడలం నిన్బాలన్ బాయే' అను పది పాశురములు పఠించిరి. నాథ మునులా పాశురముల కవితా వైభవమునకు, అర్థ తాత్పర్యములకు ముగ్ధులైరి. వెంటనే నాథ మునులు వైష్ణవ స్వాములం జూచి సవినయముగా - 'స్వాములారా! మీరు ఫలశ్రుతిగా చదివిన యీయున పాశురములందు 'వేయి పాశురములలో నివి పది' అని యున్నది. తక్కిన తొమ్మిది వందల తొంబది పాశురములు గూడ మాకు కటాక్షింపుడు' అని కోరిరి. వారు - 'మేమీ పది మాత్రమే యెరుగుదుము, మా ప్రాంతము వారికి యింత మాత్రమే పాఠము' అనిరి. నాథమునులు ఇంతలో ఖేద పడిరి 'అయ్యో! ఈ మహోత్కృష్ట సంపూర్ణ ప్రబంధ మెట్లు లభించును?' అని ఉత్కంఠితు లయిరి. పిదప, మేలునాటి స్వాములను శేషవస్త్ర తీర్థ ప్రసాదాదులతో సత్కరించి పంపిరి అటుపిమ్మట, 'శఠకోప గాథా సహస్రము' లభించు మార్గము వరయ దొడగిరి. ఎచటను, ఎవరును చెప్పువారు కానరారైరి. తుదకు నాథమునులు - నమ్మాళ్వారుల అవతార స్థలమగు కురికా పురికే బయలుదేరిరి. అచ్చట మధురకవియాళ్వారుల శిష్యపరంపరలోనివా రగు 'పరాంకుశ దాసులు' అను వారు తారస పడిరి. వారివలన, శఠకోప గాథా సహస్రము 'తిరువాయిమొళి' యను పేరు గల్గిన దనియు, అది యేనాడో ప్రణష్టమైపోయిన దనియు తెలిసినది. నాథమునులు కారణ మడిగిరి. తిరువాయిమొళి పఠింపగనే దాని ప్రభావమున పాఠకులు వెంటనే మరణము బొంది, వైకుంఠ మేగుట చేతను, చేతనులు సంసారోన్ముఖు లగుటచేతను, దానిని కావేరీ నదిలో పారవైచిరి' అని పరాంకుశులు పలికిరి. 'ఇంక మార్గమే లేదా?' అని నాథమును లడుగగా, పరాంకుశ దాసులు మా ఆచార్యు లగుశఠ

కోవుల విషయమున మధుర కవులు రచించిన 'కణ్ణినుణ్ శిరుత్తాంబు' అను పది పాశురములు పన్నెండు వేల పర్యాయములు జపించి నచో - నమ్మాళ్వారులు ప్రత్యక్షమగుదురని చెప్పిరి' అని, కణ్ణినుణ్ శిరుత్తాంబును నాథ మునుల కుపదేశించిరి. అందుచేతనే వాక్య గురుపరంపరలో పరాంకుశదాసులు [illegible].

అనంతరము నాథమునులు ఆదినాథస్వామి కోవెలకు వెళ్ళి, స్వామిని సేవించి, తీర్థ ప్రసాదములు స్వీకరించి, నమ్మాళ్వారుల నివాస మగు చింత చెట్టున కెదురుగా - బద్ధ పద్మాసనాసనులై, అపర శఠ కోపులో యనునట్లు తదేక శ్రవణులై [illegible] వందల పర్యాయ ములు కణ్ణినుణ్ శిరుత్తాంబును జపించిరి. ప్రసన్నముగా - నమ్మా ళ్వారులు సాక్షాత్కరించి, నాథమునులకు అష్టాక్షర మంత్రోపదేశ మొనరించి సహస్రగాథా పరిమితమైన తిరువాయి మొళినే కాక, తక్కిన పదకొండుగురు ఆళ్వారుల దివ్య ప్రబంధములను ప్రసాదించిరి[4]. ఆ సమయమున నమ్మాళ్వారులు సాయించుట, నాథ మునులు లిఖించుట అప్పుడు తిరువాయిమొళిలో తొమ్మిదవ శతక ములోని పదియవ దశకము నందలి 'మాలై నణ్ణి' అను తిరువాయి మొళిలో నమ్మాళ్వారులు - 'మరణ మానాల్ వైకుందం కొడుక్కుం బిరాన్' దీనిని స్మరించినవారికి మరణము కలిగినచో, వైకుంఠము నొసగు మహోపకారకుడు' అని అర్థమిచ్చు పాశురము విన్పింప, అచ్చట నాథమునుల లేఖని ఆగినది. అప్పుడు నమ్మాళ్వారులు - ఏమి? అని ప్రశ్నించిరి. స్వామీ! [illegible] సాయించిన ఈ అర్థము చేతనే ఈ ప్రబంధము ప్రవృత్తమైనది కనుక, కటాక్షించి - పార భేద మొనరింపుడు అని నాథమునులు ప్రార్థింపగా - నమ్మా

4 పన్నిద్దరాళ్వారులు వివిధ దేశములందు, వివిధ కాలములందు అవతరించినను, ద్వాదశాత్ములగు సూర్యుని వలెనే వారి యాత్మలు [illegible] అని ఇచట గమనింప నగును.

వేదాంత ప్రవర్తక' బిరుదముతో సలరారుచుండిరి. ఆ విధముగా నాథ
మునులు లోకోత్తారకులైరి.

## జ్ఞాన విశేషము

ఇట్లుండగా - ఇరువురు వేశ్యాంగనలు తమ గానముల పర
స్పరము శ్రద్ధ వహించి, న్యాయ నిర్ణయమునకు చోళ ప్రభు సంస్థాన
మగు గంగైకొండ చోళపురమునకు వచ్చిరి. ఆ సంస్థానమందలి సంగీత
న్యాయ నిర్ణేతలు ఒక యామె సంగీతమునకు మెచ్చిరి. చోళప్రభు
వామెకు సన్మానము గావించెను. రెండవ యామె పరాభవముచే
గంపెడు చీకటి నెత్తిన వేసికొని, దివ్య దేశములు తిరుగుచు, ఆ యా
దేవ సన్నిధులలో తన గానము విన్పించుచు, క్రమముగా వీర
నారాయణపురము వచ్చి, మన్నారు సన్నిధిలో గాన మొనరించెను.
నాథమును లామె గానము నధికముగా ప్రశంసించి, ఆమెకు మన్నారు
సన్నిధి గౌరవము లన్నియు చేసిరి. ఆమె సంతసించి, చోళ సభ కేగి,
'ప్రభూ! నా గాన మాహాత్మ్యము నెరింగినవారు నాథమును లను
నొక మహా మహులు వీరనారాయణ పురమున నున్నారు. మీ ఆస్థాన
విద్వాంసులు అంతటి జ్ఞానులు కారు' అని చెప్పెను. చోళ ప్రభువు
నాథమునుల నాహ్వానించి, ఈమె గానమందు ఏమి విశేష మున్నది?'
అని యడుగగా, నాథమునులు - చోళాధిపా!

"షడ్జ మధ్యమ నామానౌ గ్రామౌ గాయంతి మానవాః
న తు గాన్ధార నామానం స లభ్యో దేవ యోనిభిః "

షడ్జ మధ్యమ గ్రామములను మాత్రమే మానవులు గానము చేయఁ
గలుగుదురు. గాన్ధార గ్రామమున పాడలేరు. ఆ గ్రామము దేవతలకు
మాత్రమే శక్య మైనది' అని శాస్త్రము మీ సంస్థానమున నున్న
సంగీత విద్వాంసులు షడ్జ మధ్యమ గ్రామములనే ఎరుగుదురు. ఈమె

దేవతా మాత్ర శక్యమగు గాన్ధార గ్రామము పాడుటచే, ఇచటి వారు ఈమె గాన మాహాత్మ్య మెఱుగలేరైరి' అని నాథమునులు చెప్పగా, చోళ ప్రభువు - 'మీ జ్ఞానమునుఁగూర్చి మే మెట్లు గుర్తింపఁగలము ?' అని ప్రశ్నించిరి. 'మీ యిష్టము వచ్చిన పరీక్ష పెట్టుఁ' డని నాథమునులు పలికిరి. అప్పుడు రాజు - నాలుగు వందల కంచు తాళములను తెప్పించి, ఆ తాళములను ఒకే సమయమున మ్రోగించి, ఆ మ్రోతనుఁబట్టి ఆ తాళముల బరువు తెల్పుఁ డని నాథమునులకు పరీక్ష బెట్టెను. నాథమునులు వాటి మ్రోతనుఁ బట్టి, వాటి బరువు తెల్పుట, వెంటనే అవి తూచిన పిదప, నాథమునులు చెప్పిన బరువునకే బంగారపు తూకముగా సరిపోవుట - చోళ ప్రభువును, సభాస్థులను దిగ్భ్రాంతులను చేసినది. ఇదే నాథమునుల అచింత్యాద్భుతాక్లిష్ట జ్ఞానము'నకు తార్కాణము.

## వైరాగ్య విశేషము

చోళరాజు నాథమునుల మాహాత్మ్య మెరిగి, వివిధ సువర్ణ రత్నాభరణములు, బహు ధనము నొసంగి, సత్కరింప సన్నద్ధ మయ్యెను. కాని, నాథమునులు వాటిని కంటితోనైనను జూడక, అచటనే వదలి, రాజు నాశీర్వదించి వెడలిపోయిరి. ఇది వారి 'అచింత్యాద్భుతాక్లిష్ట వైరాగ్యము'నకు ఉదాహరణము.

## భక్తి విశేషము

కొంత కాలమునకు చోళ భూపతి నాథమునులను దర్శించుటకై వీర నారాయణ పురమునకుఁ బోయి, వారింటి కేగెను. ఆ సమయమున నాథమునులు పద్మాసనాసీనులై, ఆ యా నియత స్థానముల ద్వాదశోర్ధ్వపుండ్రములు ధరించి, నిమీలిత నేత్రులై, అంజలి

మువను నొసట గీలించి, ధ్యాన యోగ నిష్ఠులై యుండిరి. చోళ ప్రభువు వారి సమాధికి భంగము వాటిల్లనీయక, తన రాణులతో దూరముగనే నాథమునుల పదములకు మ్రొక్కి మరలెను. అపుడే నాథమునుల ధ్యాన సమాధి సమాప్తమైనది. ఆ సమాధియందు కృష్ణ సాక్షాత్కారము కలిగినది; ముగిసినది. వెన్వెంటనే కనులు తెరచునరికి, చోళభూపతి అల్లంత దూరమున తన పురికి మరలుచు కాన్పించెను. నాథమునులు - అదుగో! నా మన్నారు కృష్ణుండను అని చోళుని వెంటం బోవ ప్రయత్నించెను. ఆ సంభ్రమ పారవశ్యములనుఁ జూచి అంగ రక్షకులుగా వెంట నుండిన శిష్యులు - అతండు చోళరాజని చెప్పిరి. నాథమునులు - 'అతనిని గోపికావృత కృష్ణుండని భావించితిని' అని, ఎట్టకేలకు మనసు తేరి మరలిరి. ఇది వీరి 'అగాధ భగవద్భక్తి'కి నిదర్శనము.

## శిష్య వాత్సల్యము

తరువాత నొకనాఁడు నాథమునులు - తమ శిష్యు లగు కురుగావలప్పన్ పుండరీకాక్షులు అనువారల బిలచి,

"కృతకృత్యాః ప్రతీక్షంతే మృత్యుం ప్రియ మివాతిథిః."

కృత కృత్యులు మృత్యువు కొరకు, ప్రియ బంధువు కొరకు వలె నిరీక్షింతురు' - అనినట్లు, నేను కృతకృత్యుండను. ఇంక నాకు పరమపద మాసన్న మగుచున్నది. కావున, మీ రిరువురకు యోగ రహస్య ముపదేశింతును రండు' - అనిరి. కురుగావలప్పన్ సమ్మతించెను. కాని, పుండరీకాక్షులు 'మాత్రము - మాదృశులకు యోగ మశక్యము కనుక, మార్గాంతర ముపదేశింపుఁ' డని కోరెను. నాథమునులందులకు సమ్మతించి, కురుగావలప్పన్‌కు యోగ రహస్య ముపదేశించి, పుండరీకాక్షులకు నాలాయిర దివ్య ప్రబంధముల సారమైన

శరణాగతి నిష్ఠ నుపదేశించి, 'ఈ ప్రబంధముల, ప్రబంధార్థముల ప్రచారము నీది' అని సాయించిరి. పిదప, తమ కుమారు లగు ఈశ్వర మునులను పిలిచి, 'నీకు జన్మింపనున్న కుమారునకు 'యమునైతురవన్' అని పేరు పెట్టుము' అని చెప్పిరి. తరువాత, కురుగావలప్పన్ - పుండరీకాక్షులతో తమ పౌత్రునకు దర్శన తాత్పర్య యోగ రహస్యార్థ విశేషములను బోధింపు డని చెప్పిరి.

## చరమ దశ

అనంతరము కొన్నాళ్ళకు నాథమునులు ఎచటికో చనిరి. ఆ సమయమున విల్లమ్ములు చేత బూని, కోయవాం డ్రిరువురు, వారి వెంట ఒక నాతి, ఒక కోతి. కోయవాండ్రు నాథమునుల యింటికి వచ్చి, 'నాథమును లుండిరా?' అని ప్రశ్నించి, వారింటలేరని తెలిసి వెడలిపోయిరి. నాథమునులు ఇంటికి వచ్చిన వెంటనే వారి కొమార్తె విషయము చెప్పగా 'అయ్యో! నే నింట లేకపోయితినే! ఆ వచ్చిన విలుకాండ్రు రామ లక్ష్మణులు, ఆమె జానకి; ఆ కోతి హనుమంతుడు' అని ఆ విలుకాండ్ర జాడలు కనుపట్టని వారిని అడుగుచు, నాథమునులు ఎంతో తిరిగిరి. అట్లడుగుచునే వారి జాడ తెలియక, వెకలి చోళ పురికి జనిరి. అచటివారిని అడిగిరి. తుదకు వారి జాడ తెలియక చింతాక్రాంతులై, రాజ ద్వారమున కడనే బద్ధ పద్మాసనులై, యోగ మార్గమున వాయువును బంధించి, సుషుమ్న నాడియందు ప్రవేశపెట్టి, అష్టాక్షర ద్వయ మంత్రము లనుసంధించుచు, శుద్ధ సత్త్వమయులై, స్వచ్ఛందముగ పరమపద మలంకరించిరి.

ఈ వార్త విని కురుకావలప్పన్, పుండరీకాక్షులు - దుఃఖాక్రాంతులై, ఆచార్య పుత్రు లగు ఈశ్వర మునిని తోడుకొని, ఆయనను ఓదార్చుచు, చోళపురి కేగి, అచ్చట నాథమునుల చరమ కళేబరము సేవించి, ఈశ్వరమునిచేత నాథమునులకు బ్రహ్మమేధ

సంస్కారములు జరిపించి, వీరనారాయణ పురముఁ జేరి, తక్కిన ఔర్ధ్వదైహిక క్రియా కలాపము ముగిసిన పిదప, పదమూడవ రోజున పరమ పదోత్సవము జరిపించిరి. అందు, నాథమునుల కత్యంత ప్రీతికర మగు నాలాయిర దివ్య ప్రబంధాధ్యయన గోష్ఠిని జరిపించిరి. ఆనాడు మొదలుగ, ప్రపన్నుల పరమ పదోత్సవమున నిది జ్ఞాన కాండమై, శిష్టాచారమై, ఈనాటికిని వచ్చుచున్నది. ఇంకను నాథ మునుల శిష్యులు - నంబి కరుణాకర దాసర్, పెరియ తిరువుడై యార్, తిరుక్కణ్ణ మంగై ఆండాన్, వానమామలై యాండాన్, ఉరుపుటూనాచ్చాం బిళ్ళై, చొక్కత్తాళ్వాన్ నాథమునుల పౌత్రు లగు 'యమునై త్తురైవనై[6]' - ఆబాల్య ప్రతిభా విశిష్టులై, యామునా చార్య బిరుదము వహించి, పితామహు లంతటివారై, నాథమునుల జ్ఞాన ప్రవాహము లనే స్తోత్రరత్నాది గ్రంథ ప్రణాళికల ద్వారా అనన్య గతిక క్షేత్రములపై ప్రసరింపఁజేసిరి. అందుచేతనే విశిష్టాద్వైత సంప్ర దాయము 'నాథోపజ్ఞం ప్రవృత్తం' నాథమునులచే ప్రవర్తింపజేయఁ బడె నని ప్రశస్తి గాంచినది.

6 'యమునై త్తురైవన్' అనఁగా - 'యమునా తట విహారి' యని అర్థము



# శ్రీ యామునాచార్య వైభవము

'బాల విద్వత్కవి'

శ్రీమాన్ కె.వి.వి.యస్. నరసింహాచార్యులు, ఎం.ఏ., బి.యల్.

— ※ —

"లక్ష్మీనాథ సమారంభాం నాథ యామున మధ్యమామ్
అస్మదాచార్య పర్యన్తాం వన్దే గురుపరంపరామ్"

## జీవిత విశేషములు

శ్రీవైష్ణవ తాత్త్వికాకాశమండలమున యామున మునీంద్రు లొక యుజ్జ్వల మగు ధ్రువ నక్షత్రము. వీరు ఈశ్వరముని పుత్రులు. నాథముని పౌత్రులు. తాతగారి శేముషీ వైభవము మనుమనియందు ప్రస్ఫుటముగ వికసించు నని మానసిక తత్త్వ శాస్త్ర సత్యమునకు ప్రథమోదాహరణము [illegible] మునీంద్రులే. ఈ యామునులు చోళ దేశమున వీరనారాయణ పురమునందు (కాట్టు మన్నార్ కోవిల్‌లో) క్రీ. శ. 918 లో - సింహాసనాంశతో జన్మించిరి. శ్రీరామమిశ్రులవద్ద వేదాధ్యయనము గావించి, మహాభాష్య భట్టునకడ శాస్త్రముల నధికరించి, ద్వాదశ వర్ష ప్రాయముననే వేద శాస్త్ర పారంగతులై విరాజిల్లిరి.

## వాద విజయము

యామునాచార్యులు మహాభాష్య భట్టరు వద్ద విద్యాభ్యాస మొనరించు సమయమున, చోళ రాజాస్థానమునందు, విద్వజ్జన కోలాహలుం డను రాజ పురోహితుం డొకం డుండెను. అతనికే 'ఆక్కియాళ్వాన్' అనియు నామాంతర మున్నది. అతం డా దేశమం దున్న పండితుల నందరను యుక్తి వాదమున నోడించి, వారి వద్ద కప్పమును

బుచ్చుకొనుచుండెడివాఁడు. రాజాజ్ఞ ననుసరించి భటులు వాడుక చొప్పున మహాభాష్య భట్టారకుని యొద్దకు ఉత్తరమును గొని తెచ్చి పన్ను తెమ్మనగా, మహాభాష్య భట్టరు ఖిన్నుఁడై యుండెను. దీనిని యామునాచార్యులు గమనించి, ఆ రాజ భటులు తెచ్చిన చీటిని పర పర చించివైచి,

"అరయన్ యామున దేశికాహ్వయయుత, మాయావాది వా గ్గర్వజి
ద్బిరుదాంకుండను, వేద శాస్త్ర కలనా ధియుండ, దక్షుండ, నీ
శ్వర మౌళీంద్ర కుమార శేఖరుఁడ, భాస్వ త్కీర్తి సంపన్నుఁడన్
ధర నన్ గెల్వగ రండు పండితులు - వాద స్థైర్య ధైర్యోన్నతిన్."

— (యామునాచార్య చరిత్ర)

అని, తమ బిరుద పత్రమును వ్రాసి, రాజ భటునిఁ బిలిచి, ఈ పత్రమును నీవు ప్రభువున కిమ్మని చెప్పుచు, 'పన్నీయ' మని స్పష్టముగఁ జెప్పి పంపిరి. రాజ భటు లా సంగతిని రాజ సన్నిధి నున్న విద్వజ్జన కోలాహలున కెరిగించి, యామునాచార్యు లిచ్చిన పత్రము నొసంగిరి. అంతట నా విద్వజ్జన కోలాహలుఁడు ఆగ్రహోదగ్రుఁడై, 'యామునాచార్యు లెవరో? పండితుడో? తెలిసికొనిరం'డని మరల భటులను పంపఁగా – ఆ భటులు యామునాచార్యుల వద్ద కేగి యడిగిరి. అపుడు యామునాచార్యులు –

"న వయం కవయ స్తు కేవలం
న చ వా కేవల తంత్రపారగాః
అపి తు ప్రతివాది వారణ
ప్రకటాటోప విపాటన క్షమాః"

మేము కేవలము కవులమే కాదు – ప్రతివాది గజముల యాటోపమును వారింప సమర్థులము' అని బదులు చెప్పిరి. ఈ విషయమును

విద్వజ్జన కోలాహలుఁడు భటుల ద్వారా పని, రాజుచేత యామునాచార్యులను వాదమునకు పిలిపించెను.

రాజసభా మంటప మధ్యమున మంత్రులు, సామంతులు, పురోహితులు, విద్వజ్జన కోలాహల లాటి విద్వాంసులు, పౌర - జానపదులు, భట-నట-గాయక-వంది-మాగధ-వైతాళిక-వైణిక-వాంశిక-నర్తకాదులు పరివేష్టించియుండ, ద్వాదశ వర్ష ప్రాయులగు యామునాచార్యులు రాజ సభా భవనమున ప్రవేశించిరి.

యామును లిట్లు రాజసభా ప్రవేశము గావించినపుడే విద్వజ్జన కోలాహలుఁడు యామునాచార్యుల బాల్యము నధిక్షేపించు రీతి - 'ఆకారో హ్రస్వః' (ఆకారము హ్రస్వము) అని పలికెను. దానికి యామునులు ఛలవాద* సరణి ననుసరించి, శ్లేష గుంఫితముగ యామునులు 'ఆకారో దీర్ఘః' (ఆకారము దీర్ఘము) అని ప్రత్యధిక్షేపము గావించిరి. అప్పుడే 'ప్రథమ కబళే మక్షికా పాతః' అను నానుడి కోలాహలుని యెడ సార్థక మయ్యెను. అప్పుడా చోళ రాజు—

"సంగతిఁబో యోయి యినుమంత ఓింగణాప
తత్త్వ నిర్ణయ వాదంబు దరమె నీకు
నోడితేనియుఁ బట్టి మొట్టో యనంగ
లింగమును గట్ట కుడుగ మెఱిఁగి నుడువు"

— (ఆముక్త మాల్యద : 4-6.)

ఓ యామునాచార్యా! నీవు బాలుఁడవు. పరతత్త్వ నిర్ణయ మెట్లొనర్పగలవు? వాదమునకు నీవు సిద్ధ మగుట సముచితము కాదు.

*ఛల వాద మనఁగా - వాది యొక్క యొకార్థమున ప్రయోగించిన శబ్దమునకు, ప్రతివాది మఱి యొక యర్థమును కల్పించుకొని చేయు దూషణము

— సంపాదకుఁడు.

వాదమున పరాజితుఁడనైతివేని, 'ముట్టా' యన్నను వదలక, పట్టి, లింగము గట్టి పంపుదుము. కావున, బాగుగా విచారించుకొను' మని హెచ్చరిక జేసెను. అంతట యామునాచార్యులు తమ బహుముఖ ప్రజ్ఞా విశేషములను, పాండిత్య ప్రకర్షను వ్యక్తము గావించుచు -

"ఆశైలా దద్రికన్యా చరణ కిసల న్యాస దన్యోపకంఠాత్
ఆరక్షో నీత సీతా ముఖ కమల సముల్లాస హేతోశ్చ సేతోః
ఆచ ప్రాచ్య ప్రతీచ్యా క్షితి ధర యుగళా దర్క చంద్రావతంసాత్
మీమాంసా న్యాయశాస్త్ర శ్రమ విమల మనా మృగ్యతాం మాదృశోఽన్యః."

పార్వతీ సంచారముచే రమణీయమైన హిమవత్పర్వతము మొదలు, రావణునిచే తీసికొని వెళ్ళబడిన సీత ముఖ పద్మము వికసించుటకు కారణమైన సేతువు వఱకును సూర్యచంద్రు లాభరణముగాఁ గల కొండలవఱకు - పూర్వోత్తర మీమాంసల రెండింటి యందును పరిశ్రమచే నిర్మలమైన మనస్సు గలవాఁడు నావంటివాఁడు మఱియొకఁడు వెదకబడుగాక!' అని పలికిరి ('అనఁగా - తన కంటెను మించిన పండితుడు మఱియొకడు లేఁడని తాత్పర్యము.)

ఆ పలుకులను విన్నంతనే యామునాచార్యుల వైదుష్య వైశిష్ట్యమును విజ్ఞాన వేత్తలు గ్రహించిరి. వాద మారంభ మాయెను. విద్వజ్జన కోలాహలుఁడు మొదట యుక్తితో యామునాచార్యు లన్న ప్రతి మాటను కా దన గల నని పలికెను. వాదమున విద్వజ్జన కోలాహలుఁడు జయింపఁగల డని రాజును, యామునాచార్యులే జయించు నని రాజు భార్యయు పంతము లాడుకొనిరి. యామునాచార్యులు జయించినచో అర్ధరాజ్య మిచ్చెద నని రాజు ప్రతిజ్ఞ చేసెను.

యామునాచార్యు లపుడు విద్వజ్జన కోలాహలునితో 'రాజు ధర్మశాలి, రాజు భార్య పతివ్రత, నీ తల్లి వంధ్య కాదు' అని విచిత్రముగఁ బలికి, ఈ పలుకులను పూర్వపక్షము చేయఁగోరెను,

అప్పుడు కోలాహలుఁడు సందిగ్ధ మనస్కుఁ డాయెను. రాజు ధర్మ శాలి కాఁ డనియు, రాజుభార్య పతివ్రత కా దనియు, తన తల్లి వంధ్య యనియు కోలాహలుఁ డెట్లు చెప్పఁ గలఁడు? కా దన్నచో - రాజాగ్రహ సంతప్తుఁ డగును. కాన, ఏ మనలేక, నిరుత్తరుఁ డాయెను. అతని కోలాహలము వికల మాయెను. సభ నిశ్చేష్ట మయ్యెను. రాజు మోము వెల వెల బారెను. రాజుభార్య పరమ హర్షము నందెను. వాదమున నిట్లు యామునాచార్యులు జయించెను. అందుచే నపుడు - 'ఎన్నై ఆళవందారో ?' (నన్ను కాపాడుటకు వచ్చితిరా ?) అని రాజు భార్య — యామునాచార్యులను ప్రశంసించెను. నాటినుండియు యామునాచార్యులకు 'ఆళవందారు' లను పేరు ప్రసిద్ధ మయ్యెను.

ప్రతిజ్ఞ ప్రకారము యామునాచార్యులకు రాజు - అర్థ రాజ్య మిచ్చెను. యామునాచార్యు లా యర్థ రాజ్యమును పాలించుచు, గృహస్థాశ్రమమును స్వీకరించి, సంతాన సౌభాగ్యమును బడసిరి. చాల కాలము యామునులు రాజ భోగము లనుభవించుచు సుఖించి, గురువు లగు రామ మిశ్రులను విస్మరించిరి. కాని, రామ మిశ్రులు యామునులను కలిసికొనుటకై త్వరపడుచుండిరి. ఏలన, గురు వచనానుసారము రామమిశ్రులు యామునులకు తత్త్వోపదేశము గావించి, ఆయనను భక్తి మార్గ గామిగ చేయవలె నను అభిప్రాయముతో నుండిరి. రామ మిశ్రులు కార్యసిద్ధికై ఉపాయ మాలోచించిరి. యామున రాజేంద్రుల వంటవానితో చెలిమి చేసి, యామునుల కత్యంత ప్రీతి పాత్రమైన అలర్క శాకమును (ముళ్ళ తోటకూరను) ఆరు మాసముల కాలము రాజ భోజనార్థము వాని కొసంగిరి. అరు దగు ఈ యలర్క శాక మెక్కడి దని యామునులు జిజ్ఞాసువు లైరి. ఆ సమయమున రామ మిశ్రులు - నాల్గు రోజులపాటు ఆ కూర దెచ్చుట మాని, యామున దర్శనోపాయము నెరింగింపు మని రంగనాథుని

ప్రార్థించుచు గడిపిరి. యామున రాజేంద్రులు వంటవానిఁ జూచి, ముళ్ళ తోటకూర లేని కారణ మేమని ప్రశ్నింప, అతఁడు - రామ మిశ్రులను వారొకరు దాని నిచ్చుచుండి రనియు, ఆకస్మికముగ ఇచ్చుట మానివేసె ననియు విన్నవించెను. అటుపిమ్మట యామున రాజేంద్రులు రామ మిశ్రులు వచ్చిన యెడల, వారిని తమ వద్దకు తీసుకొని రమ్మని వంటవానికి ఆజ్ఞాపించెను. నాల్గు రోజుల తర్వాత రామమిశ్రులు మరల రాగా, వంటవాఁడా రామ మిశ్రులను యామున దర్శనమునకు వెంట నిడుకొని పోయెను. ఈ రీతిగ రామమిశ్రులకు రాజ దర్శనము లభించెను.

రామ మిశ్రులు యామున రాజేంద్రుల దర్శించి, తమను పరిచయము గావించుకొని, ఆ యామునులకుఁ గల బ్రహ్మ జిజ్ఞాసను భగవద్గీతోపదేశమున సుదృఢము గావించిరి. వెంటనే యామునులకు జ్ఞానోదయ మొంది, రాజ్యమును తృణ ప్రాయముగ పరిత్యజించి శ్రీరంగమునకు వెడలిరి. భక్త శిరోమణి యయి, వాసి కెక్కిన నాథ మునులు పరమపదించిన పిమ్మట కొంత కాలమునకు వీరు మత ప్రవర్తకులుగ నెన్నుకొనఁబడిరి కావున, వీరు ఆచార్య పరంపరలో నొకరుగా పరిగణింపఁబడుచున్నారు. యామునాచార్యులకు - యమునైత్తురై వరై, యామున యోగి, సింహాసనాంశమని మున్నగు నామాంతరము లున్నవి.

యామునాచార్యులకు ఇరువది యొక్క మంది ముఖ్య శిష్యులు కలరు. అట్టి వారిలో - పెరియ నంబి, తిరుకోట్టియూర్ నంబి, తిరుమాలై నంబి, మారనేర నంబి మొదలగు వారనేకులు కలరు. చోళరాజ దంపతులనుఁ గూడ యామునాచార్యులు వైష్ణవ మతావలంబులఁ గావించిరి. ఆ రాజ దంపతులు తమ రాజ్యమును రంగనాథునకు సమర్పించి ధన్యులైరి

## కృతి రత్నములు

యామున మునీంద్రులకు నమ్మాళ్వారుల దివ్య ప్రబంధములు మిక్కిలి ప్రియమైనవి. ఈ యామునులు గ్రంథ షట్కమును రచించిరి.

౧. *స్తోత్ర రత్నము :* ఇందు అరువది ఐదు శ్లోకము లున్నవి. భగవంతుని దివ్య మంగళ విగ్రహ వర్ణనాత్మకములు, స్వీయ దోష ప్రకటనాపరములు, భిక్షా ప్రార్థనాత్మకములు, శ్రియఃపతి పరత్వ స్ఫోరకములు నగు ఈ శ్లోకములలో - భగవానుడు భువన సుందరమూర్తి యని యామునాచార్యులు ప్రశంసించిరి. భగవ త్పాదా రవిందములకడ ప్రపత్తి చేసిరి.

భగవంతుఁ డగు నారాయణుఁడే సకల జగత్కారణుఁడు; సర్వ దేవాధికుఁడు; సమస్త కళ్యాణ గుణాకరుఁడు. భగవంతుని శర ణాగతి చేయుటయు, మోగమున కాలంబన మగు దివ్య మంగళ విశిష్ట సమస్త హేయ ప్రత్యనీక భగవ త్స్వరూపము, స్వనైచ్యము, ఆచా ర్యుని వలన మోక్షము ఇంకను ఇట్టి విశిష్ట విషయము లనేకము లిందు వర్ణింపఁబడినవి.

పరబ్రహ్మ దయ అపారమైనచో - ఆ దయకు పాత్రమైన వస్తువు దోష భూయిష్ఠుఁ డగు తానే యనియు యామునులు వక్కా ణించిరి. దోషికి క్షమా భిక్ష యొసంగనిచో - పరబ్రహ్మ దయ కర్థ మేమి? అనంతర దయా గుణ ప్రకటనమునకై పరబ్రహ్మమునకు దోషి యావసరము గదా! యామును లన్ని సంగములను పరిత్యజించి, పరబ్రహ్మ పాదములపై మనస్సును లగ్నము చేసిరి. స్వీయము లగు అకించనత్వము, నిస్సహాయ స్థితి, అహం భావ దమనము ఈ స్తోత్ర రత్నమున ప్రస్ఫుట మగును.

"న ధర్మ నిష్ఠోఽస్మి న చాత్మవేదీ
న భక్తి మాం త్వ చ్చరణారవిందే
అకించనో ఽనన్యగతి శ్శరణ్యం
త్వ త్పాద మూలం శరణం ప్రపద్యే."

నేను ధర్మనిష్ఠ కలవాఁడను కాను. అకించనుఁడను. గత్యంతరము లేనివాఁడను రక్షకా! నీపాదములను శరణుజొచ్చుచున్నాను.

"న నిందితం కర్మ య దస్తి లోకే
సహస్రశో యన్న మయా వ్యధాయి
సోఽహం విపాకావసరే ముకుంద।
క్రందామి సంప్రత్య గతి స్తవాగ్రే"

నేను పలుమారు చేయని పాపకర్మ లేదు. కాని, ఆ పాపము ఫలించెడి కాలమున గతి లేనివాఁడనై నీ యెదుట మొర పెట్టుకొను చున్నాను"

ఇట్టి భావనాకరంపరలతోఁ గూడిన ఈ స్తోత్రరత్నము నందలి శ్లోక రత్నములు, ఉజ్వలములుగా - ఓజో గుణ స్ఫోరకములుగా - లలిత వైదర్భ రీతి సంభరితములుగా - ఉదాత్తములుగా నొప్పారు చున్నవి.

భక్తుఁడు భగవ ద్విరహమును సహింపఁజాలఁ డనియు, సుఖ పరంపరానుభవము భక్తుని భగవంతునకు దూరము సేయు ననియు ఈ స్తోత్ర రత్నము అభివ్యక్తము గావించుచున్నది. ఈ స్తోత్ర రత్న పంచకము శ్రీమ ద్రామానుజులను యామునుల వైపు నాకర్షించినది.

ఈ స్తోత్ర రత్నమునందలి 'అమర్యాదః క్షుద్రః', 'న ధర్మ నిష్ఠోఽస్మి' ఇత్యాది శ్లోకములు కొన్ని భగవ ద్విషయమున వ్యాఖ్యా నము చేయఁబడినవి. 'నమో నమో వాఙ్మన సాతి భూమయే', 'న

ధర్మ నిష్ఠోఽస్మి', 'విలాస విక్రాంత', 'అపరాధ సహస్ర భాజనం', 'న దేహం న ప్రాణాన్', 'కదా పునశ్శంఖ' ఇత్యాది శ్లోకములు భగవదారాధన యందు నేటికిని అనుసంధింపబడుచున్నవి.

ఈ స్తోత్ర రత్నమునకు కృష్ణసూరి (పెరియవాచ్చాం బిళ్ళై) వ్యాఖ్య, వేదాంత దేశిక వ్యాఖ్య, తత్త్వ ప్రకాశిక వ్యాఖ్య, భావనాచార్య వ్యాఖ్య అను నాల్గు వ్యాఖ్య లున్నవి. వేదాంత దేశికులు తమ వ్యాఖ్యానమున స్తోత్ర రత్న హృదయము 'ప్రపత్తి' యని అభివర్ణించిరి.

౨. చతుశ్శ్లోకి : ఇందు లక్ష్మీ స్తోత్ర పరము లగు నాల్గు శ్లోకము లున్నవి. ఇవి తరువాత వచ్చిన లక్ష్మీ స్తోత్రములకు మార్గదర్శకము లయ్యెను. వేంకట నాథులు తమ చతుశ్శ్లోక వ్యాఖ్యానమున, శ్రీవైష్ణవ సంప్రదాయమందు లక్ష్మీ దేవికి గల స్థానమును చర్చించి వివరించిరి. లక్ష్మి - నారాయణుని కంటెను వేరైనది. కాని సర్వదా నారాయణుని సాహచర్యము కలది. శ్రీ దేవి - నారాయణు నందలి భాగమను వాదమును వీరు నిరసించిరి. మంగళ దేవత మాయాత్మకము కాదు. నారాయణునితో లక్ష్మికి అత్యంత సన్నిహిత మగు అవినాభావ సాహచర్య మున్నది. తల్లి వలె కాపాడి, లక్ష్మి - పరబ్రహ్మ దయను భక్తులకు ప్రసరింపజేయును. లక్ష్మీనారాయణులకు పరస్పరానుకూల [illegible] మగు సార్వత్రిక సామాన్య మున్నది. లక్ష్మి జీవకోటిలోని [illegible] నారాయణాంతర్భాగమే యనియు, ప్రత్యేక మగు వ్యక్తిత్వము గల్గిన భగవత్పరతంత్ర యనియు దేశిక వక్కాణ.

భగవంతునికి భార్యకు గల సంబంధము - సూర్యునికి తత్కిరణములకు, సుమమునకు తత్సౌరభమునకు గల సంబంధముతో పోల్చ దగినది. 'అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా'

(సూర్యునితో కాంతి వీడి యుండనట్లు, రాఘవునితో నేను వీడి యుండను.) అని సీతాదేవి పలికియున్నది గదా !

౧. **సిద్ధిత్రయము** :- ఆత్మసిద్ధి ఈశ్వరసిద్ధి, సంవిత్సిద్ధి అను మూడు సిద్ధుల సముచ్చయమే ఈ గ్రంథము. ఇందలి చివరి ప్రకరణమగు సంవిత్సిద్ధిలో - మాయావాద ఖండనము ఆత్మస్వరూప నిరూపణము చేయబడినవి.

౨. **గీతార్థ సంగ్రహము** :- విశిష్టాద్వైత మతానుసారముగ గీతారహస్య సిద్ధాంతము లిందు పొందుపరుపబడినవి.

౩. **ఆగమ ప్రామాణ్యము** :- ఇయ్యది యామునాచార్యుల పాండిత్య ప్రకర్షను ప్రస్ఫుటీకరించు విశిష్ట గ్రంథము. పాంచరాత్ర సిద్ధాంత ప్రామాణ్యమిందు విపులముగా నిరూపింపబడినది.

౪. **మహాపురుష నిర్ణయము** :- ఈ గ్రంథమున విష్ణువైశిష్ట్యము విపులముగ దెలుపబడినది. ఈ గ్రంథమిపు డలభ్యము.

## యామునుని విశిష్టాద్వైతము

### ఆత్మ వాదము - పూర్వపక్ష వాదము

పూర్వము బోధాయనుడే వైష్ణవ సిద్ధాంత ప్రవర్తకుడైనను, ఆయనచే రచింపబడిన బ్రహ్మసూత్రవృత్తి ఉపలబ్ధము కానందున, యామునాచార్యులే అందించిన వైష్ణవ సిద్ధాంత ప్రవర్తకులలో మొదటివారని చెప్పవచ్చును. టంక, ద్రమిడ, భారుచి ప్రభృతులు బోధాయన వృత్తి ననుసరించి గ్రంథములు రచించి, పూర్వ వాదముల నిరసించిరి. ద్రమిడ భాష్యము శ్రీవత్సాంక మిశ్రులచే విపులీకరింపబడి, యామునులచే పుష్టిం గల్గినది. అర్వాచీన సిద్ధాంత చరిత్రకు యామునాచార్యులే నాంది పల్కిరని చెప్పవచ్చును. యామునులు

మహా పూర్ణులకు గురువులు. ఈ రీతిగా శ్రీరామానుజులకు పరమాచార్యులైన యామునాచార్యుల విశిష్టాద్వైతమును గ్రహించు తరుణమున, తద్విరుద్ధములగు చార్వాకాది మత సిద్ధాంతముల నొకింత పరామర్శింప నావశ్యకము.

చార్వాక మతము :-

చార్వాకులు దేహాత్మవాదులు. శరీరమే ఆత్మ యనియు, పంచ భూతములనుండి చైతన్య ముత్పన్న మైన దనియు, శరీరము కంటెను ఆత్మ వే రనియు వీరి మతము. వీరి మూల గ్రంథము బృహస్పతి సూత్రములు.

యామున దర్శనము చార్వాకులకు విరుద్ధమైనది. 'ఇది నా శరీరము' అను వచనము భేదమును సూచించుచున్నది. ఈ రెండు విజ్ఞానములును భిన్నములు. 'ఇది కుండ', 'ఇది కటము' అను వానివలె 'ఇది నా శరీరము' అను వానివలె 'ఇది నా శరీరము' అను వచనము బాహ్య వస్తు వాచకము. ఇంద్రియములను అనుసరించి, బాహ్య వస్తు జ్ఞానోదయము నరికట్టి, ఆత్మయందే అంతర దృష్టిని కేంద్రీకరించి నపుడు - స్వీయ ఆత్మ జ్ఞానము మిగిలియే యున్నది. ఈ యాత్మ జ్ఞానోదయము శరీరావయవ జ్ఞాన సాపేక్షము కాదు. అట్టి శరీరావయవ మున్నపుడు ఆత్మ జ్ఞానము శరీర జ్ఞానము కాజాలదు. 'నేను లావుగా నున్నాను' 'నేను కృశుడను' అను వచనములందు - 'నేను' అను పదము బాహ్య స్థూల - కృశ శరీరములను సూచింపదు అచింత్యాద్భుతాంతర వస్తువును సూచించును. ఈ యాంతర వస్తువును శరీరముగా భావించుట పొరపాటు 'ఇది నా శరీరము' 'ఇది నా యిల్లు' అని మన మనుకొనుట మనమే విస్మరింపరాదు. ఇట దేహము ఇతర వస్తు సామాన్యముగ ఆత్మకంటె భిన్న మను బాహ్య వస్తువుగ భావింపబడినది. కాని, 'మమాత్మా' నా ఆత్మ అందుము కదా!

అని పూర్వ పక్షము కాని, యిట భాషా ప్రయోగ కృతము. వస్తుతః వస్తువు ఒకటియే. దేహాత్మవాదము [illegible] 'నేను' అనఁగా - దేహమే యను భావము అజ్ఞాన విజృంభితము. ఆత్మను పరిదృశ్య మాన రూపము లేక రూపము గలవి భౌతిక వస్తువులు ఘట పటాదుల రూపములు వాని రూపమును పరిశీలించును. నిరూప మగు ఆత్మతో తృప్తి నందక, దేహాత్మవాదా లంబకు లైరి. ఆత్మ యొక్క ఇచ్ఛ ననుసరించి దేహ వికారములు గల్గుచున్నందున, దేహాత్మవాద మును కొందర వలంబించిరి. ఇది అజ్ఞాన విజృంభితము, వివేచనా శక్తి శూన్యత.

నేను భోక్తను. బాహ్య వస్తువులు భోగ్యములు. నేను బాహ్య వస్తువుల కొఱకు కాదు. మన శక్తి వలె చైతన్యము పంచభూత సంఘాత జన్యము కాదు. ఏలన, సృష్టి సంఘాతము ప్రకృతి శక్తిని సృజింపఁజాలదు కారణ శక్తి - కార్య సృష్టి కన్న యధికమైన పరిమి తము. మన శక్తి-సృష్టివిషయమున కారణమే [illegible] కారక శక్తి మంతము లగు పరమాణువులే. మనశక్తి చైతన్య మునకు సామ్యము లేదు. చైతన్యమునకు మఱి యే యితర భౌతిక కార్యముతో పోలిక మృగ్యము. చైతన్య కారకము లగు పరమాణువు లున్నవని చెప్ప నొప్పదు. 'చైతన్యము రసాయనిక వికార కారణము' అని యున్నచో- సున్నము, వక్క, తమలపాకుల కలయిక వలన కలుగును. రక్త రాగము వలె చైతన్య పరమాణువు లుద్భవిల్లును. కాని చైతన్యము భౌతిక, రసాయనిక కార్యమువలె చైతన్య కణము [illegible] గా భావింప వలసియుండును. పై దృష్టాంతమున తాంబూల రాగము తదంతర్గత ప్రతి కణమునకు చెందియున్నది. కాన, చైతన్యము పాంచ భౌతిక రసాయన కార్య మైనచో - కలివయ చైతన్య కణోద్భవ సంభవ మగును. ప్రతి చైతన్య కణము ఒక్కొక్క ఆత్మ [illegible] సాక్షాత్కా రింపఁ జేయును. అపుడు పైయక్తిక చైతన్య మొకటి కాదు - భిన్న

మగును. భవ మొకటి కాదు - విభిన్న మగును. ఏకత్వము సున్న యగును. కనుక, చైతన్యము దేహ భిన్న మగు ఆత్మ వస్తు ధర్మ మని అంగీకరింపక తప్పదు.

చైతన్యము ప్రత్యేకము; ఇంద్రియ గ్రాహ్యము కాదు. ఒక్కొక్క ఇంద్రియమునకు ఒక్కొక్క చైతన్య మున్న యెడల, 'నే నిది వరకు చూచిన వస్తువునే ఇపుడు తాకుచున్నాను' అను జ్ఞాన ముత్పన్నము కాజాలదు. ఇంద్రియము లన్నియు చైతన్య ముత్పాదింపఁ జేయు నన, మనము ఒక్క ఇంద్రియములతో నేమియు నహింపఁ జాలము. ఇంద్రియ మొండు నష్టమైనచో, పూర్వము తీ దింద్రియ విషయమైన పూర్వ వస్తు జ్ఞానము గాని, స్మృతి గాని సంభవము కాదు. మధ్యలో అంధత్వము ప్రాప్తించినవానికి చైతన్య ముండదు, పూర్వ దృష్ట వస్తు జ్ఞానము గాని, స్మృతి గాని యసంభవ మగును.

మనస్సు ఆత్మ యని భావింపరాదు. అది అంత రింద్రియము. జ్ఞానము యుగప దుత్పన్నము కాదు, పౌర్వాపర్య నియమానుసార ముగ నుత్పన్న మగును - అని మాత్రమే ఋజువు చేయుచుండును. 'యుగపత్ జ్ఞానా నుత్పత్తిః మనసా లింగమ్' - అని నైయాయిక మతము. మనస్సు పూర్వాపర నియమానుసారముగ జ్ఞాన ముత్పాదించు నన్నచో, అపు డీ ఆత్మాస్తిత్వ మంగీకరించినట్లే. యామునాచార్యులు 'ఆత్మ' యన్న వస్తువునే చార్వాకులు 'మనస్సు' అనుచున్నారు.

బౌద్ధము :-

విజ్ఞాన వాద బౌద్ధులు చైతన్యము - లేక, జ్ఞానము స్వయం ప్రకాశక మనియు, విషయ ప్రకాశక మనియు భావించి, విజ్ఞానమే

ఆత్మ యని వాదింతురు ఈ పూర్వ పక్షమునకు యామును లు విజ్ఞాన మునకు సదా ఆశ్రయ మగు శాశ్వత వస్తువు నంగీకరింపనిచో - క్షణిక విజ్ఞానావస్థలు వైయక్తిక ఐక్యమును, తాదాత్మ్యమును, ప్రత్యభిజ్ఞను సాధింపజాల వని సమాధాన మొసంగిరి. ప్రవాహ రూప మగు క్షణిక విజ్ఞాన సంతానమే యుండి, శాశ్వత మగు ఆత్మ లేనిచో, గతానుభవ - ప్రస్తుతానుభవైక్యము అసాధ్య మగును. శాశ్వత వస్తువు లేనందున, విజ్ఞానావస్థ క్షణిక మైనందున, జ్ఞానాస్తిత్వము అనూహ్యము. వైయక్తిక తాదాత్మ్యము, ప్రత్యభిజ్ఞ గగన కుసుమాయమానము లగును. ఒక జ్ఞానావస్థ అంతరించిన తర్వాత, మరి యొక విజ్ఞానావస్థ వచ్చుటకు సాదృశ్య పూర్వక సాధ్య భ్రమ కూడ అసాధ్య మగును.

శాంకర మతము :-

శాంకర మతమున ప్రతిపాదింపబడిన నిర్విశేష చిన్మాత్ర నిత్య శుద్ధ చైతన్య మసంభవ దూరము. చైతన్యము వైయక్తికము, ఉత్పన్నము, పరిమిత కాల సంభావితము. తదుపరి వినష్టముగ భాసించు చున్నది. గాఢ సుషుప్త్యవస్థలో విజ్ఞానము లేదు. గాఢ నిద్ర నుండి లేచిన వెంటనే మనము ఒడ లెరుంగక నిద్రించితి మను భావమును ఋజువు చేయును.

అద్వైత వాదానుసారము అహం ప్రత్యయాధార మగు అంతః కరణమే గాఢ నిద్రలో లీనమైన దన్నచో - నిద్ర లేవగనే, 'నే నింత కాలము నిద్రించితిని' అను అనుభూతి గలుగదు. శుద్ధ విజ్ఞాన మనుభవ ప్రత్యనీకము. విజ్ఞానము వైయక్తికము. శాంకరీయులు జ్ఞానోదయ మన్న, జ్ఞాన తత్సముయ తద్విషయైక్య మవి యందురు. ఇది సరి కాదు. వస్తు విషయక జ్ఞాన సత్యత్వము దేశ కాల పరిచ్ఛిన్నమే కాని, విషయ స్వభావ గుణ - జ్ఞాన స్వభావ గుణ పరిచ్ఛిన్నము

కాదు. విజ్ఞాన మశాశ్వతము. అది కాల నియత మితము. నీరూప మగు జ్ఞానము మృగ్యము, అనుభవ దూరము.

ప్రత్యక్ష అనుమాన ప్రమాణ జన్యము విజ్ఞానము. రూప గుణ వికార రహిత మగు జ్ఞాన మసంభవము. శాంకరీయులు ఆత్మను శుద్ధ చైతన్యముగ, అనుభూతిగ భావింతురు. కాని, ఆత్మ - అనుభూతికి కర్త యగును. అనగా - జ్ఞాన మగును. జ్ఞాన మాత్రము కాదు. బౌద్ధము నందు వలె శాంకర మతమున కూడ ప్రత్యభిజ్ఞ దుస్సాధ్య మగును. ప్రత్యభిజ్ఞ - లేక, నైయాయిక అనుభవ మను స్మృతముగ నుండుటకు జ్ఞాత - భూత వర్తమాన కాలములం దుండు వాడు కావలెను. ఉదాహరణమునకు - 'నే నది యనుభవించితిని.' కాని, ఆత్మ శుద్ధ చైతన్య మాత్రమే అయినచో - భూత వర్తమాన కాల నిష్ఠుం డగు జ్ఞాత యుండడు. 'నే నిది యనుభవించితిని' అను జ్ఞానము వివదీకృతము కాదు. పై పెచ్చు - భ్రమ విజృంభిత మని నిరసింపఁబడును. వస్తు జ్ఞానము మనకు - 'నేను జ్ఞాన మను' (చైతన్యము) అను రూపమున భాసింపదు. 'నేను దీనినిఁ గూర్చిన ఆకార వికారము లన్నియు శుద్ధ చైతన్యమునం దభ్యాసములే' యన్నచో - శుద్ధ చైతన్యము మూర్ఖులకు లో నగును. మరియు - 'నేను జ్ఞానము కలిగించుచున్నాను' అనుటకు బదులు, 'నేను విజ్ఞానమునై యున్నాను' అనవలసివచ్చును. శాంకర మతమున జ్ఞాత - అను అభిమానము శుద్ధ చైతన్యమునం దధ్యస్తము కాదు. అది చివరి వరకు నుండునది కదా! అనఁగా - మోక్ష పర్యంత ముండునది కదా యని. అవునని తత్త్వ జ్ఞాన ఫలితము ఆత్మజ్ఞాత కాదని తెలిసికొనుటయే యగును కనుక, అట్టి తత్త్వ జ్ఞానోదయమునకన్న మిథ్యాజ్ఞానమే వరణీయ మగును.

'నాకు తెలియును' అను జ్ఞానము ఆత్మను జ్ఞాతగా నిరూపించును. అట్టి జ్ఞాతకంటె వేరైన శుద్ధ చైతన్యానుభవ ముండదు.

'అహ మర్థ ఏవాత్మా' అని, శ్రీభాష్య సూక్తి. 'నేను' అను భావము జ్ఞాతను దేహమునుండి, ఇంద్రియములనుండి, మనస్సునుండి, జ్ఞానము నుండి కూడ పృథక్కరించును. అట్టి ఆత్మను 'సాక్షి' యందురు. 'సాక్షా ద్ద్రష్టం సంఖ్యాయాం' అని పాణిని సూత్రీకరించెనుకదా!

శాంకరీయులు గాఢ సుషుప్తిలో అహం ప్రత్యయ గోచర విషయక మగు జ్ఞానము లేదందురు. ఇది నిజము కాదు. వ్యక్తి గత సంబంధములు 'ఫలానా కుటుంబము వాఁడను, ఫలానా స్థితిలో నున్నానః' అను జ్ఞానము సుషుప్తిలో నుండదు. కాని, అహం ప్రత్యయము నిజ్ఞాన ధర్మ మనుట అనుభవ దూరము 'నేనీ జ్ఞానమును కల్గియున్నాను' అని యనము. మోక్ష దశలో - ఆనందానుభవ భోక్త యగు కర్త లేనిచో - ఎవఁ డట్టి మోక్షము నాశించును? మోక్ష మహం ప్రత్యయ వినాశక మయినచో - పలు కష్టముల కోర్చి, ఎవఁ డట్టి మోక్షమునకై యత్నించును? యమ - నియమ - ఉపవాస - తపో క్లేశము లెవ్వఁ డట్టి మోక్షమునకై భరించును? శుద్ధ చైతన్య మెందులకు? భగవంతుఁడు అహం ప్రత్యయ విశిష్టుఁ డనియు, ఉప నిషత్తులు తెల్పెను. 'నేను ఈ జగత్తు సృష్టించినాను' అని దేవుఁ డనెనుగదా! అహం ప్రత్యయము గర్వ కారణమై, దేహ జన్మ బాహ్య స్థితులలో నొకటిగ భావింపఁబడినచో - అట్టి భావము అజ్ఞాన విజృంభిత మని వేదములు నిరసించినవి. 'అహ మర్థయే వాత్మా' అను ఆత్మ సూచక మగు అహం భావము చాల సరియైనది, సత్యమైనది. ఆత్మ అణు స్వరూపము కలది. విభు స్వరూప మైనచో - సర్వ విషయిక మగు యుగపత్ జ్ఞానోత్పత్తి యగును.

మీమాంసకులు :-

నిరీశ్వర వాదులు మీమాంసకులు. సర్వజ్ఞుఁ డగు నీశ్వరు నె ట్లూహింపఁగలము? సర్వజ్ఞత్వము ప్రత్యక్ష విషయము కాదు.

భూత వర్తమాన విషయములు సర్వమును ప్రత్యక్ష గోచరములు కావు ఇంద్రియ సంనికర్షము లేక, ప్రత్యక్ష జ్ఞానము కలుగదు. యోగి ప్రత్యక్ష ప్రమాణము కూడదు. ఏలన, ఇంద్రియ ద్వారమున సర్వ విషయ జ్ఞానము కలిగింప సాధ్యము కాదు. అంతఃకరణ మన్నియు చూడగల దన్నచో ఇంద్రియముల వలన ప్రయోజన మేమి? అత్యంత కేంద్రీకృత మనోవృత్తి ద్వారా విశదాభాసము సాధ్యమే కాని, తద్ద్వారా శబ్దాదు లితరు లింద్రియ గ్రాహ్యము కాదు. ఇంద్రియ నిరపేక్షముగ విషయ జ్ఞానము కలుగదు. కాన, సర్వజ్ఞత్వ మసాధ్యము - అగ్రాహ్యము - నజ్ఞేయమును. ఇంద్రియావిషయము - సర్వజ్ఞుఁ డగు ఈశ్వరుఁ డనుమాన ప్రమాణ సాధ్యుఁడు కాఁడు. ఈశ్వరుడు పరిదృశ్యమాన జగదుత్పత్తికర్తుఁడు అని భావన ఉన్నచో - ఈశ్వర సహచర మగు కారణముల వ్యాప్తి జ్ఞానము లేనందున ఈశ్వరాస్తిత్వ మనుమాన సాధ్యము కాదు.

## యామున దర్శనము

యామునాచార్యులు న్యాయ పద్ధతి ననుసరించి, ప్రపంచము కార్య మనియు, విజ్ఞానవంతుఁడు సామగ్రీ జ్ఞాత యగు కర్తచే సృష్టింపఁబడిన దనియు స్థాపించిరి. సమస్త ధర్మాధర్మ జ్ఞానము గల సర్వేశ్వరుఁడు మానవ కోటిని సృజించి, వారికి తగిన యనుభూతులనే కలుగఁజేయును. సంకల్ప మాత్రముననే ప్రపంచమును ప్రవర్తింపఁ జేయును. అనంత శక్తిమంతుఁడు - అద్భుత విజ్ఞాన ఖనియు కాకున్న, ఈ బ్రహ్మాండ భాండము నెట్లు సృష్టింపఁగలఁడు? భగవంతునకు శరీరము లేదు. మనో సంకల్ప మాత్రమున నిర్వహించును.

శాంకరీయులు 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా' అనుటయే ఔపనిషద హృదయ మనిరి. 'బ్రహ్మ యొక్కఁడే ఉన్నాఁడు.' అనఁగా -

'జగత్తు మిథ్య' అని యర్థము కాదని యామున వ్యాఖ్యానము. దాని యర్థ మేమన, ఈశ్వరునివంటి వస్తువు మఱి యొకటి లేదనియే. 'సూర్యుం డన్నాండు' అనఁగా - సూర్య కిరణములు లేవని భావము కాదు. ఆ యుపనిషద్వ్యాఖ్యానముల యర్థ మేమన, అగ్నినుండి విస్ఫులింగములవలె ప్రపంచము బ్రహ్మ సముద్భూత మనియే. ప్రపంచము మిథ్య యయ్యెనా, అనుభవము మిథ్య యగును. భేద ధిక్కార వాదము నిరుపయోగము. భేదములు, సంబంధములు అనుభవ సిద్ధములు. నీల వర్ణము, ఉత్పలము (కలువ పూవు) చూతుము. నీల వర్ణము గల దని గ్రహించుదుము. ప్రపంచము, జీవకోటి, ఔపనిషద మగు ఉపదేశానుసారముగ భగవంతుని యందు అవినాభావ సంబంధము గలవి యని భావింపవచ్చును. ఇది సముచితము కూడ. బ్రహ్మేతర మగు సర్వము వినాశ మగు వాదముకంటె నిది యుక్త తరము. నిర్విశేష చిన్మాత్ర బ్రహ్మ మసంగతము - నైయక్తిక సుఖ దుఃఖానుభవములు భిన్నములుకదా! చిన్మాత్ర బ్రహ్మ మొక్కటే సత్యమైనచో - అన్ని వస్తువులును సర్వదా యుగపద్భావ సమానములు కావలయును. ఆ చైతన్యము సచ్చిదానంద స్వరూప మని చెప్పుదురు. ఈ త్రివిధ స్వరూప మంగీకరింపఁబడినచో - శాంకరాద్వైతము మటుమాయ మగును. 'ఇవి వేర్వేరు గుణములు కావు' అన్నచో అర్థము సార్థకము కాదు. ఆనందము, చిత్తు ఒకటి యగునా? ఆనందము, చిత్తు వేర్వేరుగ నుండుట అనుభవము. కనుక, శాంకరాద్వైతము న్యాయానుగృహీతము - క్షేప క్షమము కాదు. మనకు గల బాహ్యజ్ఞానము లన్నియు నానాసాధనములైనవి - నిజమైనవి - బాహ్య ప్రపంచమును సత్యముగ సూచించునవియై యున్నవి. పరిదృశ్యమాన ప్రపంచమును మిథ్య కాదు - నిజము ఇది అనుభవ సిద్ధము.

ఇట్లు యామునుని వర్ణనమున సంవిత్సముల్లసితము లగు ఆత్మలు, సర్వజ్ఞ - సర్వశక్తి యుక్తుం డగు ఈశ్వరుఁడు, పరిదృశ్య

మాన భేదయుక్త బాహ్య విశ్వము నిరూపింపఁబడినది. ఈ తత్త్వ త్రయము సత్యము, ప్రపంచము ఈశ్వరునుండి విస్ఫులింగములవలె వెల్వడిన దని చెప్పవచ్చును. ఇది యామునులచే దిఙ్మాత్రముగ సూచితము.

న్యాయ దర్శనానుసారముగ, ఈశ్వరుఁడీ యనంత చరాచర విశ్వ స్రష్ట యని యామునులు భావించిరి. ఈశ్వర ప్రపంచ సంబంధ విషయమున తమ 'ఆగమ ప్రామాణ్యము' నందును, 'సిద్ధి త్రయము' నందును యామునులు న్యాయ దర్శనానుసారముగ సిద్ధాంతీకరించిరి. ప్రపంచ - ఈశ్వర తత్త్వములు రెండును సత్యములే. సిద్ధి త్రయము నందలి యామున ప్రతిపాదిత మగు ముఖ్య సిద్ధాంతము ఆత్మ - స్వీయ సంవి త్స్వముల్లసిత మని స్థాపించుటయే. బాహ్య ప్రపంచ సత్యత్వము, ఈశ్వరాస్తిత్వము పూర్వ దర్శనములందు కూడ అంగీకరింపబడినది. ప్రపంచము సత్య మని యామునులు నిరూపించిరి. నైయాయికుల నిరవయవాణువుల సత్త్వమును యామును లంగీకరింపలేదు. గవాక్ష మార్గ ప్రతిష్ఠా గభస్తి కిరణాంతర్గత వాయుపథ గామి యగు త్రస రేణువు సూక్ష్మ తమము అని యామున మతము.

తమ ఆగమ ప్రామాణ్యమున యామునులు - పాంచరాత్ర సంహిత నారాయణ ప్రోక్తము గాన, వేద తుల్య మగు ప్రామాణిక గ్రంథ మని స్థాపించిరి. విష్ణువు - లేక, వాసుదేవుఁడు పరబ్రహ్మగా వేదములందును పురుష సూక్తమునందును ప్రశంసింపఁబడినాఁడు. శైవుల పాశుపత తంత్రము అవైదికము. పాశుపత తంత్రమునకును, పాంచరాత్రమునకును సామ్యము వ్యర్థము.

ప్రతివాదములను శమింపఁజేయుటకు యామునులు తమ సిద్ధి త్రయమున ముఖ్యముగ తర్క శాస్త్ర పద్ధతినే యవలంబించిరి. ఆగమ ప్రామాణ్యమున యామునులు - సాత్త్వత, పౌష్కర సంహిత

లందు విశదీకృత మగు పాంచరాత్రము వైదిక మను అద్వైత వాద
ముల ఖండించిరి. నారాయణ ప్రోక్తమగు పాంచరాత్రము వేదాంత
సార మని నిర్వచించిరి. 'పాంచరాత్రస్య కృత్స్నస్య వక్తా నారాయణ
స్స్వయమ్' (పాంచరాత్ర శాస్త్రము సాక్షాత్తుగా భగవన్ముఖోద్గత
మైనది) అని గదా శాస్త్ర ప్రమాణము! సూత్రకారాభిమతము
పాంచరాత్ర మనియు, మహాభారత పంచమ వేదమున సూత్ర
కారునిచే ప్రశంసింపఁబడిన దనియు యామునులు నిరూపించిరి. వాసు
దేవుఁడే పరబ్రహ్మ యనియు, భక్తి సగుణోపాసన కా వాసు
దేవుఁడే విషయ మనియు సాత్త్వత పద్ధతిని బోధించు పాంచరాత్రము
వేదాంతమును జీవితమున కన్వయింపఁజేయుచున్నది. 'థీబంట్'
(Thibant) అను విద్వాంసుఁడగు సూత్రకారుఁడు రెండవ అధ్యాయము
నందలి శాస్త్ర వాదమున వైదిక సమ్మతము పాంచరాత్ర ప్రతిష్ఠా
పదముతో భరత వాక్యము పల్కి ప్రశంసించినాఁడు. పాంచ
రాత్రము నారాయణీయమున స్పష్టంగా చెప్పఁబడినది. ఉత్పలుని 'స్పంద
ప్రదీపిక' - పదవ శతాబ్దమునకు చెందిన గ్రంథము. ఇది ప్రప్రథమ
ముగ యామునులచే సూచితమైనది. యామునులు భక్తి విషయిక
మగు దాస్య భావమును బోధించిరి. ఇది స్తోత్ర రత్నమున విశద
మగును.

ఈ రీతిగా యామున మునీంద్రులు - 'భక్తి ప్రపత్తులే భవ
తారక మార్గము' అని ముక్త కంఠముగ ఉద్ఘోషించుచు, విశిష్టాద్వైత
సిద్ధాంతమును సంస్థాపించి, క్రీ. శ. 1037 లో పరమపదించిరి.

## ఆచార్య గుణానుభవము

అనేక ప్రౌఢ ప్రబంధ నిర్మాతలు - అభ్యర్హణీయతములు నగు
భగవ ద్యాముని పాదులు - శ్రీభాష్యకారులగు రామానుజులకు
పరమ గురువులు. చిదచిదీశ్వర స్వరూప నిరూపణముచే జగత్త్రయా

పరిత్రాణ కృత పరికరు లగు అట్టి శ్రీమద్రామానుజులు - గురుస్మృతి సూచకముగా వేదార్థసంగ్రహారంభమున నిట్లు సంస్మరణ మొన రించిరి :-

"పరబ్రహ్మైవాజ్ఞం భ్రమ పరిగతం సంసరతి తత్
పరోపాధ్యాలీఢం వివశ మశుభ స్యాస్పద మితి
శ్రుతి న్యాయోపేతం జగతి వితతం మోహన మిదం
తమో యేనోపాస్తం స హి విజయతే యామున మునిః."

అద్వైత పరబ్రహ్మము మాయావచ్ఛిన్నమై, సంసార దశను పొందును. ఇతరోపాధుల (Lemeting adjunets)చే అవిచ్ఛిన్న మగును. స్వవశము కాదు అశుభములకు పుట్టినిల్లగును. నిఖిల హేయ ప్రత్యనీకము కాదు ఇట్టి న్యాయాపేతము - తర్కానుగృహీతము నగు అద్వైత మాయావాద తమము ఏ యామున భాస్కరునిచే పార ద్రోలబడినదో, అట్టి యామునులకు విజయ మగుగాక !

గీతా భాష్యమున -

"య త్పాదాంభోరుహ ధ్యాన విధ్వస్తా శేష కల్మషమ్
వస్తుతా ముపయాతోఽహం యామునేయం నమామి తమ్."

ఏ శ్రీకృష్ణ పాదకమల ధ్యానముచే వీత పాపుఁడనై, స్వస్వ రూపము నారసి, వస్తు తత్త్వము నందితినో, అట్టి శ్రీకృష్ణ పర మాత్మకు ప్రీతిపాత్రు లగు యామునాచార్యులకు 'మ్రొక్కెద' నని, పరమ గురు నమస్కార పూర్వక మగు మంగళ శ్లోకము రచించిరి.

కవితార్కిక కేసరులు అష్టోత్తర శత ప్రబంధ నిర్మాతలు నగు శ్రీ వేదాంత దేశికులు తమ 'యతిరాజ సప్తతి' లో నొక శ్లోకమున యామునాచార్యుల నిట్లు ప్రస్తుతించిరి :-

"విగాహే యామునమునం తీర్థం సాధు బృందావనే స్థితమ్
నిరస్త జిహ్మగ స్పర్శే యత్ర కృష్ణః కృతాదరః."

కృష్ణ ప్రీతి పాత్రమును, నిరస్త కాళియ కాకోదర స్పర్శమును, సాధు జన నిషేవ్యమాణ బృందారణ్య మధ్యగతమును అగు యాము నాంభః పూరమున సుస్నాతుఁడ నగుదును.'

ఈ శ్లోకమునకు మఱి యొక యర్థము :-

సాధు జన రక్షకుఁడును, ఋజు మార్గ వర్తియు, శ్రీకృష్ణ ప్రీతి పాత్రుఁడును అగు యామునాచార్య గుణాంభోరాశి నవగాహనము చేయఁ గోరెదను ' ఇట శ్రీకృష్ణ ప్రీతి పాత్రుఁ డనఁగా - వ్యాఖ్యాతృ చక్రవర్తి యగు కృష్ణ సూరి (పెరియవాచ్చాం బిళ్ళై) చే, దివ్య ప్రబంధ వ్యాఖ్యానము ప్రస్తుతింపఁబడినాఁ డని తాత్పర్యము.

శ్రీ వేదాంత దేశికులే తత్త్వ ముక్తా కలాపములో -

"నాథోపజ్ఞం ప్రవృత్తం బహుభి రుపచితం యామునేయ ప్రబోధైః
త్రాతం సమ్యగ్యతీంద్రైరిద మఖిల తమః కర్శనం దర్శనం నః"

శ్రీమన్నాథమునులచే ప్రవర్తింపఁజేయఁబడి, శ్రీమద్యామున ప్రబోధ రత్నములచే పోషింపఁబడి, యతిసార్వభౌమ వచో రచనలచే సురక్షిత మయిన మన విశిష్టాద్వైత దర్శనము తమః కర్శనమై వెలయు గాక! అని ఆకాంక్షించి యున్నారు

యామునాచార్యులు తమ గ్రంథములను అతీంద్రియార్థ సాధకములుగా - సుబోధయ ప్రశమనకులుగా - ముముక్షు జన జీవాతువులుగా రచించిరి. అట్టి గ్రంథ రత్నములలో నొకటి యగు సిద్ధిత్రయమును దుఃఖ త్రయీ ప్రశమనార్థము విరచించిరి. ఈ గ్రంథమున, టంక - భర్తృ ప్రపంచ - భర్తృ మిత్ర - భర్తృ హరి - బ్రహ్మదత్త - శ్రీవత్సాంకుల పూర్వ పక్షము లుపన్యసింపఁబడినవి; కొన్ని వ్యవస్థాపింపఁబడినవి. స్తోత్ర రత్నమున యామునులు -

"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ."

ఒక్కసారి శరణాగతి చేసినంతనే, నీవాఁడ నని యన్నంతనే సర్వ ప్రాణులకును అభయ మిత్తును. ఇది నా వ్రత' మను ఆది కవి వాల్మీకి హృదయ మగు శరణాగతినే ఆవిష్కరించిరి.

—*—

# విష్ణు చిత్తీయము - వైష్ణవ మతము

'కళాప్రపూర్ణ'

డాక్టర్ : దివాకర్ల వేంకటావధాని, ఎం. ఏ. (ఆనర్సు) పి హెచ్ డి.

## కావ్య వైశిష్ట్యము

ఆంధ్ర వాఙ్మయమునందలి అతి ప్రౌఢ ప్రబంధములలో - ఆముక్తమాల్యద ఒకటి దీనిని రచించిన శ్రీకృష్ణదేవరాయలు సార స్వతమునందునలెనే వైష్ణవ మతమునందును మిక్కిలి యభిరుచిగలవాఁ డగుటచే, ఇందు - కావ్య మహత్వ సూచికములైన లక్షణము లతోపాటు, వైష్ణవ మత మహత్వ ప్రతిపాదకములైన విషయములను గూడఁ జెక్కించి జొప్పించెను. అసలు - విష్ణు పారమ్య ప్రతి పాదనము కొఱకే అతఁడీ ప్రబంధమును దొరకొనె నన్నను అతి శయోక్తి ఉండదు. గోదా రంగేశ్వరుల ప్రణయ గాథ ఇందలి ప్రధాన వస్తువు. దానికి పూర్వ రంగముగా - గోదాదేవి తండ్రియు, పన్నిద్దరాళ్వారులలో నొకరు నగు పెరియాళ్వా రనఁబడు విష్ణుచిత్తుని వృత్తాంతమునుఁగూడ రాయలు వివరించెను. అందువలననే ఈ ప్రబంధ మునకు 'విష్ణు చిత్తీయ' మను నామాంతరము కూడఁ గల్గినది. ఈ తండ్రి కూతుల కథలను జెప్పుచు రాయలు - ప్రబంధ వస్త్వైక్య మునకు భంగము వాటిల్లునేమో యని శంకింపక, విష్ణు పురాణము, వరాహ పురాణము మొదలగు గ్రంథములనుండి, వైష్ణవ మహత్త్వ ప్రతిపాదకము లగు వృత్తాంతములను గ్రహించి, ఇందుఁ జొప్పించెను. ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానము, మాల దాసరి కథ, యామునా చార్య చరిత్రము నిందు ముఖ్యములైనవి. ప్రసక్తానుప్రసక్తముగాఁ జెప్పఁబడిన ఈ యవాంతర విషయ విన్యాసముచే, ఆముక్తమాల్యద పేరునకు ప్రబంధ మయ్యును - 'చిన్న విష్ణు పురాణమా ?' యనఁ దగి యుండి యిల్లు సిల్లుచున్నది.

## శ్రీవైష్ణవ ధర్మ ప్రబోధము

ప్రపన్నామృతమునందును, ద్రావిడ దివ్య ప్రబంధములందును, గరుడవాహన పండితుని దివ్యసూరి చరితమునందును గోదా విష్ణు చిత్తుల వృత్తాంతము లున్నవి. రాయ లా వృత్తాంతములను వాని నుండి గ్రహించి, విష్ణు పురాణమునందలి ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానమును, గురుపరంపరా ప్రభావ మందలి యామునాచార్య చరిత్రను వరాహ పురాణము నందలి మాల దాసరి కథను ఎట్లో అవకాశము కల్పించుకొని, అం దందుఁ జేర్చెను. నిజమున కీ కథల కొండిటితో నంత సన్నిహిత సంబంధము లేకున్నను, విష్ణు పారమ్య ప్రతిపాదనమను నేకైక సూత్రము వీని నొక విధముగా సంబద్ధములు గావించుచున్నది. ఈ కథలలో రాయలు ప్రతిపాదించిన వైష్ణవ మత సిద్ధాంత రహస్యములు గమనార్హములు.

## రాయల పాండిత్య ప్రకర్ష

రాయలు సంస్కృతమున రచించిన సకల కథా సార సంగ్రహము, జ్ఞాన చింతామణి అను గ్రంథము లిప్పుడు లభించుట లేదు. అందు సకల కథాసార సంగ్రహము - శ్రుతి పురాణోప సంహిత లన్నియు గాలించి, అం దుండి గ్రహించిన కథలతోఁ గూడి నది జ్ఞాన చింతామణి - శ్రోత్రపుచ్ఛటలు విచ్చుగ సూక్తి నైపుణితో రచింపఁబడినట్టిది. వీనిలోఁగూడ రాయలు విశిష్టాద్వైత సిద్ధాంతము లను ప్రపంచించి యుండును. ఈ గ్రంథముల స్వభావమే రాయలకు శ్రుతి స్మృతి పురాణోపపురాణములందును, వేదాంత గ్రంథము లంతటను గల అభినివేశమును ప్రకటించుచున్నది. విశిష్టాద్వైత సిద్ధాంతములను వివరించు గ్రంథములను రెండు తెఱఁగులుగా విభ జింపవచ్చును. అందు - వాద క్షమమై, ప్రతివాదులను జయించుట కుపయోగపడు పండితైక వేద్యమైన గ్రంథ జాల మొక తెఱఁగు.

ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రములు, భగవద్గీత, విష్ణు సహస్రనామము
త ద్భాష్యములు, సిద్ధి త్రయము మున్నగునవి ఈ తెలుఁగునకుఁ
జెందును. ఈ గ్రంథము లందలి సారాంశము నంతను సర్వ సుబోధక
ముగా వివరించునవియు, స్వ గోష్ఠీ నిష్ఠములును - గురు పరంపరా
సంప్రదాయానుగతార్థ విశేష బోధకములును - భక్తి ప్రపత్తులను,
జ్ఞాన వైరాగ్యములను వృద్ధినొందించునదియు నగు ద్రావిడ దివ్య
ప్రబంధములు రెండవ తెలుఁగునకుఁ జెందును. ఆముక్తమాల్యదను
పరిశీలించినచో, రాయల కీ రెండు తెలుగులైన గ్రంథములతోడను
విశేష పరిచయ మున్నట్లు తెలియవచ్చును. ఖాండిక్య కేశిధ్వజో
పాఖ్యానమువలన ఉభయ మీమాంసా యోగ శాస్త్రము లందును
విష్ణుచిత్తుఁ డితర మతస్థుల నోడించు సందర్భమువలన సాంఖ్యాది
దర్శనములందును రాయలకుఁ గల పాండిత్యము వెల్లడి యగుచున్నది.
ఇ వన్నియు - అతఁ డూరక తెలిసికొనుటయే గాక, గ్రంథమున తేట
తెల్లముగా ప్రతిపాదించుట చూడ, రాయ లందుఁ గావించిన కూలం
కష పరిశ్రమ గోచరించి, పఠితల నాశ్చర్యచకితులఁ గావించును.

## కృతి పరిశీలనము

విష్ణుచిత్త యామునాచార్య వృత్తాంతములలో - వారు
వాదము చేసి, అన్య మతావలంబుల నోడించి, అప్పటి పాండ్యరాజు
లను వైష్ణవ మతావలంబులనుగా నొనరించుట సమముగా నున్నది.
రాయలా సందర్భమున రెండు వృత్తాంతములందును సమాన పద్యము
లనే రచించెను. విష్ణు చిత్తుఁడు పాండ్య రాజునకు ఖాండిక్య కేశి
ధ్వజోపాఖ్యాన రూపమున యోగమునుఁగూర్చియు, భక్తి ప్రపత్తు
లనుఁ గూర్చియుఁ జెప్పి, పరిణతాంతః కరణుఁ డగు నతనికి మూల
మంత్ర పూర్వకముగా ద్వయ ముపదేశించి, భాగవత ప్రధాను నొన
రించెను. యామునాచార్యుని వాద పటిమ కోర్వలేక కూడిన పామండ

తుంపము తల వంచుకొని పోఁగా, పాండ్యరాజు యామునాచార్యుని
మాహాత్మ్యమునకు సంతోషించి, హర్షాద్భుత రసోత్తరంగితాంత
రంగుఁడై, భుజగశయన చరణ విశేషయు భక్తి వహించి, కృతార్థుఁ
డయ్యెను. ఈ విధముగా నా యిరువురు పాండ్యులు - వైష్ణవ మత
వైశిష్ట్యము నెఱింగి, ఆ మతము నవలంబించిరి. ఇందుకు విష్ణుచిత్త -
యామునాచార్యులు గావించిన వాద పటిమయే కారణము. విష్ణు
చిత్తుఁ డన్య మత పండితుల నంగతి నోడించి, బ్రహ్మ సూత్రముల
చేతను, వేద వాక్యములచేతను మొదట సర్వేశ్వరుని నిరూపించి, తరు
వాత నా సర్వేశ్వరునకు విష్ణుత్వమును, పిమ్మట నా విష్ణుత్వమున కన్య
దివిధ ద్వ్యాప్తకమును విశిష్టాద్వైతమును తేట తెల్లము గావించి,
ప్రమాణ వాక్యముల ప్రదర్శించెను. సృష్ట్యాదియందు నారాయణుఁ
డొక్కఁడే యుండెననియు, విలాసమున కేకాకిత్వము యుక్తము
కాదని యతఁడు చిదచిదాత్మకమైన ప్రపంచమును ప్రవేశించి, బహు
రూపములు దాల్చెనని ఛాందోగ్యము చెప్పుచున్నదనియు, అంతరా
దిత్య విద్యయందు సూర్యమండలమున పుండరీకాక్షుఁడు అష్ట త్రి
సహస్రాక్షులైన బ్రహ్మ రుద్రేంద్రాదులలో నొక్కఁడు కాక, విష్ణువే
యనుటకు - 'అక్షిణీ' అను ద్వివచనము ముఖ్యసాధక మనియు,
నారాయణుని అప్రతిమాన దివ్యస్వరూప దివ్య విగ్రహానంత కల్యాణ
గుణ దివ్యైశ్వర్యము లా వేదమునందే స్ఫురించుచున్న దనియు,
'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః' అని,
నారాయణము శ్రీమన్నారాయణుని యంతర్బహిర్వ్యాపకత్వ
మును ఘోషించుచున్న దనియు, సర్వశబ్ద సమూహమును సామాన్య
విశేష న్యాయములచే, నిర్మల నారాయణ శబ్దమునందే పర్యాప్త
మగుచున్న దని ఆరుణంబులు నిరూపించుచున్న వనియు, ఛాందో
గ్యాది శ్రుతి విభాగములందుఁ గల 'అపహత పాప్మా దివ్యో దేవ
ఏకో నారాయణః' అను వాక్యము నందలి నారాయణ పదము

'నారాయణుఁడొక్కఁడే పరమాత్మ' యని సూచించుచున్నదనియుఁ
దెల్పి, విష్ణుచిత్తుఁడు శ్రీమన్నారాయణుని పారమ్యమును ప్రతిపా
దించెను. మఱియును అతఁడు విజ్ఞానవృద్ధుఁడైన యింద్రుఁడు దివో
దాసాత్మజుఁడైన ప్రతర్దనునికి పరమాత్మ దేవుఁడే చిదచిచ్ఛరీరుఁ
డగుటయు, చేతనుఁడైన తాను జగత్కారణము కాకపోవుటయుఁ
దెలిపి, తన్నే ఉపాసించుచున్న యతనికి - 'మా ముపాస్స్వ' యని
యుపదేశించుటచే బోధించె ననియు, నారాయణ శరీరములే యైనను,
బ్రహ్మ రుద్రాదులను భజించుట త్రివర్గములకే కాని,
అపవర్గ కాంక్షులకయుక్త మనియు, 'మాతా పితా భ్రాతా నివాస
శ్శరణం సుహృద్గతి ర్నారాయణ' యని శ్రుత్యంతరము సమస్తము
నకు నారాయణుఁడే పరాయణ మని ప్రతిపాదించుచున్నదనియు తెల్పి,
అట్టి సర్వేశ్వరుఁ గనుటకుఁ దగిన యోగాంగము విశదము చేయుటకై
ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానము నెఱిఁగించెను. యామునాచార్య చరి
త్రమునఁగూడ, బ్రహ్మ రుద్రాదులు నారాయణుని శరీరములే
యనియు, వారిని పూజించుట నారాయణుని పూజించుటయే యైనను -
కొంత తారతమ్యము కలదనియు, వారిని కేవల శరీర దృష్టితో బరి
కించుచు, నారాయణుని వాసుదేవతాస్థితిఁ బూజింపని పూజ సాంత
ఫలమై ప్రతిపన్న మనియు చెప్పఁబడినది. యామునాచార్యుఁడును విష్ణు
చిత్తుని వలె రాజసభలో ఇతర మతస్థుల నోడించి, విష్ణుదేవుఁడే పర
తత్త్వ మనియు ప్రతిష్ఠించెను. యామునాచార్యు నట్లు వాదమునకు
ప్రేరేపించినవాఁడు - శ్రీమన్నారాయణుఁడే. పాండ్యరాజు వైష్ణవు
లను సామాన్య బుద్ధిఁ జూచుచు, తద్భృత్యుల కగు నుపద్రవము నుపే
క్షించుచు, రక్షా విముఖుఁడై యుండుటయే అందులకు కారణము.
ప్రజలకు రక్షణ శిక్షణములు రాజ ముఖముగఁ గాక, తాను సాక్షా
త్కరించి చేయుట యుక్తము కాదనియు. వైష్ణవ రక్షణేచ్ఛ రాజు
నకు ఆత్మాభిమాన ముఖ్యముగఁ గాక, అన్య విధమునఁ జేకూర
దనియు, ఆ యాభిముఖ్యము సంవాదము వలననే కలుగు ననియుఁ

తలంచి, నారాయణుఁడు యామునాచార్యునకు విజయమునఁ దలంపు
పుట్టించెను.

## విష్ణు చిత్తుఁడు - యామునాచార్యుఁడు

విష్ణుచిత్త యామునాచార్యు లిరువురు వైష్ణవాగ్రేసరులే
యైనను, వారి ప్రవృత్తి తత్త్వములం దించుక భేద మున్నది. విష్ణు
చిత్తుఁడు వేదములనుగాని, వేదాంతమునుగాని గురు ముఖమున నధ్య
యనము చేసినవాఁడు కాఁడు. మధుర కేగి, మదోన్మత్తులైన యన్య
మతస్థుల నోడించి రమ్మని చెప్ప మన్న, వారితో నాతఁడు మొర
పెట్టుకొన్నట్లు, 'శాస్త్ర గ్రంథ జాత్యంధుఁడు' అయ్యును, పరమేశ్వర
ప్రసాద బహు జనన కృత సుకృత ఫల రూప యగు నాచార్య కృప
గుప్త ధనము నిధానమును తెలిపిన గతి - ప్రకృతికంటె పరుఁ డగు
పరమేశ్వరునిఁ దెలుప, ఆత్మీయ తదీయ శేష శేషిత్వ సంబంధ
మనాద్యంబుగాఁ దెలిసి, అఖర్వ నిర్వృతిం గాంచి సుఖించు పరమ
యోగీంద్రుఁడు రాయలు చెప్పిన ట్లతఁడు - 'ఉరు చ్ఛందో బృంద
తదంత వాగవరనా సంజాత తజ్జన్య నిష్పంద ద్వైత సుసంవిదా
లయుఁడు.' శాంతి దాంతి పరత పరమైకాంతియై, భగవత్పరిచర్య
చేయుటయే పరమ పురుషార్థ మగుట యెఱిఁగి, రథ చరణ మాలికా
కరణ కైంకర్య మొనరించుచు, కాలము గడుపుచుండినవాఁడు. ఆతని
యీ భక్తికి మెచ్చియే విష్ణు వాతనికి వాదమున విజయము కలి
గించెను. వాదమున కేగు టెట్లని యాతఁడు శంకించుచున్నప్పుడు
విష్ణువు - 'నీ యిచ్ఛయె ? మిన్నక పోవోయి. ఇందులకై నీ యత్నము
వల దవల నేనున్నాఁడ' నని ధైర్యము గొల్పుట యిందుకు
తార్కాణము. దీనినిఁబట్టి, యాతనికి పాండ్యరాజ సభలోఁ గలిగిన
విజయ మంతయు - శ్రీమన్నారాయణ ప్రసాద పరిలబ్ధమే యని
విదిత మగుచున్నది. అతఁడు వాద సమయమున - శ్రుతి స్మృతి
సూత్ర సమాజమునకు ఐక కంఠ్యము కల్పించి, విష్ణు మతము

మిక్కుటముగా కొంత యత్నము చేయవలసివచ్చెను. ఈ రెండు కథలను పరిశీలించినచో - భక్తి సాధ్యమైన జ్ఞానమునకును, విద్యాధ్యయన సాధితమైన జ్ఞానమునకును గల తారతమ్యము తెలియవచ్చును. మొదటిది - నిశ్చలమును, పతన రహితము నైనట్టిది. రెండవది - మహా త్వర మయ్యెను, ప్రమాద నిఘ్న మైనట్టిది.

## రాయల కథా కౌశలము - పరమార్థ తత్త్వము

రాయలు విష్ణు చిత్తునిచే పాండ్య రాజునకుఁ జెప్పించిన ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యాన మొక వంక కథా కౌశలమునకును, వేరొక వంక పరమార్థ జ్ఞాన యోగవిద్యా రహస్యమునకును ఆలవాలమైనది. ఖాండిక్యుఁడు కర్మజ్ఞుఁడు. కేశిధ్వజుఁడు ఘన విజ్ఞాన సంపన్నుఁడు. కేశిధ్వజుఁడు యుద్ధమున ఖాండిక్యు నోడించి, అతని రాజ్య భాగము కూడ తనకే లభింపఁగా - ఫల మాకాంక్షింపక, 'గెల్తు మృత్యున్నవిద్య బుట్టకుండ దన జాకుండ స్వాతె నంచు యోగ విరక్తి జ్ఞానాప్తియుండై' యజ్ఞానీకము లొనర్చుచుండెను. అతని హోమ ధేనువు నొక శాలా ప్రాంతమున మేయుచుండఁగా పులి యొక కొట్టెక్కి, దానిని జంపి వైచెను. అతఁడు ఖాండిక్యునికడ కరిగి, ప్రాయశ్చిత్తము తెలిసికొని వచ్చి, యాగము ముగించి, గురు దక్షిణ యిచ్చుటకై ఖాండిక్యుని కడ కరిగెను. ఖాండిక్యుని పరి జనులతనిని రాజ్యమును గురు దక్షిణగా నడుగు మని నిర్బంధించిరి. కాని, అతఁ డధ్యాత్మ పరులైన వారి యుపదేశము గ్రహింపక, మహీ రాజ్య భోగమ్ము లల్పానేహః పరిభోగ్య మనియు, పరలోక సుఖము శాశ్వత మనియు నెఱింగి, 'గురు దక్షిణగా సకల భువన క్లేశ సంశయ మైన శోకము బోధింపు' మని యడిగెను. కేశిధ్వజుఁడు - అతఁడు నిష్కంటకమైన రాజ్యము నడుగక, విద్యా బోధ నర్థించు నిస్పృహుఁడై, అతనికి మొదట పరమార్థమును, పిమ్మట పునర్భవము

లేకుండఁ జేసి, బ్రహ్మ సాధర్మ్యంబు పొందించు యోగము నెఱింగిం చెను. ఈ సందర్భమున రాయలుకు గల తత్త్వజ్ఞాన సంపదయు, యోగవిద్యా పరిజ్ఞానమును సువ్యక్తము లగుచున్నవి.

'ఆత్మ కాని దేహమున నాత్మ బుద్ధియు, అస్వంబునందు స్వత్వ బుద్ధియు, అవిద్యా మహా తరువునకు బీజములుం. దేహ యజ్ఞాన వశమున పాంచ భౌతికమైన శరీరమును ఏ నిది నా పరికర మని నమ్మి, అవధి లేని భ్రాంతికి లోనై తిరుగుచుండును. ఆత్మ - పృథివ్యాప్తేజో వా య్వాకాశములకంటె భిన్నమై వెలుఁగుచుండఁగా, కళేబరమునే ఆత్మగాఁ దలచుట కేవల భ్రాంతిమూలకము. దేహోపభోగ్యములైన గృహ క్షేత్రాదులు బొందివే కాని, ఆత్మవి కావు. పుత్ర పౌత్రాదు లాత్మ కాని దేహమునఁ బుట్టినవా రగుటచే, ఆత్మ సంబంధులు కారు. కావున, వారియందు స్వత్వ బుద్ధి తగదు. ఆత్మ దేహములు రెండును భిన్నము లగుటచే, భోగాదు లాత్మని కంటవు. అట్లు గాక, దేహమే ఆత్మ యన్నచో - అవి దాని కంటును. మృణ్మయ గేహము మృజ్జలాదులచే నిల్చునట్లు, భౌతి కాంగములు భౌతికములైన భోగ శయనాదులచే నిల్చుచుండును. దానియం దాత్మకు భోగము వ్యర్థము. సంసారి పాంథుఁడు వాసన లను ధూళి కప్పు, మోహ మను క్లేశ మలముకొన, నిహ్వ్రస జన్మ లను బహు ప్రయాణములచే సంసార మార్గమున నెడతెగక తిరుగుచుండును. అతఁడు జ్ఞాన మను సుశీతోదకముచే ఆ వాసనా ధూళిని గడిగినచో, ఆ మోహ శ్రమము తొలఁగిపోవును. అప్పు డతఁడు స్వస్థుఁడై, అనన్యాతిశయమును - అబాధమునై విలసిల్లు సౌఖ్యంబు ననుభవించును. నీరు కలశోదరమునుండి అస్పృష్ట దహనం బయ్యు - తదీయ యోగమున నుడికి, శబ్దోద్రేకాది ధర్మములు పొందునట్లు, ఆత్మయు - ప్రకృతి సంబంధముచే సహ మ్మానాదులకు గుఱియై, ప్రాకృత ధర్మములు పొందుచుండును. కాని, ఆత్మ - వాని కత్యంత విలక్షణుం

డును - అక్షయుండునై యొప్పారును. సకల క్లేశ సంక్షయం బొనరించి, శాశ్వత సౌఖ్యం బొందఁగూర్చుట[illegible], నే ఉపాయంబు లేదు' అనుచు కేశిధ్వజుండు ఖాండిక్యున కుపదేశించిన పరమార్థ తత్త్వము.

'ప్రాణికోటి బంధ[illegible]క్షు[illegible] మనస్సే కారణము. ఆ మనస్సు విషయ సక్తమై బంధకారణము - నిర్విషయమై ముక్తి సంపత్కారియు నగును. వివేక జ్ఞానముతో మనమును విషయాదులనుండి మరల్చి, నిశ్శ్రేయసము నకై పరబ్రహ్మమును ధ్యానింపవలయును. అట్లు ధ్యానించువాని కా బ్రహ్మము - సూదంటురాయి లోహము నాకర్షించునట్లు, ఆత్మభావ మొసంగును. యమాదిక విషయమైన జీవుని ప్రయత్నమున కధీనమైన సాత్త్విక మనోగతిని బ్రహ్మ సంబంధిగాఁ జేయు ప్రక్రియయే యోగ మనఁబడును. ఈ విశిష్ట ధర్మమున కిరవైన యోగము గలవాఁడే యోగి. యోగి యగువాఁడు - మహా నైర్మల్య సంపాదనమునకై నిష్కామ బుద్ధి, బ్రహ్మచర్యాదులగు యమంబులైదును ఆచరింపవలయును. ఈ యమ నియమములు సకామములైనచో - విశిష్ట ఫలప్రదములును, నిష్కామములగుచో - ముక్తిదంబులు నగును. పిదప [illegible] భద్ర ముక్త సిద్ధాదు లగు నాసనములం దొక దాని నవలంబించి, ప్రాణాయామ వృత్తి వశ మొనరించుకొనవలయును. దీనికి ప్రాణాయామమని పేరు. అది - 'స బీజ' మనియు, 'అ బీజ' మనియు రెండు విధములు. శబ్దాది విషయ ప్రవణము లగు ఇంద్రియములఁ ద్రిప్పి, మనోఽధీనములుగా నొనరించుట ప్రత్యాహారము. ఇది ముముక్షువునకు కర్తవ్యము. ప్రాణేంద్రియముల వశము గావించుకొనఁజాలని యోగి, యోగ సాధకుఁడు కాఁజాలఁడు. ప్రాణాయామముచే పవనములను, ప్రత్యాహారముచే ఇంద్రియములను వశీకరించుకొన్న పిమ్మట, యోగి - చిత్తమును శుభాధార మగు పరబ్రహ్మమున లగ్నము గావింపవలయును.'

'బ్రహ్మము పరాపర భేదముల ద్వివిధంబై యుండును. పరమనఁగా - అమూర్తము. అపర మనఁగా - మూర్తము. ఈ రెంటిలో - పరమగు నిరాకారమగుటచే, ఉపాసనా శక్యము కాదు. అబ్జగర్భాదిబద్ధ నికాయరూపమైన యపరము ముక్తి నయ్యును, బ్రహ్మ కర్మోద్భయాకారులకు భావ ప్రత్యయముతోఁ గూడియుండుటచే, పరిత్యాజ్యమై యుండును. సాధకుని శరీర త్యాగ కాలమున సేవ్యములు కావు. సకల ప్రపంచము విష్ణు శక్తి సమన్వితమై, ఆ విష్ణువునకు శరీరమై యుండును. అందు - క్షేత్ర శక్తిచేఁ జుట్టఁబడి, అపరాఖ్యమగు క్షేత్రజ్ఞ శక్తి - జనన మరణాది సంసార తాపము అనుభవించుచు, తత్తత్కర్మానుగుణములైన మేనులు దాల్చి, విజ్ఞాన తారతమ్యము నొందుచుండును. ఆ క్షేత్రజ్ఞ శక్తి యచ్చు ప్రాణులు, పర్వత వృక్షాదులగు స్థావరములు, సరీసృపములు, ఖగములు, మృగములు, మర్త్యులు, యక్ష గంధర్వ నాగాదులు, నిలింపులు, ఇంద్రుఁడు, దక్షుఁడు, హిరణ్యగర్భుఁడును వారియందు ఉత్తరోత్తరాధికమై యొప్పుచుండును. ఈ రూపభేదము లన్నియు - విష్ణుని శరీరములు. అతఁ డచింత్య శక్తిచే ఆకసమట్లు అఖిల భూతములందును నిండి యుండును.'

'అపరాఖ్య బ్రహ్మమునకు ద్వితీయమై, విష్ణు సంజ్ఞికమైన యమూర్త రూప మొండు యోగి హృద్ధ్యేయమై యొప్పుచుండును. ప్రాజ్ఞులు దానిని సత్తను పేరఁ బిల్చుచుందురు. ఈ రూపమే సమస్త శక్తులకు నాశ్రయమై, విశ్వరూపముకంటె విలక్షణమై, సకల కల్యాణ గుణ విశిష్టతతో నొప్పి, అద్వితీయ మాహాత్మ్యముతో ప్రకాశించుచుండును. ఆ పరబ్రహ్మమే నిజ లీలావశముచే, దేవ తిర్యఙ్మనుష్యాదుల నామ వ్యాపారములు గల యవతారములను జగద్ధితమునకై కల్పించుచుండును. ఈ లీల - కర్మమూలకము గాదు. అతఁడు సకల దేవ తిర్యఙ్మనుష్యాదులందు జనించినను, తద్వ్యాపార చేష్టిత

ములు రావణాదు లగు దుష్టులకైన నవ్యాహతములై యతిశ
యిల్లును. అతనికి బద్ధ ముక్తాది రూపము లనేకములు కల్గినను, ముము
క్షువు జ్ఞాన సిద్ధికై పరవాసుదేవ రూపము, సంకర్షణ ప్రద్యుమ్నాని
రుద్ధాది వ్యూహ రూపములు, రామకృష్ణాది విభవ రూపములు
మున్నగు రూపములనె చింతింపవలయును. ప్రజ్వలితాగ్ని - నీరస
నికుంజములను దహించు విధమున, నా విష్ణువు - యోగుల సకల
కిల్బిషములు నిర్దహించును. సకల శక్త్యాత్మకుండైన ఆ పరమాత్మ
యందు చిత్తము నిల్పుటయే విశుద్ధ మగు ధారణ యనబడును. సర్వ
సంగ బంధముచే చంచల మగు చిత్తమునకు త్రిభావ భావాతీతుం డగు
నా దేవుండు శుభాశ్రయుండై, ముక్తి సంపద నొసంగును. అతని
కంటె భిన్నులైన బ్రహ్మాది దేవతలు కర్మ యోగు లగుట నశుద్ధులై,
చిత్తమున కవలంబనీయులు కాజాలరు. నిరవలంబమైన ధ్యానము
పొందుపడదు. కావున ననంతుని ధ్యాన ధారణావిషయమై శుద్ధ
మగు స్థూల రూపాంతరము గలదు. అది. కిరీటంబు నిభాస్యము -
వికచారుణ కమలాక్షము - మకర కుండలల శోభితము - కంబు కంఠము -
శ్రీవత్స లాంఛితోరస్కము - నత నాభి - వళి త్రయ శాతోద
రము - ఆజానులంబి చతుర్భుజము - కరి వర కరోరువు - పల్లవాభ
పద యుగము - హైమ వసనము - కేయూర హారాంగదాది భూషితము -
శంఖ చక్ర గదా శార్ఙ్గ సంపన్నము నగు రూపమును. ఆ మూర్తిని
తన్మయుం డగు యోగి - క్రమముగా నిటులని ధ్యానింపవలయును.
మొదట నొక్క యవయవమునే హృదయ లగ్న మగునట్లు భావించి,
అది దృఢమైన పిమ్మట, అవ్వలి యంగమును ధ్యానింపవలయును.
ఇట్టి యభ్యాసమువలన ఆ యవయవములు నడచినను, ము తే కార్య
మాచరించుచున్నను, నడుచున్నను కూర్చున్నచో - అట్టి సాధకుం

డా పరమాత్ముని సామ్యముఁ బొంది, ముక్తుఁ డగును. సురాది
భేద సంజనకమైన యజ్ఞానము తొలఁగిన పిదప ప్రాప్తించు కల్యాణ
గుణపరంపరచే హరికిని, యోగికిని భేదమే యుండఁజాలదు.'

ఈ విధముగా కేశిధ్వజుఁ ఖాండిక్యున కుపదేశించిన యోగ
మార్గమును విష్ణుచిత్తుఁడు పాండ్య భూపాలునకుఁ దెలిపి, 'ముముక్షు
వున కథోక్షజుఁ డొక్కఁడే యుపాశ్రయణీయుఁడు; అతని భజించు
టయే భక్తి యోగము. దీనియందు దొక్క లోప మున్నది. నడుమ
నంతరాయ మొదవినచో నది పునర్జన్మము నొందించి, పిదప ముక్తి
చేకూర్చును. అందుచే, గజేంద్ర సంగ్రాహమున హరి నరున
కుపదేశించిన నిరపాయము నగు శరణాగతి ధర్మమే యంతకంటెను సులభ
తరమైన' దని, శరణాగతి ధర్మము నుపదేశించి, అతని భాగవత ప్రధా
నునిఁ గావించెను. ఈ ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానము - వైష్ణవ
మత పరమార్థమును, యోగవిద్యా రహస్యములను వెల్లడిచేయుచు,
రాయల కందుఁ గల పరిజ్ఞానమును ప్రకటీకరించుచున్నది.

విష్ణుచిత్తుఁడు పాండ్యరాజుచే వీడ్కోలు వడసి, నిజ నగరమున
కరుగుచుండ, మార్గ మధ్యమున నతనికి విష్ణువు ప్రత్యక్ష మయ్యెను.
విష్ణుచిత్తుఁడు దశావతార వర్ణనము గావించెను. విష్ణువు సంప్రీ
తుఁడై, విశ్వకర్మను గాంచి, ఈ భక్త శిఖామణి పాండ్యరా జొసం
గిన ధన మంతయు - భాగవత సేవకును, విష్ణ్వాలయ నిర్మాణాదుల
కును వినియోగించి, తాను రిక్తుఁడై పోవును. అందుచే, నీతని గృహ
మును మణి మయమును - సార్థమును నొనరింపు' మని యాజ్ఞాపించెను.
విశ్వకర్మ అట్లే గావించెను. ఇది - శ్రీ మహా విష్ణువునకు భక్తుల
యెడఁ గల పరమానుగ్రహమును విదితము చేయుచున్నది. భక్తుల
బాధ్యత నంతను భగవంతుఁడే వహించుట కిది నిదర్శనము. యామునా
చార్యుఁడు సామ్రాజ్య భోగ లాలసుఁడై, తన పూర్వ స్థితిని మఱచి

వర్తించుచుండ, తత్ప్రథానముఖ శిష్యుఁడైన శ్రీ పుండరీకాక్షుని శిష్యుఁడగు శ్రీరామమిశ్రుఁడు గురు ప్రేరితుఁడై, అతనికి పూర్వ జ్ఞానము కలిగించి, ద్వయ ముపదేశించి, యామునాచార్యుని తాత యగు నాథముని - తమకుఁ జెప్పిన సంప్రదాయమును చెప్పి నిర్ణయమును, భాగవతంసమగు నతనిచే విశిష్టాద్వైతము సకల భూతహితముగా ప్రపంచమున వెలయుఁగల దను విషయము నెఱింగి, అతనికి ద్వయ ముపదేశింపుమని తన శిష్యుఁడగు శ్రీ పుండరీకాక్షుఁడు - భోగాసక్తుఁడగు నతనికి నుపాయముగాఁ దెలిపి, ద్వయ ముపదేశింపుమని తన శిష్యుఁడగు శ్రీరామమిశ్రునిఁ బంపెను. భాగవతావతంసులగు నా ముని శ్రేష్ఠులకు వైష్ణవమత ప్రచారమునందుఁ గల యత్యంత శ్రద్ధ కిది నిదర్శనము.

## గోదాదేవి మధుర భక్తి

గోదాదేవి భక్తి అపూర్వమైనది. ఆమె శ్రీమన్నారాయణుని వియోగము భరింపలేక కావించిన యుపాలంభము - రమ్యాతిరమ్యమై, ఆమె హార్దమైన యనురాగ సంపద నొలుకఁబోయుచున్నది. పతి చెంత నున్నప్పుడే, ముం దెప్పుడో వియోగము కలుగునేమో యను భయముచే, మంచి సమయము చూచి శరీర త్యాగ మొనరించు మహిళయే పతివ్రత యని యామె భావము. అతి వియోగ సంతాపిత యయ్యును, ఆమె - శ్రీవిల్లిపుత్తూరున నుండిన పుండరీకాక్షు నారాధనముచే శ్రీ విష్ణువును నెరలఁ బొందఁ దలఁచి, ప్రతి దినమును ప్రాతః కాలముననే లేచి, నిజ గృహారామ దీర్ఘికయం దనుసంహిత ద్రావిడామ్నాయయై స్నాన మాచరించి, చలికి త్రై కట్టిన చెంగల్వ పూవు తోత్తును దరు పరిణామోద్రేక [illegible] జరియు గ్రహించి, గుడి కేగి, వేదికయందు నిలు ప్రముగ్గు పెట్టి ధూప దీప నైవేద్యాదు లొసంగి, ప్రదక్షిణానంతరము చరణార్ఘము గొని, తత్ప్రసాద

లబ్ధమైన మాల్యము ధరించి, యింటి కరుగుచుండెను. పిదప నామె - వియోగ భారముచే ధైర్యము డిందు వడ, ద్రావిడ భాషలో నా యమవతి గుణ విశేషములు సంకీర్తించుచుండెను. ఆమె - దిన దిన ప్రవర్ధమాన మగు విరహాతిశయముచే చిక్కి, శల్య మయ్యెను. తండ్రి యైన విష్ణుచిత్తుఁ డామె నారసి, మన్మథ వికారముల తత్త్వ మెఱుం గనివాఁ డగుటచే, అదియును ఏదో తప మనుకొనుచు, 'ఆమె తను గ్లానికి దుఃఖితుండై, చివరి కొక్కనాఁడు ప్రాజాంతిమ నమస్కారణా నంతర మా నగరి పెన్నునకు తన మనో నిర్వేదము విన్నవించి, తన కూఁతు తెఱం గెఱింగింప వేడుకొనెను. విష్ణువు మందహాస మొనరించి, వహాన సమయమున నాఁడి వరాహము మహీ మహిళ కెఱిం గించిన మాల దాసరి కథ తెల్పి, గోదాదేవి - 'విప్రలంభ దంభోళితా గాధ గాథార్థ సమేత గీత రసమున' ప్రొద్దు పుచ్చుచున్న దనియు, అది యొక యుత్తమ తపో విశేష మనియు నెఱింగించి, ఆమెను శ్రీరంగేశు సేవకై శ్రీరంగమునకు తోడుకొని పొమ్మని యుపదే శించెను. గోదాదేవి ప్రవర్తనమున భక్తి శృంగారములు రెండును మిళితములై యున్నవి. ఈ ఘట్టమున రాయలు - ఉజ్జ్వల శృంగార మును వర్ణించిన తెలుఁగు - స్తుతి కలితమై యలరారుచున్నది. ఆమె భక్తి కలరి, శ్రీ రంగేశుఁడే ఆమెను వలచి, తానుగా శ్రీవిల్లిపుత్తూరున కరిగి ఆమెను పెండ్లాడెను. భక్తుల యెడ శ్రీహరి ప్రకటించు నిరుప మాన కరుణా విలాసమున కిదియు నొక తార్కాణము.

## భగవన్నామ సంకీర్తన మాహాత్మ్యము

ఆముక్తమాల్యదయందలి కథలలోని కెల్ల అతి హృద్యమైనది మాల దాసరి కథ. ఇది - సంకీర్తన మాహాత్మ్యమును, భాగవతుల ప్రభావమును, శాస్త్రంబు లెడ నధీతి బోధములే కాని, ఆచరణ

ప్రచారములు గల భక్తికిని గల తారతమ్యమును చక్కగా బోధించు
చున్నది. బ్రహ్మరాక్షసుఁడు మహా పండితుఁడు; మాల దాసరి మహా
భక్తుఁడు. ఆ భక్తి సంపదచే మాల దాసరి సోమ శర్మకు బ్రహ్మ
రాక్షసత్వమును బాపుటయే కాక, భాగవత శ్రీయును గలిగింపఁ
జాలెను. సంకీర్తన ఫల మమేయ మని తెల్పుటయే యీ కథ పర
మార్థము. అందుకొఱకే విష్ణువు విష్ణు చిత్తున కీ కథ తెలిపెను.
బ్రహ్మ రాక్షసుఁడు తన కొక్క నాటి పాట ఫలం బిమ్మన్నను, అందు
సగ మిమ్మన్నను, పాతిక పా లిమ్మన్నను - మాల దాసరి - చంచల
మైన శరీరము కొఱకై, పాట ఫల మొసంగుట - కర్పూరంబు పెట్టి
యుప్పు గొనుట వలె తెలివి తక్కువ యగు నని అట్లిచ్చుట కంగీ
కరింపఁ డయ్యెను. మఱియు నతఁడు - కైశికి గాన ఫలంబు తా
నెఱుంగఁ డనియు, పరమేశుని ముఖోల్లాసమే ఫల మనియు, ఆ స్వామి
కైంకర్యముల ఫల మిం తింత యని గణించు శక్తి ప్రాజ్ఞులకు
లే దనియు. అది యిం తింత యని తెల్పి, అందుఁ గొంత గొమ్మనుట
బాధకం బనియు వివరించెను. దీనివలన, సంకీర్తన ఫల మెంత మహ
త్తరమో తెలియుచున్నది. 'మీ వంటి భాగవతులు పావనులఁ గఁ
జేయరేని, మఱి గతి యేదీ మా వంటివారి కిఁక' నని బ్రహ్మ రాక్ష
సుఁడు పల్కుట - భాగవతుల అతిలోక మాహాత్మ్యమును ప్రకటించు
చున్నది. అతఁడు తన యెడ దయ చూపవలె నని ప్రార్థించుచు,
భగవ ద్రామానుజులు భాగవత పరిషత్తునకు మేలు కలుగవలె నను
నుద్దేశముతో, రంగేశ్వర దేవాలయ గోపురం బెక్కి, గీతా చరమార్థ
ముచ్చైస్స్వరమున నుచ్చరించుటయు, తరువాత సుందర జామాత్రవ
తారమును, శఠకోపావతారమును దాల్చి, లోక హితమును సమ
కూర్చుటయు, హయ వదన పదారాధకుఁడైన వేంకటనాథుఁ డను
మనీషి (వేదాంత దేశికుఁడు) - అగస్త్యోర్వీరుహమునకు నిర్వాణ
మొసంగుటయు మాల దాసరి కెఱింగించెను. ఈ గాథలు కూడ,

భాగవతుల మహా మహిమానుభావమును వెల్లడి చేయుచున్నవి
ఈ కథయందు మాల దాసరి - తాను వామనుని భజించి, తిరిగి
రాగా - జగత్సర్గ స్థితి లయ కారణుడగు విష్ణువుతో మఱొక
వేల్పు - సమానుఁడని గణించిన పాతకము పాలౌదునని శాప
చేసెను. భాగవతులకు విష్ణుపారమ్యమునం గల ప్రత్యయమున కిది
తార్కాణము.

## విష్ణుచిత్తుని మహాభాగ్యము

విష్ణుచిత్తుఁడు శ్రీవిల్లిపుత్తూరునందలి దేవుని యుపదేశము
ననుసరించి, కూఁతుతో శ్రీరంగమున కరిగెను. ఈ సందర్భమున,
రాయలతఁడు శ్రీరంగేశుని భజించిన తెఱంగంతయు వర్ణించెను.
విష్ణుచిత్తుఁడు శ్రీరంగేశుని స్తుతించిన పద్యములలో - నారాయణుని
రూప గుణ మహాత్త్వములు వెల్లడిచేయఁబడినవి. అతఁడు సర్వేశ్వ
రుఁడు, సర్వాధికుఁడు, అనంతుఁడు, అప్రకాశుఁడు, అభేద్యుఁడు,
సమస్త లోక భూమ్యాది గౌరవ సద్వస్తు విస్తారముకంటెను గరిష్ఠత
గల పరమ పురుషుఁడు. అజ శివాదికర్తయు, సమస్త జగత్తును అతని
యందే ప్రభవించి, వర్తించి, డిందుచుండును. అతఁడు సమస్త భూత
మయుఁడు, పరాత్పరుఁడు, పరమ యోగీంద్రులు ముక్తికై సదా
అతనినే భావించుచుందురు. అతనియందు సత్త్వాదిజములైన ప్రాకృత
గుణముల సందడి మృగ్యము. అతఁడు సర్వ భూతములకంటెను
ఆద్యుఁడు, శుద్ధుఁడు. కళా కాష్ఠా నిమేషాది రూపమైన కాలమును
నడుపు నాతని దివ్యశక్తి - యింద్రియ సమూహములకు గోచరము
గాదు. అతఁడు నిర్లేపుఁడై వెలుగుట నతి విశుద్ధుఁడయి. ఔపచారిక
స్తుతి బరమేశుఁడై వర్తించును. విష్ణుచిత్తుఁడు గోదాదేవిని గానక,
అబ్రహ్మణ్యము చెప్పి మొఱ పెట్టఁగా - శ్రీరంగేశుఁడు భాగవత
క్షోభమునకు భయపడి, 'ఆమె యింటిలోనే యున్నది, మఱొక్కసారి
పోయి చూడు' మని సూచించెను. ఈ వృత్తాంతము - భాగవత
క్షోభము భగవంతునిఁగూడ సడలించు ననువిషయమును వ్యక్తీక
రించుచున్నది.

## బహువిధ భక్తి నిరూపణము

ఆముక్తమాల్యద యందలి కథలలో - పలు విధములైన భక్తులు గోచరించుచున్నవి. విష్ణుచిత్తునియందు దాస్యార్చన సఖ్య భక్తులును, మాల దాసరి కథయందు మాధుర్య సంకీర్తనాత్మ నివేదనములును, యామునాచార్యునియందు జ్ఞాన విశిష్టమైన భక్తియు గోచరించుచున్నవి. కవి - ఎడ నెడ శరణాగతి ధర్మమును గూడ ప్రసక్తికిఁ దెచ్చి, అది మోక్ష సామ్రాజ్య సంపాదనమునకు నిరపాయమైన యుపాయ మని తెలిపియున్నారు.

## రాయల వైష్ణవ మతాభిమానము

కావ్యారంభమునఁ గావించిన యిష్టదేవతా స్తోత్రమునందే గాక, ప్రబంధమున నంతటను రాయలు తన వైష్ణవ మతాభిమానమును ప్రదర్శించినాఁడు. వైష్ణవ సంప్రదాయము లన్నియును ఆతఁ డెఱుంగును. 'కదళీ గభీర వృష్ణ పుటికా చ్ఛట' 'ఆ నిష్ఠా నిధి గేహసీమ' 'వింగడం బైనట్టి ముంగిట నెలకొన్న బృందావని ప్రముగ్గ వెట్టు' 'నీరజేక్షణుఁ డప్పేళ నిద్ర దెలిసి' మున్నగు పద్యము లందును తార్కాణములు. విష్ణుచిత్తుఁడు దేవుని యానతి శిరసా వహించి, మధుర కేగు సమయమున రాయలు - 'భక్తిఁ ద్రోవకు సాధ్వి పరికరంబులు వెట్టి కట్టిన పోరి విళంగాయగములు' ఇత్యాది పద్యములలో వైష్ణవ సంచారారంభ సంభ్రమమును, సోమశర్మ వైష్ణవుఁడైన సందర్భమునందలి 'స్నిగ్ధ త్రిభాగ ముండిత శిరశ్శిఖ తోడ' అను పద్యమును, వైష్ణవ బ్రాహ్మణుని యాకృతిని, 'చమురైనతో లుక్కబు నమ్ము టెంకియు' ఇత్యాది పద్యములలో - మాల దాసరి స్వరూపమును చక్కగా వర్ణించియున్నాఁడు. ఈ విధముగా శ్రీకృష్ణదేవరాయ లొక ప్రబంధమును రచించినను, అందప్పటి సంప్రదాయము ననుసరించి, లౌకిక శృంగారమును వర్ణింపక, వస్తు సందర్భోచితముగ తాత్త్విక వాసనలు గుబాళింపఁజేసి. వైష్ణవ సంప్రదాయమును, విష్ణు పారమ్యమును ప్రకటించుచు, దాని నొక ప్రబంధ రాజముగా సంతరించినాఁడు.

# కవి పండిత పరిచయము

## శ్రీ వంగవోలు ఆదిశేష శాస్త్రి

వీరి జననము - పింగళ సంవత్సర చైత్ర బహుళ ఏకాదశీ సోమవారము. (17-4-1917) జన్మస్థానము - నాగండ్ల. ప్రకాశము జిల్లా. వీరు చీరాల మునిసిపల్ హైస్కూలులో స్కూలు ఫైనలు వరకు విద్యాభ్యాసము గావించిరి. స్వయం కృషితో - మదరాసు విశ్వ విద్యాలయ విద్వాన్, ఆంధ్ర విశ్వ విద్యాలయమున బి. ఏ; బి. యి.డి, కాశీ విశ్వ విద్యాలయమున ఎం. ఏ. (ఇంగ్లీషు) డిగ్రీలు పొంది, జిల్లా పరిషత్తు - ఉన్నత పాఠశాలలో ప్రధానాంధ్రోపాధ్యాయులుగా చిర కాలము పని చేసిరి. కవితా వ్యవసాయమును చేబట్టి, స్వగ్రామమున బాలసరస్వతి కుటీర గ్రంథ మాలను నిర్వహించుచు, అనేక కావ్యములను రచించి, వెలువరించిరి. అందు ముఖ్యమైనవి :- హరి స్మృతి, రామతీర్థస్వామి, ఆనంద సాగర స్తవము, శ్రీరామ తారావళి, అభ్యుదయశ్రీ, యశోధర, మరుత్సందేశము, నివేదనము, బ్రహ్మానంద లహరి, కళాదర్శము మున్నగునవి.



## శ్రీమాన్ చిలకపాటి విజయ రాఘవాచార్యులు

వీరి జననము విరోధి కార్తీక బహుళ చవితి. (9-11-1949)



జన్మస్థానము నెల్లూరు జిల్లా - గూడూరు (మాతామహుల స్థానము.) జననీ జనకులు : నమ్మాళ్వార్, లక్ష్మీకాంత గారలు.

విజయ రాఘవాచార్యుల వారు ఆంధ్ర విశ్వవిద్యాలయములో రాజనీతి శాస్త్రమున ఎం. ఏ, ప్రభుత్వ పాలనా శాస్త్రమున ఎం. ఏ. పరీక్షలలో సర్వోత్తములుగా ఉత్తీర్ణులైరి. సంస్కృతములో - పోస్టు గ్రాడ్యుయేట్ డిప్లొమా సంపాదించిరి.

1972 నుండి 1976 వరకు - విజయవాడలో నున్న శాతవాహన కళాశాలలో రాజనీతి శాస్త్రోపన్యాసకులుగా, మానవీయ శాస్త్ర విభాగాధిపతులుగా పని చేసిరి. 1976 నుండి నాగార్జున సాగర్‌లో - ఆంధ్ర ప్రదేశ్ గురుకుల కళాశాలలో పని చేయుచున్నారు.

తమ మామగారగు 'కుల తిలక' శ్రీమాన్ దూవాటి రంగ రామానుజాచార్యులవారి ఉత్సాహ ప్రోత్సాహములతో - 'శ్రీ వైష్ణవ సమాచార సంస్థ'ను, 'కల్యాణ కల్పవల్లి'ని స్థాపించి, కార్య దర్శి పదవిని కడు సమర్థతతో నిర్వహించిరి.

వీరి రచన లనేకములు పత్రికలలో ప్రచురింపబడినవి. శాస్త్రీయ సంగీతము, నృత్యము, సాహిత్యము మున్నగువానియందు వీరికి అభిరుచి అధికము. భాగవతులతో సంబంధము కలిగియుండుటలో వీరు ప్రత్యేకమైన ఆనందమును పొందుచుందురు. విశిష్టాద్వైతము పట్ల విశ్వాసము, ధార్మిక జీవనమునందు ఆసక్తి, అధ్యాపనమునందు తృప్తి, దివ్య క్షేత్ర సందర్శనమునందు సంతృప్తి - వీరికి సహజ సిద్ధములు.

## శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు

వీరి జననము : దుందుభి నామ సంవత్సర చైత్ర శుద్ధ నవమి (6-4-1922) జననీ జనకులు : తిరువేంగళమ్మ, శ్రీనివాసాచార్యులు గారలు. విద్యాభ్యాసము : విజయ నగర సంస్కృత కళాశాలలో 'వ్యాకరణ విద్యా ప్రవీణ', భాషా ప్రవీణ'. కాశీ - హిందూ విశ్వ విద్యాలయమున సంస్కృతములో - ఎం ఏ ఉభయ వేదాంత శిక్షణ: శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులవారి వద్ద. ఉద్యోగములు : శ్రీకాకుళము, మదరాసు, కాకినాడ రాజమండ్రి పట్టణములందలి ప్రభుత్వ కళాశాలలో సంస్కృతోపన్యాసకులు. ప్రస్తుత నివాసము - విశాఖపట్టణము.

వీరు ఉభయ భాషలలో - ఉభయ వేదాంతములలో ఉద్దండ పండితులు. మహా వక్తలు. దేశమున నాల్గు చెరగులలో పర్యటించి, సంప్రదాయ బద్ధములైన వివిధ విషయములపై అనేక మహోప న్యాసము లొసంగి, ఘన సన్మానములను పొందిరి. రచనలు : (1) మహా భాష్యము - పస్పశాహ్నికము (తెలుగు అనువాదము) (2) వాక్య పదీయము (తెలుగు అనువాదము - తెలుగు అకాడమీ ప్రచురణము) (3) తిరుప్పావై (తెలుగు వివరణము) (4) సుందర కాండము - తత్త్వ దీపిక (తెలుగు వివరణము) (6) శ్రీ తత్త్వము - భగవత్తత్త్వము (ఉపన్యాస సంకలనము) (7) ఏడు కొండలు - ఏడు కొండలు మున్నగునవి.

## శ్రీమాన్ కొమాండూరు వేంకట గోపాల కృష్ణమాచార్యులు

వీరి జననము 1895. జన్మ స్థానము గుంటూరు. నిర్యాణము 1958.



ఆంధ్ర, గీర్వాణ, ఆంగ్ల, హిందీ భాషలలో వీరు మహా పండితులు. బి. ఏ. పట్టభద్రులు. ఉభయ వేదాంత విశారదులు. సదాచార సంపన్నులు. సాహిత్య, వ్యాకరణ, అలంకార, వేదాంత శాస్త్ర నిష్ణాతులు. హయగ్రీవోపాసకులు. శ్రీ లక్ష్మీనృసింహసమారాధకులు.

ఆంధ్ర హర్ష చరిత్ర, కావ్య కుసుమాంజలి, హంస సందేశము, శ్రీకృష్ణ లీలా విలాసము, మాఘా మోదము, భగవద్రామానుజ వైభవము అను పద్య కావ్య ప్రబంధములను వీరు రచించిరి వీనిలో-శ్రీకృష్ణ లీలా విలాసమును ఆంధ్రాస్థాన కవీంద్రు లగు బ్రహ్మశ్రీ - శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిలవారికి కృతి ఇచ్చిరి. వారు వీరికి సభా ముఖమున - 'విద్వత్కవిరాజ' బిరుదమును, కాశ్మీరు శాలువను సగౌరవముగా నొసంగి సత్కరించిరి.

వీరి గద్య పద్య రచనలు - భారతి, సాహితి, ఆంధ్ర పత్రిక మున్నగు పత్రికలలో ప్రచురింపబడినవి. ఆకాశవాణి - విజయవాడ రేడియో కేంద్రమునుండి, పాదుకా సహస్రముపై చేసిన వీరి ప్రసంగము పలువురి ప్రశంసలకు పాత్రమైనది

శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు

వీరి జననము 1924. జన్మ స్థానము జగ్గయ్యపేట. ప్రస్తుత నివాసము విజయవాడ.

వీరు సంస్కృతాంధ్ర ద్రావిడ భాషల నభ్యసించిరి. తర్క, వ్యాకరణ, అలంకార, సంగీత శాస్త్రములను, ద్రావిడ దివ్య ప్రబంధములను అధ్యయనము చేసిరి. 'సంగీత సాహిత్య కళానిధి' యను బిరుదును సంపాదించిరి. విజయవాడ - ఆకాశవాణీ నిలయ సంగీత విద్వాంసులుగా ప్రశస్తి గాంచిరి. వాయులీన వాదనమున చిరయశము నార్జించిరి. అనేక సమ్మానములు పొందిరి.



త్యాగరాజ చరిత్రము, నారాయణ శతకము, బిడాల మోక్షము మున్నగు వీరి తెలుగు కావ్యములును, 'నరసింహ తాండవమ్' అను నొక హరికథయు, భూ ప్రశంస, చంద్రకళా షోడశీద్వయి, నౌకా చరితమ్, రామాయణ కథాయాం వ్యపదేశాః మొదలగు సంస్కృత కావ్యములును ముద్రణ భాగ్యమును పొందినవి. క్షేమేంద్రుని కళా విలాసమున కనువాదము, వేదాంత దేశికుల యతిరాజ సప్తతి కనువాదము, సింహావలోకనమ్ (సంస్కృతము), శ్రీనివాస కల్యాణము, రామకృష్ణ పరమహంస, వరదాభ్యుదయము (హరి కథలు), విప్రనారాయణ (యక్ష గానము) మున్నగునవి ముద్రణ భాగ్యమును పొందవలసి యున్నవి.

నాట్యకళ, గానకళ మొదలగు పత్రికలలో - వీరి సంగీత సాహిత్య వ్యాసము లనేకములు ప్రకటింపఁబడినవి. త్యాగరాజు, రామదాసు, గోదాదేవి మొదలగు వీరి హరికథా కాలక్షేపములు పండిత ప్రశంసలకు పాత్రము లైనవి. ఫిడేలు వాద్యములో - ఆసేతు శీతాచలము పెద్ద పెద్ద సభలలో వీరి ప్రక్క వాద్యము, సోలో కచేరీలు అనేకములు జరిగినవి. ఆంధ్ర ప్రదేశ్ సంగీత అకాడమీ పక్షమున వీరు పెక్కు చోట్ల సంగీతమునుగూర్చి ఉపన్యాసము లొసంగిరి. 1982 డిసెంబరులో - మద్రాసు మ్యూజిక్ అకాడమీలో- సంగీతోత్సవమున, విద్వత్పరిషత్తులో - సంగీతమును గురించి తమిళ ములో ప్రసంగించి, శ్రోతల మన్ననల బడసి, ఘన సన్మానము నందిరి.

## శ్రీమాన్ కె. వి. వి. యల్. నరసింహాచార్యులు

వీరి పూర్తి పేరు - కొమాండూరు వేంకట వరద లక్ష్మీనరసింహాచార్యులు. జననము 1928. జన్మ స్థానము గుంటూరు.

వీరు ఆంధ్రా యూనివర్సిటీనుండి బి. ఏ. (ఆనర్సు), ఎం. ఏ., డిగ్రీలు పొందిరి. ఎం. ఏ. లో - యూనివర్సిటీ ఫస్టుగా ఉత్తీర్ణత నందిరి. మద్రాసు లా కాలేజీలో చదివి, బి యల్. డిగ్రీ పొందిరి. ఆంధ్రా యూనివర్సిటీలో - ఫిలాసఫీ లెక్చరర్ గా నియమితులైనను ఆ పదవి నధిష్ఠింపక, 1951 నుండి, గుంటూరులో న్యాయవాద వృత్తి నవలంబించి, లా ప్రాక్టీసు చేయుచు - పేరు, ప్రఖ్యాతి గాంచిరి.



వీరు - తండ్రిగారగు శ్రీమాన్ 'విద్వత్కవిరాజ' - కొమాండూరు వేంకట గోపాల కృష్ణమాచార్యులవారి వద్ద సంస్కృత సాహిత్యమును, విశిష్టాద్వైత వేదాంతమును, ఆంధ్రాయూనివర్సిటీలో - ప్రొఫెసర్ : శైలేశ్వరసేన్, ఎం. ఏ, పి. హెచ్. డి; డి. లిట్. వారి వద్ద అద్వైత వేదాంతమును అభ్యసించిరి. ఆంధ్ర, ఆంగ్ల, సంస్కృత విద్వాంసులుగా విఖ్యాతి వహించిరి. చార్వాక, బౌద్ధ జైన, సాంఖ్య దర్శనములను గురించి గ్రంథములు వ్రాసిరి. ఈ గ్రంథములు ముద్రణా భాగ్యమును పొందవలసి యున్నవి.

వీరు హిందూ లా కు సంబంధించిన వ్యాసము లనేకము లు వ్రాసిరి. అవి - లా జర్నల్సులో ప్రచురితములై, పలువురిచే ప్రామాణికములుగా పరిగణింపబడినవి.

వీరు — నాగార్జున యూనివర్సిటీలోను, ఎ. సి. కాలేజీలోను పార్టుటైం లా లెక్చరర్‌గా కొంత కాలము పని చేసిరి. అనేక సభలలో వివిధ విషయములపై ప్రసంగించిరి. ఆంధ్ర ప్రదేశ్ ఆస్థాన కవి వరేణ్యు లగు మధ్వశ్రీ - కాశీ కృష్ణాచార్యులవారిచే 'బాల విద్వత్కవి' బిరుదమును పొందిరి.



డాక్టర్. దివాకర్ల వేంకటావధాని

వీరి జననము **1-7-1913.** జన్మ స్థానము : అకుతీగపాడు. పశ్చిమ గోదావరి జిల్లా. నివాసము : హైదరాబాదు - 27.

విద్యా వ్యాసంగము :- యస్. యస్. యల్. సి 1929. ఇంటర్ మీడియట్ 1931. (ఫస్టు క్లాసు.) ఎం. ఏ (ఆనర్సు) ఆంధ్రా యూనివర్సిటీ 1937. 'నాటక పితామహుఁడు' అను విషయముపై పరిశోధన. పిహెచ్. డి ఉస్మానియా యూనివర్సిటీ - 1956. తెలుఁగు సాహిత్యము - నన్నయ భారతము వఱకు పరిశోధన.



ఉద్యోగములు : విశాఖ పట్టణము సందలి ఏ.వి.యన్. కాలేజీలో 1934 జూన్ నుండి, 1951 జూన్ వఱకు ఆంధ్ర భాషా శాఖాధ్యక్షులు. 1951 నుండి 1967 వఱకు ఉస్మానియా యూనివర్సిటీ - ఆర్ట్సు కాలేజీలో ఆంధ్రోపన్యాసకులు. 1957 నుండి 1964 వఱకు - ఆ కాలేజీలోనే తెలుఁగు రీడరు. 1964 నుండి 1973 వఱకు ఉస్మానియా యూనివర్సిటీ తెలుఁగు ప్రొఫెసరు, ఆంధ్రశాఖాధ్యక్షులు. 1973 నుండి 1974 వఱకు ఆ యూనివర్సిటీలోనే ఆనరరీ ప్రొఫెసర్. 1975 నుండి 1979 వఱకు యు. జి. సి. ప్రొఫెసర్.

బిరుదులు .- (1) శ్రీ విక్రమ దేవ వర్మ మహారాజు గారిచే 'కవి భూషణ. (2) ఆంధ్ర యూనివర్సిటీ వారిచే 'కళా ప్రపూర్ణ.

పదవులు :- (1) ఆం ప్ర. సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యులు, ఉపన్యాసకులు. (2) కేంద్ర సాహిత్య అకాడమీ జనరల్ కౌన్సిలులో రెండు సార్లు సభ్యులు. (3) విశ్వనాథ వారికి 'జ్ఞాన పీఠ' బహుమతి లభించు తరుణమున, 'జ్ఞాన పీఠ' బహుమాన సలహా సంఘమునకు అధ్యక్షులు. (4) ఒకప్పుడు యూనివర్సిటీ లన్నింటిలో -

బోర్డు ఆఫ్ తెలుగు స్టడీసులో సభ్యులు. (5) వీరి పర్యవేక్షణమున 14 మంది పండితులు పిహెచ్. డి. డిగ్రీలు పొందిరి

రచనలు :- పద్య కావ్యములు : (1) రాజ సందర్శనము. (2) మధు వనము (3) కవి పరాజయము. (4) పుష్పబాణ విలాసము. (5) త్రింశతి. (6) సుందర సందేశము. (7) మనో బోధ. పరిశోధన :- (8) ప్రాఙ్నన్నయ యుగము. (9) నన్నయ భారతము. (10) ఆంధ్ర నాటక పితామహుఁడు. (11) ఆంధ్ర వాఙ్మయ చరిత్ర. (12) సాహిత్య సోపానములు. (12) నన్నయ భట్టారకుఁడు. రచన గ్రంథములు, వ్యాసములు :- (14) కావ్య లహరి. (15) ప్రకృతి విజయము. (16) గురు శిష్యులు. (17) మార్గ దర్శకులు. (18) కాదంబరీ కథ. (19) కిరాతార్జునీయము. (20) రాజ రాజు. (21) వేమన యోగి. (22) వ్యాస మాల (150 వ్యాసముల సంపుటము). (23) నన్నె చోడుని భాషా విశేషములు. (24) కవి త్రయము. (25) పోతన. (26) విశ్వనాథ కవి సమ్రాట్టు (27) శ్రీ విద్య గద్య రామాయణము. (28) శివ భక్త విజయము. (29) ఆం. ప్ర. సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యుల ప్రశంస. (30) అబ్దుల్ కలాం అజాద్ స్మారక సంచిక అనువాదము. (32) మళయాల వాఙ్మయ చరిత్రకు అనువాదము. (33) బల్గేరియా చరిత్రకు అనువాదము. నాటకములు :- (34 కౌముదీ మహోత్సవము (సంస్కృతము) (35) నాగానందము. వ్యాకరణము :- (36) సంస్కృత వ్యాకరణము. ఆంగ్లములో :- (37) Potana - Makers of Indian Litarature (38) Telugu in 30 Days (39) History of Telugu Litarature. సంస్కృతములో :- (40) షిరిడీ సాయి సుప్రభాతము. (41) సూర్య సుప్రభాతము. ఇవియే గాక, భారతము మొదలగు అనేక గ్రంథములను పరిశోధించి, పరిష్కరించి, పీఠికలు వ్రాసిరి 'శ్రీ విద్య' యను పత్రికకు, అనేక సన్మాన సంచికలకు సంపాదకత్వము వహించిరి. ఆంధ్ర ఆంగ్ల, సంస్కృత భాషలలో శతాధిక వ్యాసములు వ్రాసిరి. అయ్యవి - సాహిత్య, ధార్మిక పత్రికలలో ప్రకటింపఁబడినవి. ఇపుడు యజుర్వేదముపై రెండు సంపుటములలో వ్యాఖ్యానము వ్రాసిరి. సాహిత్య - ధార్మిక విషయములపై శతాధికములైన వీరి ప్రసంగములు ఆకాశవాణిలో ప్రసారితములైనవి.

# సవరణల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 5 | సుమనోరాధ్యా | విబుధారాధ్యా |
| 8 | 11 | ధర్మాంబక | ధర్మాంబకం |
| 10 | 4 | కష | కష్ట |
| 10 | 11 | అసురకియే | అసురక్తియే |
| 11 | 4 | భకి | భక్తి |
| 11 | 8 | విద | విద్య |
| 13 | 15 | పేరుగా | పేర్లుగా |
| 13 | 17 | ట్లగును, | ట్లగును |
| 36 | 23 | [శుద్యాకదశీవారము | ద్వాదశీ శుక్రవారము |
| 39 | 6 | వాడు | వాడి |
| 50 | 21 | శ్లోకము | శ్లోకము |
| 59 | 6 | మపనులో | మనసులో |
| 62 | 23 | పీ తైః | పీతైః |
| 62 | 25 | స్మరింను | స్మరింతు |
| 66 | 26 | దుసవలెను | కానవలెను |
| 67 | 16 | ఉపాసింనుటయే | ఉపాసించుటయే |
| 81 | 24 | సదార్థములను | పదార్థములను |
| 83 | 24 | నిర్యాణ | నిర్వాణ |
| 88 | 20 | స్ఫులింగో | స్ఫులింగో |
| 89 | 4 | జిరాజిల్లు | విరాజిల్లు |
| 95 | 17 | మణి | మణి |
| 96 | 20 | సౌలభ్య | సౌలభ్యము |
| 101 | 18 | భజంగ | భుజంగ |
| 115 | 26 | సుచరింపుము | స్మరింపుము |
| 121 | 8 | మనంత దీ | మనంత దీప |
| 123 | 17 | బడినది | బడినది |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 135 | 10 | సద్వమయుడగు | సర్వాస యుడగు |
| 137 | 18 | పహ్నికణ | ఎహ్నికణ |
| 137 | 23 | కిచక | కీచక |
| 138 | 14 | ్శ్రీకముర్తైస | శ్రీకమూర్తైన |
| 147 | 23 | లతావాలము | లతాలవాలము |
| 149 | 11 | విపనారాయణుం | విప్రనారాయణుం |
| 150 | 23 | చెత | చేత |
| 154 | 20 | లిత | కలిత |
| 156 | 18 | లొచనా | లోచనా |
| 157 | 11 | నినద బుల్ | నినదంబుల్ |
| 157 | 16 | డుడె | డుండె |
| 153 | 7 | స్త్వైరా | స్వైరా |
| 152 | 7 | కూపముస | కూపమున |
| 152 | 17 | ర గ | రంగ |
| 165 | 6 | జ భారి | జంభారి |
| 167 | 3 | భాధలన్ | బాధలన్ |
| 168 | 23 | బంధముతొ | బంధముతో |
| 169 | 11 | బ ధ | బంధ |
| 170 | 16 | శబ్ద బుస | శబ్దంబున |
| 171 | 22 | నిష | నిష్ఠ |
| 172 | 21 | ముద్దోర డ | ముద్దోరండ |
| 173 | 18 | వద్యా | ఎధ్యా |
| 174 | 11 | పరియి పరే | పరియింపరే |
| 176 | 21 | సిటా | సీతా |
| 176 | 21 | పరాకుశ | పరాంకుశ |
| 180 | 18 | అను | అను |
| 181 | 6 | పటించిరి | పఠించిరి |
| 181 | 7 | అర్ద | అర్థ |
| 183 | 3 | సంతరము | నంతరము |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 183 | 9 | నాలాయిణ | నాలాయిర |
| 184 | 7 | సంగిత | సంగీత |
| 186 | 11 | బని | జని |
| 186 | 25 | శి చి | శించి |
| 189 | 22 | వానిసద్ద | వారివద్ద |
| 193 | 13 | రాజమును | రాజ్యమును |
| 198 | 25 | అ కూర | ఆ కూర |
| 198 | 24 | యామునావార్యుచే | యామునాచార్యులే |
| 202 | 2 | యాము లు | యామునులు |
| 202 | 24 | మవి | మని |
| 204 | 7 | జ్ఞానము | జ్ఞానము |
| 204 | 25 | మీమాంసకలు | మీమాంసకులు |
| 205 | 14 | మనుమాస | మనుమాన |
| 208 | 17 | మైసది | మైనది |
| 210 | 1 | 310 | 210 |
| 210 | 11 | ప్రవరింప | ప్రవర్తింప |
| 211 | 24 | యుస | యున |
| 220 | 8 | విశెష | విశేష |
| 224 | 10 | యత్వంత | యత్యంత |
| 226 | 19 | అతిలాక | అతిలోక |
| 227 | 14 | అపకాసుడు | అప్రకాశుడు |
| 227 | 22 | డుపు | నత్తపు |

—※—

# శ్రీ రామానుజ కీర్తి కౌముది

## ఆఱవ భాగములో

# రానున్న రచనలు

—*—

౧. శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము (తెలుగు అనువాదము)
*శ్రీమాన్ ప్రతివాదిభయంకర వేదాంతాచార్యులు*

౨. ఆళ్వారుల తాత్త్విక దృక్పథము
*శ్రీమాన్ ఘనకుధరం వరదాచార్యులు*

3. శ్రీ రామానుజావతరణము
*పూజ్యశ్రీ - శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి*

౪ శ్రీ రామానుజ యుగము - నాటి సాంఘిక పరిస్థితులు
*శ్రీ గూడ సుందరరామయ్య*

౫. శ్రీమద్రామానుజులు - శ్రీ వేంకటాచలము
*శ్రీమాన్ టి. కె. వి. యన్. సుదర్శనాచార్యులు*

౬. శ్రీ రామానుజ వాఙ్మయము - తద్విశేషము
*శ్రీమాన్ విళాల శేషాచార్యులు*






